సాక్షి

# ఫన్‌డే

ఆదివారం :: 4 డిసెంబర్ 2016

డిసెంబర్ 5
ఇంటర్నేషనల్ వాలంటీర్ డే

ఇంటర్నేషనల్ వాలంటీర్ డే... స్వచ్ఛంద సేవలకు ఐక్యరాజ్యసమితి కిరీటం పెట్టిన రోజు. గుడ్డితాతను రోడ్డు దాటించడం, పనిమనిషి కూతురికి చదువుచెప్పడం, అనాథాశ్రమంలో బర్త్‌డే పార్టీ చేసుకోవడం, వృద్ధాశ్రమంలో పెళ్లి చేసుకోవడం, డాక్టర్‌గారు ఉచిత వైద్యం చేయడం, ఇంజనీర్ ఊరి చెరువు మీద బ్రిడ్జికి ఉచితంగా ప్లాన్ ఇవ్వడం, నిస్సహాయంగా ఉన్న గర్భిణిని ఆటోవాలా ఉచితంగా ఆస్పత్రికి తరలించడం, న్యాయవాదులు ఉచితంగా కేసు పోరాడటం, మందుల కంపెనీలు ఉచితంగా మందులు పంపిణీ చేయడం, జవాను తన సాహస గాథను వినిపించడం, ఒక ఆటగాడు ఉచితంగా శిక్షణ ఇవ్వడం, కరాటే మాస్టర్ ఆడపిల్లలకు ఆత్మరక్షణ నేర్పడం, శాస్త్రవేత్తలు రైతుకు కొత్త సాగు విధానం చూపడం, పోలీస్ మామ ట్రాఫిక్ నిర్వహణ నేర్పడం, గాయకుడు పాట పాడించడం, నర్తకుడు నాట్యం నేర్పడం, చిత్రకారుడు కుంచె పట్టించడం.... ఇలా మనందరిలోనూ ఇవ్వడానికి ఏదో ఒకటి ఉంటుంది. ఇస్తారని నమ్ముతున్నాం. స్వచ్ఛందాన్ని స్వచ్ఛఅందంగా మారుస్తారని నమ్ముతున్నాం.



# స్వచ్ఛఅందం

## సేవకు వేళాయెరా

ప్రతీకాత్మక చిత్రం

# మాతృత్వ

## ఫెర్టిలిటి సెంటర్

### తెలంగాణ ప్రజలకు శుభవార్త!

డిసెంబరు 4న ప్రారంభం

నేడు హైదరాబాదు
ఫిల్మ్‌నగర్‌లో ప్రారంభం
సెల్: 8099922897



నరిగ్గా మూడు సంవత్సరాల క్రితం నలుగురు వ్యక్తుల కల నేడు
దక్షిణ భారతదేశంలో సంతానలోపంతో ఎడారిలా మారిన
వేలాది కుటుంబాల్లో బోసినవ్వుల్ని పండించింది. వారు
డాక్టర్ యారాశి పద్మలత, డాక్టర్ రేఖా రాజేష్, డాక్టర్ మంజునాథ్, డాక్టర్ పి.జోన్స్
వీరి కృషి ఫలితం ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలతో పాటు తెలంగాణలోని
లక్షలాది మంది ఆదరాభిమానాలు వెంటరాగా దిగ్విజయంగా అడుగులో
అడుగు వేసుకుంటూ ముందుకు సాగిపోతున్నారు.

శ్రీ వేంకటేశ్వరుని పాదాల చెంత తొలిగా ప్రారంభమైన మాతృత్వ ఫెర్టిలిటి సెంటర్
వెంటవెంటనే కోరమంగళ, బెంగుళూరు, కర్నూలు
ప్రస్తుతం హైదరాబాదు!
తెలంగాణ రాష్ట్రంలోని మారుమూల ప్రాంత వాసులు, హైదరాబాదువాసులు
ఎంతో శ్రమకోర్చి మాతృత్వ ఫెర్టిలిటీ సెంటర్లకు
ప్రయాణం చేసేవారు. వారందరికి అందుబాటులో వుండేలా ప్రస్తుతం
నగరం నడిబొడ్డున ఫిల్మ్‌నగర్‌లో అత్యంత ఆధునాతనంగా,
నూతన సాంకేతిక పరిజ్ఞానంతో నెలకొల్పబడింది.

6 హైదరాబాదు
5 కర్నూలు
4 బెంగుళూరు
3 తిరుపతి
2 హొసూరు
1 ప్రొద్దుటూరు

ADVT

## • టాప్ స్టోరీస్



## • జాతీయాలు



## కుండోదరుడు!

ఉదరం కుండలా ఉండే రాక్షసుడే కుండోదరుడు.

ఈ బాన కడుపు రాక్షసుడు... ఎప్పుడు చూసినా 'ఆకలి ఆకలి' అన్నట్లుగా ఉండేవాడట.

ఎంత తిన్నా ఆ తిన్న తృప్తి కంట్లో కనిపించేది కాదట.

ఎంత తిన్నా ఇతనికి సరిపోయేది కాదన్నమాట.

'కుండోదరుడు' జాతీయాన్ని రెండు సందర్భాలలో వాడుతుంటారు.

ఏం తిన్నా, ఎంత తిన్నా తృప్తి పడని తిండిబోతుల విషయంలోనూ, జీతంతో తృప్తి పడక లంచాలకు మరిగిన అధికారుల విషయంలోనూ వాడుతుంటారు.

ఉదా:

'అది కుండోదరుడి కడుపు. ఎంత తిన్నా సరిపోదు'

'లంచం ఇస్తేగానీ ఏ పని చేయడు. కుండోదరుడి ఆకలి అది'

## కథల కామరాజు!



జరిగిన విషయం గురించి చెప్పడం ఒక పద్ధతి.

'ఇలా జరిగుంటే బాగుంటుంది' అనుకోవడం ఒక పద్ధతి.

మొదటిది మన అధీనంలో లేదు.

రెండవది మన అధీనంలో ఉంటుంది.

అంటే... జరగని దాన్ని జరిగినట్లు, అసాధ్యమైన విషయాన్ని సాధ్యమైనట్లు చెబుతుంటారు.

అయితే వీటిని నమ్మించేలా చెప్పడం అనేది అందరికీ సాధ్యం కాదు.

కొందరు మాత్రం అబద్ధాలు, అభూతకల్పనలను ఒక కథలా అప్పటికప్పుడు చెప్పి 'నిజమే' అని భ్రమింపజేస్తారు. ఇలాంటి వాళ్లను కథల కామరాజు అంటారు.

**ఉదా:** 'ఆయన మాటలు నమ్మేవు సుమా... ఉత్త కథల కామరాజు'

## అసిమిలోనిదొకటి అమ్మేదొకటి!



వ్యాపారంలో జరిగే మోసాల విషయంలో ఉపయోగించే జాతీయం ఇది.

కొందరు వ్యాపారులు తమ సరుకు నాణ్యత గురించి లేని గొప్పలు చెప్పి...

'చూశారు కదా' అని మచ్చుకు కొన్ని వస్తువులు చూపుతారు. అవి నాణ్యంగా ఉంటాయి కాబట్టి... పెద్దగా ఎవరూ సందేహించరు. అయితే సదరు వ్యాపారి మాత్రం 'మచ్చు'గా చూపినవి కాకుండా తక్కువ నాణ్యమైనవి అమ్ముతుంటాడు. అంటే లోన ఒకటి బయట ఒకటి!

**ఉదా:** 'ఆ దుకాణంలోకి వెళ్లేవు. అసిమిలోనిదొకటి. అమ్మేదొకటి'

## మృత్యువు పంచాంగం చూసి పని చేయదు!



మృత్యువు తిథి, వారాలు చూసి పనిచేయదు కదా!

ప్రమాదం ఎక్కడుంటే అక్కడ వాలిపోతుంది తప్ప దానికి టైమ్‌తో పని లేదు!

'ఇది మంచి సమయం కాదు. ఇప్పుడు వెళ్లొద్దు' అనుకోదు.

అనుక్షణం మృత్యువు పొంచి ఉంటుంది అని తెలియచెప్పడమే 'మృత్యువు పంచాగం చూసి పనిచేయదు' అనే మాట ఉద్దేశం.

**ఉదా:** 'ముహూర్తం చూసిగాని బయటికి వెళ్లని నువ్వు. డ్రైవింగ్ విషయంలో చాలా నిర్లక్ష్యంగా ఉంటావు. నీకు పంచాంగం ఉంటుందేమోగానీ... మృత్యువుకు ఉండదని గుర్తుంచుకో. మృత్యువు పంచాంగం చూసి పని చేయదు'


ఫన్‌డే మీద మీ అభిప్రాయాలను, సూచనలను మాకు తెలియజేయండి. ప్రియదర్శిని రామ్, ఎడిటర్, ఫన్‌డే, సాక్షి దినపత్రిక, 6-3-249/1, రోడ్ నం.1, బంజారాహిల్స్, హైదరాబాద్ - 34. funday.sakshi@gmail.com



బుక్ డిజైనింగ్: కుసుమ

• న్యూ ఫేస్

# నారికేళంతో నవనవ

చలికాలంలో చర్మరక్షణ అగ్నిపరీక్షే. ముఖ్యంగా పొడి చర్మం ఉన్నవారికి ఇదో గడ్డు సమస్య. ముఖవర్ఛస్సును కాపాడుకోవడానికి పడరాని పాట్లు పడుతుంటారు. మార్కెట్‌లో దొరికే కోల్డ్‌క్రీములతోనూ పెద్దగా ఫలితం కనిపించక సతమతమవుతుంటారు. అలాంటి వారి కోసం తేలికగా ఇంట్లోనే తయారు చేసుకోగల కొబ్బరిపాల ఫేస్‌ప్యాక్...



**కావలసినవి:** కొబ్బరిపాలు – రెండు టీస్పూన్లు
పసుపు – అర టీస్పూన్, చందనం – అర టీస్పూన్
రోజ్‌వాటర్ – నాలుగైదు చుక్కలు

**తయారీ:** తాజా కొబ్బరిని మిక్సీలో గ్రైండ్ చేసుకోవాలి. తురుముగా మారిన కొబ్బరి నుంచి కొబ్బరిపాలను తీసుకోవాలి. కొబ్బరి పాలలో పసుపు, చందనం వేసి బాగా కలపాలి. అందులో నాలుగైదు చుక్కల రోజ్‌వాటర్ వేసుకోవాలి. ఈ మిశ్రమాన్ని ముఖానికి పట్టించి, అరగంటసేపు ఆరనివ్వాలి. ఆ తర్వాత గోరువెచ్చని నీటితో శుభ్రంగా ముఖం కడుక్కోవాలి. ఈ ప్యాక్ వేసుకున్న తర్వాత ముఖం కడుక్కోవడానికి సబ్బు బదులు సున్నిపిండి వాడితే ఫలితం మరింత మెరుగ్గా ఉంటుంది. ముఖం నవనవలాడుతూ కనిపిస్తుంది.

• కిసుక్కు



యజమాని: మా హోటల్‌కి 'అతిథి' అని పేరు పెట్టడం పెద్ద పొరపాటైంది...
కస్టమర్: ఏమైంది?
యజమాని: హోటల్లో భోజనం చేసి 'నేను మీ అతిథినే' అంటూ బిల్లు కట్టకుండానే వెళ్లిపోతున్నారు.

– షేక్ అస్లాం షరీఫ్, శాంతినగర్

• మీకు తెలుసా



జపాన్‌లోని చిన్‌సెకికన్‌లో రాళ్ల మ్యూజియం ఉంది. ఈ మ్యూజియంలో మొత్తం 1,700 రాళ్లు ఉన్నాయి. ఈ రాళ్లు మనిషి ముఖాన్ని పోలి ఉండడం మరో విశేషం!



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## థైరాయిడ్ సమస్యలకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ప్రస్తుత కాలంలో మానవుడు ఉరుకులు-పరుగుల జీవన విధానం గడుపుతున్న నేపథ్యంలో అధిక మానసిక ఒత్తిడికి గురి కావడం, వ్యాయామ లోపం మరియు సరైన ఆహార నియమాలు పాటించకపోవటం వంటి అంశాల కారణంగా ఎన్నో రకాల అనారోగ్య సమస్యల బారిన పడటం జరుగుతోంది. వాటిలో ముఖ్యంగా ఎక్కువ మందిలో కనిపించేవి థైరాయిడ్ సమస్యలు. ఇతర వైద్య విధానాలలో థైరాయిడ్ సమస్యలకు కేవలం హార్మోన్‌ల సప్లిమెంట్ అందించటమే తప్ప పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కేవలం హోమియో చికిత్స ద్వారా మాత్రమే ఈ వ్యాధులను పూర్తిగా నయం చేయవచ్చు.

మానవ శరీరంలోని అతి ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ గ్రంథి ఒకటి. ఇది మెడ ముందు భాగంలోని కంఠం దగ్గర సీతాకోకచిలుక ఆకారంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. సహజంగా మన శరీరంలోని హైపోథలామస్ ద్వారా విడుదలయ్యే TRH (థైరోట్రాపిన్ రిలీజింగ్ హార్మోన్) హార్మోన్ సంకేతంతో - పిట్యుటరీ గ్రంథి శరీరంలోని థైరాయిడ్ హార్మోన్‌ల స్థాయిలను గుర్తించి, TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్) హార్మోన్‌ను విడుదల చేస్తుంది. ఈ హార్మోన్ థైరాయిడ్ గ్రంథిని ఉత్తేజపరచటం ద్వారా, అది T3, T4 హార్మోన్‌లను ఉత్పత్తి చేసి, రక్తప్రవాహంలోకి పంపుతుంది. ఇలా రక్తప్రవాహంలో కలిసిన హార్మోన్‌లు శరీర కణాలన్నింటికీ చేరుకుని, అన్ని జీవక్రియలైన - గుండె, నాడీమండలం, జీర్ణవ్యవస్థ, మానసిక మరియు శారీరక ఎదుగుదల, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతానోత్పత్తి వ్యవస్థ వంటి వాటిపై ప్రభావం చూపుతాయి. ఇలా నిరంతరం శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లను తగిన స్థాయిలో ఉంచే హైపోథలామస్, పిట్యుటరీ, థైరాయిడ్ హార్మోన్‌ల వ్యవస్థ విఫలమైనప్పుడు, హార్మోన్‌ల అసమతుల్యత ఏర్పడి, అవి ఎక్కువగా లేదా తక్కువగా ఉత్పత్తి కావడం ఒక ఖచ్చితమైన సమస్యగా పరిణమించి, హైపర్‌థైరాయిడిజం లేదా హైపోథైరాయిడిజం మరియు గాయిటర్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తుంది.




**(1) హైపోథైరాయిడిజం:** శరీరంలోని థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపోథైరాయిడిజం అంటారు. ఇది సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. ఏ వయస్సు వారిలోనైనా ఈ సమస్య ఏర్పడవచ్చు. ముఖ్యంగా చిన్నపిల్లలలో మరియు స్త్రీలలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. **లక్షణాలు: చిన్నపిల్లలలో** - బుద్ధిమాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం లేకపోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం మొ॥వి. **యుక్తవయస్సు వారిలో:** బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, రజస్వల ఆలస్యం కావడం, ఋతుచక్ర సమస్యలు - నెలసరి రాకపోవడం, నెలసరిలో అధిక లేదా అల్ప రక్తస్రావం కావడం, సంతానలేమి, చర్మం పొడిబారడం, చలికి తట్టుకోలేకపోవడం, బద్ధకంగా ఉండటం, త్వరగా అలసిపోవడం, నిద్ర సరిగా పట్టకపోవడం, ఏకాగ్రత లోపించడం కీళ్ళు మరియు కండరాలు నొప్పులకు గురి కావటం వంటి లక్షణాలను గమనించవచ్చు. **(2) హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు శరీరంలో ఎక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపోథైరాయిడిజం అంటారు. **లక్షణాలు:** ఆహారం సరైన మోతాదులో తీసుకున్నప్పటికీ బరువు తగ్గిపోవటం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం కావడం, సంతానలేమి సమస్యలు, చెమటలు ఎక్కువగా పట్టడం, చేతులు వణకడం, వేడిని తట్టుకోలేకపోవడం, గుండెదడ, విరేచనాలు, జుట్టు రాలిపోవటం, అర్టికేరియా వంటి చర్మసమస్యలు ఏర్పడటం వంటి లక్షణాలను గమనించవచ్చు. **(3) గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అని అంటారు. కొన్ని సందర్భాలలో థైరాయిడ్ గ్రంథి - సహజ పరిమాణం కంటే రెండింతలు పెరిగి, స్వరపేటికపైన ఒత్తిడిని కలిగించటం వలన స్వరంలో మార్పు వస్తుంది. గాయిటర్‌లో థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4) సాధారణ స్థాయిలో ఉన్నప్పటికీ గాయిటర్ వ్యాధి లేనట్లుగా నిర్ధారించలేము. **కారణాలు:** ఈ గాయిటర్ వ్యాధికి అతి ముఖ్యమైన కారణం 'అయోడిన్' అనే మూలకం యొక్క లోపం ఏర్పడటం. **లక్షణాలు:** గొంతు క్రింద అసహజ వాపు ఏర్పడటం వలన ఆహారం మింగడానికి కష్టంగా ఉంటుంది. స్వరంలో మార్పులు రావటం, కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం వంటి లక్షణాలను గమనించవచ్చు.

**థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు:** నేటి మానవుని జీవన విధానం ప్రకృతి విరుద్ధంగా ఉండటం, అధిక మానసిక ఒత్తిడికి గురి కావటం, శారీరక శ్రమ తక్కువగా ఉండటం, వ్యాయామం లేకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన మరియు వంశపారంపర్యత వంటి అంశాల కారణంగా ఈ థైరాయిడ్ సమస్యలు ఉత్పన్నమవుతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, TSH, యాంటీ థైరాయిడ్ యాంటీ బాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్, గొంతు యొక్క CT స్కాన్ వంటి పరీక్షల ద్వారా థైరాయిడ్ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** చాలా మందికి - థైరాయిడ్ సమస్యలకు తాము తీసుకుంటున్న మందులు కేవలం హార్మోన్ సప్లిమెంట్‌లు మాత్రమేనన్న విషయం తెలియని కారణంగా వారు థైరాయిడ్ సమస్యకు జీవితకాలం మందులు వాడటం తప్ప వేరే మార్గం లేదని అనుకుంటారు. కానీ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ చికిత్సా విధానంలో, రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలపై పూర్తిగా అధ్యయనం జరిపి, ఆ రోగిని వ్యక్తిగతీకరించడం ద్వారా ఆ రోగికి సరిపడిన ఔషధాలను గుర్తించిన అనంతరం మాత్రమే చికిత్సను అందించడం జరుగుతుంది. తద్వారా అసమతుల్యతలకు గురి అయిన హార్మోన్ స్థాయిలను సరిచేయడం వలన, జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా ఈ వ్యాధి పూర్తిగా నయం అవుతుంది.



అన్ని పనులు అమ్మ నేర్పినవే: తల్లి మాధురితో దామిని





# కాలి వేళ్లే కదిలే కుంచెలై!

**ప్రతిబంధకం అనుకునేవాళ్లకు ప్రతీది ప్రతిబంధకమే. పట్టుదల ఉన్నవాళ్లకు ప్రతి సవాలు విజయమే.**

**దా**మినికి పుట్టుకతోనే రెండు చేతులు లేవు. అయితే తన అసౌకర్యాన్ని గురించి ఆమె ఎప్పుడూ బాధ పడుతూ కూర్చోలేదు. చేసే పనిలోనే ఉత్సాహం వెదుక్కుంది. ఆర్టిస్ట్‌గా తనకంటూ ఒక గుర్తింపు తెచ్చుకుంది.

గంట వ్యవధిలో కాలిబొటన వేలుతో 38 బొమ్మలు గీయడం ద్వారా 'గోల్డెన్ బుక్ ఆఫ్ వరల్డ్'లో చోటు సాధించింది. కాలి బొటనవేలే కుంచెగా చిత్రకళలో రాణిస్తోంది రాయ్‌పూర్ (చత్తీస్‌గఢ్)కు చెందిన దామిని.

బీయస్సీ మొదటి సంవత్సరం చేస్తున్న దామిని చదువులో కూడా మంచి ప్రతిభ చూపుతుంది. కాలి బొటనవేలితో ఎలా రాయాలో దామినికి చిన్నప్పుడు నేర్పించింది తల్లి. ఒకరోజు దామిని తన బొటనవేలితో బొమ్మ గీస్తుంటే చూసింది తల్లి. కూతురికి చిత్రకళ మీద ఆసక్తి ఉన్న విషయాన్ని కనిపెట్టి ఆ దిశగా ప్రోత్సహించడం ప్రారంభించారు తల్లిదండ్రులు. తల్లి మాధురిసేన్ అయితే కూతురు కోసం ఎన్నో కొత్త విషయాలు నేర్చుకుంది. తానే ఒక విద్యార్థిగా మారింది.

''మా అమ్మ నన్ను ప్రతి క్షణం ప్రోత్సహించింది. అండగా నిలిచింది'' అని తల్లి గురించి ప్రశంసగా చెబుతుంది దామిని.

దామిని మనసులో 'నిరాశ' అనేది ఎప్పుడూ తొంగిచూడకుండా తల్లి మాధురి సేన్ ఎప్పటికప్పుడు ఆత్మస్థైర్యం నింపేది.

''బాగా చదవడం ద్వారా సొంతకాళ్ల మీద నిలబడే ధైర్యం వస్తుంది'' అని ఎప్పటికప్పుడు కూతురికి చదువు విలువ తెలియజెప్పేది.

హాబీగా మొదలైన 'ఆర్ట్' దామిని దైనందిన జీవితంలో భాగమైంది.

''బొమ్మలు సాధన చేస్తున్నప్పుడు నాలో తెలియని ఉత్సాహం వెల్లువెత్తుతుంది'' అంటున్న దామిని కాళ్ల సహాయంతో బట్టలు ఉతకడం, ఐరన్ చేయడం, వంట చేయడం... మొదలైన పనులు కూడా సొంతంగా చేస్తుంది.

''అన్ని అవయవాలు సరిగ్గా ఉన్నా...ఏదో కోల్పోయినట్లు నిస్తేజంగా కనిపిస్తారు చాలామంది. ఈ అమ్మాయిని చూసి నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది'' అనిపిస్తుంది అంటారు ఇరుగు పొరుగు.


హెల్త్ ల్యాబ్
14వ పేజీలో

''దేవుడు మనకో అందమైన జీవితాన్ని ఇచ్చాడు. దాన్ని సార్థకం చేసుకోవాలి'' అని నమ్ముతుంది దామిని. పనిలో పట్టుదల, ఉత్సాహం మాత్రమే కాదు దామిని మాటలో 'పరిణతి' కూడా కనిపిస్తుంది.

''నాకు ఈ లోపం ఉంది అని ఎప్పుడైతే అనుకుంటామో...మన మీద మనకే జాలి మొదలవుతుంది. అయితే మనకు కావల్సింది జాలి కాదు...అంతు లేని ఉత్సాహం. నేను చేయగలను. చేస్తాను అనుకుంటే విజయాలు మన వెంటే నడుస్తాయి'' అంటుంది దామిని.

''మిగిలిన విద్యార్థులతో పోల్చితే దామిని ధారణశక్తి గొప్పగా ఉంటుంది. ఒక్కసారి వింటే మరచిపోదు'' అంటున్నాడు దామినికి పాఠాలు చెప్పిన ఉపాధ్యాయుడు హరీష్ జోషి.

''బొటనవేలితో ఎలా రాయాలో అమ్మ నేర్పించింది. అయితే బయట నలుగురి ముందు రాయడానికి సంకోచంగా ఉండేది. ఎవరైనా నవ్వుతారేమోనని అనుమానంగా ఉండేది. బయటి వాళ్ల గురించి ఆలోచించడం కాదు నా గురించి నేను ఆలోచించుకోవాలి అనుకున్నప్పుడు ధైర్యంగా ముందడుగు వేశాను'' అని చెబుతుంది దామిని.

బెంగళూరులో జరిగిన ఇండియన్ ఇంక్లూజన్ సమ్మిట్(ఐఐయస్)లో దామిని కూడా ఒక వక్తగా పాల్గొంది. 'ఐఐఎస్' అనేది ఎందరిలోనో స్ఫూర్తి, ఆత్మస్థైర్యాన్ని నింపే వేదిక. ఈ వేదిక ద్వారా ఆమె ఇచ్చిన ప్రసంగం మరింత మందికి చేరువై స్ఫూర్తిని ఇస్తుందనడంలో సందేహం లేదు.

ఐఏఎస్ ఆఫీసరై వికలాంగులకు సేవ చేయాలనేది దామిని కల. ఆమె ముందు ఇలాంటి కలలు ఎన్నో ఉన్నాయి. విజేతలకు కలలు కనడంతో పాటు ఆ కలలను నిజం చేసుకునే సామర్థ్యం కూడా ఉంటుంది. దామిని తన కలలను నెరవేర్చుకోవాలని ఆశిద్దాం.

**• కిసుక్కు**



అప్పారావు: మా వాచ్‌మెన్ పేరు తెలిసినప్పటి నుంచి నాకు నిద్ర పట్టడం లేదు!

సుబ్బారావు: ఏంపేరు?

అప్పారావు: కుంభకర్ణేష్!

– షేక్ అస్లాం షరీఫ్, శాంతినగర్

**• మీకు తెలుసా**





జర్మనీలోని అగస్‌బర్గ్ యూనివర్శిటీ స్టూడెంట్స్ ఆ క్యాంపస్‌లో తిరిగే ఒక పిల్లితో ఆటలు ఆడుకోవడానికి తెగపోటీ పడతారు. దీనివల్ల తమలోని స్ట్రెస్ బయటికి వెళ్లిపోతుందని కూడా నమ్ముతారు. తమ ఫేవరెట్ మార్జాలానికి 'సమ్మి' అని పేరు కూడా పెట్టుకున్నారు.

• నెయిల్ ఆర్ట్

# నఖ నారింజలు...

ఇది లాక్వెర్ స్టయిల్ ఆరెంజ్ నెయిల్ ఆర్ట్. ఈ డిజైన్ చూపరులను బాగా ఆకట్టుకుంటుంది. దీన్ని వేసుకోవడానికి ఆరెంజ్, బ్లాక్, స్కై బ్లూ, వైట్ కలర్ నెయిల్ పాలిష్‌లతో పాటు ఓ ట్రాన్స్‌పరెంట్ పాలిష్‌ను సిద్ధం చేసుకోవాలి. ఈ నెయిల్ ఆర్ట్ గోళ్లు పొడవుగా ఉన్నవారికి భలేగా సూట్ అవుతుంది. ఆరెంజ్ కలర్ డ్రెస్ లేదా శారీ ధరించినప్పుడు ఈ డిజైన్‌ను వేసుకొని ఏదైనా పార్టీకి వెళ్లి చూడండి... అక్కడి వారి కళ్లన్నీ మీ గోళ్లపైనే ఉంటాయి. అంతలా కళ్లను కట్టేసే మ్యాజిక్ ఈ ఆర్ట్‌కు ఉంది. మరి ఆలస్యం చేయకుండా ట్రై చేయండి. ఎలా అంటే, ఇలా...




1. ముందుగా గోళ్లన్నిటినీ శుభ్రం చేసుకొని అందంగా కత్తిరించుకోవాలి. తర్వాత వాటన్నిటికీ ఆరెంజ్ కలర్ పాలిష్‌ను పూర్తిగా పూయాలి.
2. తర్వాత ఫొటోలో కనిపిస్తున్న విధంగా వైట్ కలర్ పాలిష్‌తో ఒక్కో గోరుపై ఒక్కో డిజైన్ వేసుకోవాలి.
3. అన్ని గోళ్లపై ఉన్న వైట్ కలర్ డిజైన్ మధ్యలో ఇప్పుడు స్కై బ్లూ కలర్‌ను పూయాలి.
4. ఇప్పుడు ఉంగరం వేలి గోరుపై వైట్ కలర్ పాలిష్‌ను కాస్తంత స్ప్రింకిల్ చేయాలి. ఆ చుక్కలు కాస్తంత దూరం దూరంగా పడేలా చూసుకోవాలి. మిగిలిన గోళ్లపై ఉన్న బ్లూ కలర్ డిజైన్‌పై బ్లాక్ కలర్‌ను అప్లై చేయాలి.
5. తర్వాత ఒక్క ఉంగరం వేలి గోరు మినహా మిగతా వాటిపై ఉన్న వైట్ కలర్ డిజైన్‌కు బ్లాక్ కలర్‌తో బార్డర్లు గీయాలి.
6. చివరగా అన్ని గోళ్ల అడుగుభాగంలో ఫొటోలో కనిపిస్తున్న విధంగా అన్ని రంగులను ఉపయోగించి డిజైన్‌ను పూర్తి చేయాలి. ఇప్పుడు అన్ని గోళ్లకు ట్రాన్స్‌పరెంట్ పాలిష్‌తో ఫినిషింగ్ కోట్ ఇస్తే.. గోళ్లందం మరింత పెరుగుతుంది.

● హెల్త్ కార్నర్



- రోగ నిరోధక శక్తి క్షీణించి తరచు జలుబు, దగ్గు ఇతర ఇన్ఫెక్షన్లకు గురయ్యే వారికి చలికాలం మరీ ఇబ్బందికరంగా ఉంటుంది. ఇలాంటి వారు రోగ నిరోధక శక్తిని మెరుగుపరచుకోవాలనుకుంటే రోజూ తిప్పతీగ ఆకు తాజాగా తీసుకుని, దాంతో నాలుగైదు తులసి ఆకులు కలిపి నమిలి తినాలి.

- చలికాలం చాలామంది జలుబు, దగ్గుతో బాధపడుతుంటారు. కరక్కాయలు, శొంఠి, మిరియాలు సమభాగాలుగా తీసుకుని పొడి చేసుకోవాలి. ఈ పొడిలో బెల్లం కలిపి చిన్న చిన్న ఉండలుగా తయారు చేసుకోవాలి. వీటిని బుగ్గన వేసుకుని చప్పరిస్తూ ఉంటే దగ్గు, జలుబు నుంచి ఉపశమనం కలుగుతుంది.

- చలికాలంలో తరచు ఎదురయ్యే అనారోగ్య బాధలకు చిలకడ దుంపలు చక్కని విరుగుడుగా ఉపయోగపడతాయి. చిలకడ దుంపలను ఉడికించుకుని లేదా కాల్చుకుని కాస్త ఉప్పు, మిరియాల పొడి చల్లుకుని తింటున్నట్లయితే రోగ నిరోధక శక్తి మెరుగుపడుతుంది.



- గొంతు బొంగురుపోవడం, ముక్కు దిబ్బడ వంటి సమస్యలు చలికాలంలో మామూలే. దాల్చిన చెక్క, మిరియాలు సమభాగాలుగా తీసుకుని పొడిగా చేసి, కషాయం తయారు చేసుకుని తాగుతున్నట్లయితే ఇలాంటి బాధల నుంచి త్వరగా ఉపశమనం కలుగుతుంది.

- చలికాలంలో గొంతు మంట, జలుబు, దగ్గు ఇబ్బంది పెడుతుంటే ఇంగువ మంచి విరుగుడుగా పనిచేస్తుంది. చెంచాడు తేనెలో కొద్దిగా ఇంగువ, అరచెంచాడు అల్లం ముక్కలు కలిపి తీసుకుంటే గొంతు బాధలు త్వరగా నయమవుతాయి.



● వాస్తు వీక్షణం

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
## గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్



### పంకవేధ

'పంకద్వారేశోకః' అని చెప్పబడినది. ప్రధాన ద్వారమునకెదురుగా పంకము (బురద, అడుసు) కాని ఉన్నట్లయితే ఆ గృహము 'పంకవేధ'అను వాస్తు దోషము ను కలిగి ఉంటుంది. **'పంకవేధా దోషపూరితమైన గృహములో నివసించువారు శోకమును, దుఃఖమును పొందుతూ ఉంటారు'...** అని అర్థము. గోయ్యి ఉన్న దగ్గరే బురద ఏర్పడుతుంది. బురద లేకున్నప్పటికీ ప్రధాన ద్వారమునకెదురుగా గోతులు ఉండకూడదు. **మామూలుగా ఉండే గోతులే కాకుండా నీళ్ళ సంపులు, బావులు, సెప్టిక్ ట్యాంక్‌లు మొదలైనవి పూర్తిగా గానీ, పాక్షికంగా గానీ ప్రధాన ద్వారానికెదురుగా ఉండకూడదు.** ప్రధాన ద్వారానికెదురుగా నడకలో గట్టి నేల ఉండటం వలన మంచి ఫలితాలను ఆశించవచ్చును. ఒకవేళ ద్వారమునకెదురుగా బురద గుంటలు గాని, గోతులుగానీ ఉండి శోకము, దుఃఖము, మనస్థాపము మొదలగు దుష్ఫలితాలతో సతమతమవుతున్న వాళ్ళు ఎవరైనా సరే... **ఆ గోతులను చక్కగా మట్టితోనింపి, చదును చేసి, గట్టి నేలగా తయారుచేసినట్లయితే... ఆ దోషము తొలగింపబడుతుంది.** అనతి కాలంలోనే దుష్ఫలితాలు తొలగిపోయి మంచి ఫలితాలు పొందటం ప్రారంభమవుతుంది. మంచి నిద్ర, మానసోల్లాసం, ఉత్సాహ పూరిత ప్రవర్తనను పొందగలుగుతారు. తద్వారా అనేకానేక లాభములు దరి చేరుతాయనటంలో సందేహము లేదు.

### కర్మదోషాలు-సులభమార్గాలు

▶ 22-6-2014 తేది **'వాస్తు వీక్షణం'** శీర్షికలో కమలాసన్ రెడ్డి, తిరుపతి గారికి మీరొక సలహా ఇచ్చారు. **నాకు కూడా అటువంటి సమస్యలే... అంటే అప్పులు ఎక్కువ అవ్వటము, అనుకున్న పనులు కాక పోవటము, ఇచ్చిన డబ్బులు తిరిగి రాక పోవటము మొదలగునవి ఉండటము వలన మీ సలహాను నేను కూడా ఆచరణలో పెట్టి చూశాను.** ఆ వారం రోజుల్లో ఫలితాలు అద్భుతంగా వచ్చాయి. పనులు ముందుకు కదిలాయి. అప్పు చేయవలసిన అవసరము రాలేదు. రావలసిన పైకము కొంత చేతికందింది. ఈ మాత్రం ఫలితాలు కూడా ఆ పరిస్థితుల్లో నేను ఉహించలేదు. **నాకు అదొక అద్భుతం అనిపించింది.** మీకు వీలైతే ఆ సలహాని మరొక్కసారి పత్రికా ముఖంగా తెలియజేయండి. నాలాంటి కొన్ని లక్షల మంది మీ సలహాను ఆచరించి మంచి ఫలితాలు పొందాలని కోరుకుంటున్నాను.

**– ఎమ్. ఎస్. రావు, నెల్లూరు.**

**ఎంతో మంది పాఠకుల అభ్యర్థన మేరకు ఈ సలహా తిరిగి ప్రచురింపబడుతున్నది.**

అనుకున్న పనులు నెరవేరకపోవటానికి, అప్పులు పెరగటానికి, ఇచ్చిన డబ్బులు తిరిగి రాకపోవటానికి అనేక కారణాలుంటాయి. వాస్తు పరమైన దోషాల వలన ఇలాంటి ఇబ్బందులు ఎదురవుతుంటే.. వాస్తు దోషాలను సరిజేసుకోవటం వలన ఇబ్బందులు దూరమవుతాయి. వాస్తు బాగా లేనప్పుడు **'కర్మదోషాలు'** కూడా తీవ్రంగా బాధిస్తాయి. అందువలన వాస్తు సరి చేసుకోలేని పరిస్థితుల్లో (అద్దె ఇల్లు నివాసమైనప్పుడు) కర్మదోషాల తీవ్రతను తగ్గించుకునే సులభమైన మార్గాలను అశ్రయించటమే ఉత్తమ పద్ధతి. అటువంటి అనేక మార్గల్లో ఒక సులభతరమైన మార్గం చెబుతాను. ఆచరించి చూడండి.

**శనివారము ఉదయం ఏదైన గుడికి గాని, మరేదైనా ప్రార్థనా మందిరానికి గానీ వెళ్ళండి. ఉదయం 9 నుండి 10.30గం॥ మధ్యన మంచిది. దానం చేయాటానికి మీకు ఇబ్బందికలుగునంత చిల్లరను మాత్రమే తీసుకువెళ్ళి అక్కడ అడుక్కునే భిక్షుకులకు పంచండి. మొత్తం చిల్లరను పంచండి. మీ జేబులోగాని పర్సులోగాని డబ్బులు మిగల కూడదు. అలాగే తిరిగి వచ్చేసి మీ దైనందిన కార్యక్రమంలో బిజీ అయిపోండి. అంతే! తరువాత... ఆ వారం (7రోజులు) మీకెలా గడుస్తాయో గమనించండి. ఆశ్చర్యపోతారు.**

**... వచ్చేవారం 'కూపవేధ'**

**దంతూరివారి 'విశాఖ-విజయవాడ'లో వాస్తు పర్యటన: డిసెంబర్ నెల**
**విశాఖ: 4, 5 ఆది, సోమ-విజయవాడ: 11, 12 ఆది, సోమ**

**Cell: 988 544 6501, 988 544 9458**

మీ ప్రశ్నలు పంపించవలసిన చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
వాస్తు వీక్షణం, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.

**For Personal Visits & Appointments**
**Cell: 988 544 6501, 988 544 9458**
**Ph : 040 - 2781 7446, email : saisreevasthu@gmail.com**

‘ఎవరో వస్తారని... ఏదో మేలు చేస్తారని... ఎదురు చూసి మోసపోకుమా...’ అని పలికిన సినీ కవి వాక్కులు నిత్య సత్యాలు. ఎవరో వస్తారని... వచ్చిన వారు ఏదో చేస్తారని ఎదురు చూపులతోనే జీవితాన్ని గడిపేస్తే ఒరిగేదేమీ ఉండదు. ఎవరొచ్చినా, రాకున్నా మన వంతుగా మనం చేయగల పనిని, మనం చేయదగ్గ పనిని మనమే మొదలుపెట్టలేమా? ఎవరి కోసమో ఎదురు చూపులు చూడటం మానేసి నిస్సహాయ స్థితిలో ఉన్న ఇతరులకు సాయం చేయడానికి ఎవరికి వారే స్వచ్ఛందంగా ముందుకొస్తే జీవితంలో అంతకు మించినది ఏముంటుంది? సేవా సంకల్పమే మనసులోని స్వచ్ఛతకు తార్కాణం. జీవితంలోని అందానికి దర్పణం.

ఇతరులకు సాయపడటానికి అర్థబలమో, అంగబలమో అక్కర్లేదు. చిత్తశుద్ధితో కూడిన సంకల్పం ఉంటే చాలు. నిస్సహాయతలో ఉన్న ఇతరులను ఆదుకోవాలనుకునే మనిషికి సంకల్పమే సగం బలం. ఇతరుల పట్ల ఔదార్యాన్ని, వదాన్యతను చాటుకోవడానికి అపర కుబేరులే కానక్కర్లేదు. ఇతరుల బాధలకు స్పందించే సహృదయం ఉంటే చాలు. పురాణాల్లో, చరిత్రలో ఇందుకు ఎన్నో ఉదంతాలు, ఉదాహరణలు. ‘పన్ను’పోటును తప్పించుకోవడానికో, కనీసం తగ్గించుకోవడానికో కార్పొరేట్ కుబేరులు ‘సామాజిక బాధ్యత’గా వదాన్యతను చాటుకోవడం మనకు తెలియనిదేమీ కాదు. అదంత పెద్ద విశేషమేమీ కాదు గానీ, రెక్కాడితే గానీ డొక్కాడని సామాన్యులు, ఆదాయంలో పెద్దగా మిగుల్చుకునే అవకాశమే లేని దిగువ మధ్యతరగతి మనుషులు ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరుల మేలు కోసం చేస్తున్న గొప్ప గొప్ప పనులు అక్కడక్కడా మన దృష్టిలోకి రాకపోవు. ‘కార్పొరేట్’ వదాన్యతకు వచ్చినంత ప్రాచుర్యం సామాన్యుల సేవా కార్యక్రమాలకు రాకపోవచ్చు. అయితే, మనసున్న మనుషులకు స్ఫూర్తినివ్వడంలో సామాన్యులు చేపట్టే సేవా కార్యక్రమాలు తక్కువేమీ కాదు.

# స్వచ్ఛ అందం

## సేవకు వేళాయెరా

### ఉడుతే తొలి వాలంటీర్

వాలంటీరింగ్ అనే క్రియా పదం నుంచి పుట్టిన వాలంటీర్ అనే ఇంగ్లిష్ పదం మనకు ఆధునిక యుగంలోనే పరిచయమైంది. వాలంటీరింగ్‌ను స్వచ్ఛంద సేవగా అనువదించుకున్నాం మనం. వాలంటీర్స్‌ను స్వచ్ఛంద సేవకులని కూడా అంటున్నాం. ‘పరోపకారార్థం ఇదం శరీరం’ అని మనసా వాచా నమ్మిన మన దేశంలో స్వచ్ఛంద సేవ ఒక అనాది సంస్కృతి. పురాణాలను పరిశీలిస్తే మనకు తెలిసిన తొలి వాలంటీర్ రామాయణంలోని ఉడుతే! సీతను బంధించిన రావణుడిపై యుద్ధానికి రాముడు సన్నద్ధమైనప్పుడు లంకకు చేరుకోవడానికి సముద్రంపై సేతువును నిర్మిస్తున్న వానరులకు ఉడుత చేసిన సాయం మనమంతా ఎరిగినదే! వానర యోధులంతా సేతు నిర్మాణం కోసం బండరాళ్లను తరలిస్తుంటే, ఉడుత తన వంతుగా ఇసుక రేణువులను తరలించింది. సేతు నిర్మాణానికి సాయం చేసిన ఆ ఉడుత ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించలేదు. పురాణాల్లో శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, కర్ణుడు మొదలైన దానశీలురు ఎందరున్నా, ప్రతిఫలాపేక్ష లేని స్వచ్ఛంద సేవ గురించి చెప్పుకోవాల్సి వస్తే మాత్రం రామాయణంలోని ఉడుతను మించిన ఉదాహరణ దొరకదు. ఎంత సాయం చేశామన్నది కాదు, సాయం చేయడానికి మన దగ్గర ఏముందన్నది కాదు, చేసిన సాయానికి ఎంత ప్రచారం దక్కిందన్నదీ కాదు... అవసరంలో ఉన్న వాళ్లకు సాయం చేశామా లేదా అనేదే ముఖ్యం. అవసరంలో, ఆపదలో ఉన్న ఇతరులకు సాయం చేయాలనే సంకల్పం మరింత ముఖ్యం.

## మన చరిత్రలో వెయ్యేళ్ల కిందటే...

రామాయణంలోని ఉడుత సంగతి సరే, నిస్వార్థ స్వచ్ఛంద సేవకు సంబంధించి వెయ్యేళ్ల కిందటి మన చరిత్రలోనే మరో ఉదాహరణ ఉంది. క్రీస్తుశకం పదకొండో శతాబ్ది కాలంలో చోళ సామ్రాజ్యాన్ని పాలించిన రాజరాజ చోళుడు తంజావూరులో బృహదీశ్వర ఆలయ నిర్మాణాన్ని తలపెట్టాడు. దేశంలోనే అతిపెద్ద ఆలయాల్లో ఒకటైన ఈ ఆలయ నిర్మాణం పూర్తి కావడానికి దాదాపు ఎనిమిదేళ్లు పట్టింది. వందలాది మంది శ్రామికులు, శిల్పులు ఈ ఆలయ నిర్మాణంలో పాలు పంచుకున్నారు. యంత్ర పరికరాలేవీ అందుబాటులో లేని ఆ రోజుల్లో ఇంతటి బృహత్ నిర్మాణానికి వాళ్లంతా ఎంతటి కాయకష్టం చేసి ఉంటారో ఊహించుకోవాల్సిందే. కాయకష్టం చేస్తున్న ఆ శిల్పులకు, కార్మికులకు ఒక ముసలవ్వ తనవంతుగా ఏదైనా సాయం చేయాలనుకుంది. జీవనాధారానికి తగిన కొద్దిపాటి పాడిసంపద తప్ప ఏమీ లేని పేదరాలు ఆమె. అయితే, సాయం చేయాలనే ఆమె సంకల్పానికి పేదరికం అవరోధం కాలేదు. రోజూ అమ్ముకోగా మిగిలిన పాలను తోడుపెట్టి, మజ్జిగ చేసి ఆలయ నిర్మాణంలో పాలు పంచుకున్న కార్మికులకు, శిల్పులకు ఉచితంగా ఇచ్చి, అలసి సొలసిన వారి దాహార్తి తీర్చేదట. ఆనోటా ఈనోటా ఆమె సంగతి రాజరాజ చోళుడికి చేరింది. ముసలవ్వ చేస్తున్న సేవ గురించి తెలుసుకున్న రాజరాజ చోళుడు ముగ్ధుడయ్యాడు. ఆమె గౌరవార్థం ఆలయ ప్రాంగణంలో ఆమె విగ్రహాన్ని ఏర్పాటు చేశాడు.



బెంజమిన్ ఫ్రాంక్లిన్



ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్



జార్జి విలియమ్స్

## చరిత్ర ప్రసిద్ధుల స్వచ్ఛంద సేవ

ఇతరేతర రంగాలలో సుప్రసిద్ధులైన వారు కొందరు స్వచ్ఛంద సేవలో తరించిన ఉదంతాలు కొన్ని చరిత్రలో ఉన్నాయి. అమెరికా వ్యవస్థాపకులలో ఒకరైన బెంజమిన్ ఫ్రాంక్లిన్ యువకుడిగా ఉన్నప్పుడు ఫిలడెల్ఫియాలోని అగ్నిమాపక దళంలో కొన్నాళ్లు స్వచ్ఛంద సేవ చేశారు. అప్పట్లో స్వచ్ఛంద సేవ ఎక్కువగా వ్యక్తిగత స్థాయిలోనే ఉండేది. అలాంటి కాలంలో స్వచ్ఛంద సేవను తొలిసారిగా సంఘటితం చేసిన ఘనత ఇంగ్లాండ్‌కు చెందిన సర్ జార్జ్ విలియమ్స్‌కే దక్కుతుంది. కుర్రతనంలో అరాచకంగా గడిపినా, ఒక యాక్సిడెంట్ తర్వాత ఆయన పరివర్తన చెందాడు. చర్చికి వెళ్లడం మొదలుపెట్టాడు. చర్చికి వచ్చే వాళ్లలో నానా బాధలతో సతమతమయ్యే ఆర్తులు కూడా ఉండేవారు. వాళ్ల బాధలను తొలగించడానికి తన వంతుగా ఏదైనా చేయాలనుకున్నాడు జార్జి విలియమ్స్. ఆర్తులను ఆదుకునేందుకు స్వచ్ఛంద సేవ కొనసాగించేందుకు భావసారూప్యత గల తన తోటి యువకులు కొందరిని సంఘటితపరచి 1844లో యంగ్ మెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్ (వైఎంసీఏ) స్థాపించాడు. కాలక్రమంలో వైఎంసీఏ ప్రపంచవ్యాప్తంగా శాఖోపశాఖలుగా విస్తరించి, నేటికీ తన సేవా కార్యక్రమాలను కొనసాగిస్తోంది. ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ అమెరికా అధ్యక్షుడిగా ఉన్నకాలంలో పర్యావరణ పరిరక్షణ కోసం 1933లో సివిలియన్ కన్జర్వేషన్ కాప్స్ స్థాపించి, 300 కోట్ల మొక్కలు నాటడానికి దోహదపడ్డారు. ఈ కార్యక్రమంలో పౌరులను భాగస్వాములుగా చేయడంలో ఆయన సఫలీకృతులయ్యారు.

## సేవాపథంలో కొన్ని మైలురాళ్లు

స్వచ్ఛంద సేవలో రెడ్‌క్రాస్ సంస్థను తిరుగులేని మైలురాయిగా చెప్పుకోవచ్చు. అంతర్యుద్ధంతో అమెరికా అట్టుడికిపోతున్న సమయంలో గాయపడ్డ సైనికులకు సపర్యలు చేసి, వారికి ఆసరాగా నిలవాలనుకుంది క్లారా బార్టన్. ఆమె సంపన్నురాలేమీ కాదు. టీచర్‌గా, పేటెంట్ క్లర్క్‌గా పనిచేసేది. క్షతగాత్రులకు, ఆపన్నులకు సేవ చేయాలనే ఆమె సంకల్పమే రెడ్‌క్రాస్ సంస్థ స్థాపనకు నాంది పలికింది. తొలుత అమెరికన్ రెడ్‌క్రాస్‌గా మొదలైన సంస్థ అచిరకాలంలోనే అంతర్జాతీయ స్థాయికి విస్తరించింది. క్లారా బార్టన్ తన అరవయ్యో ఏట... 1881లో రెడ్‌క్రాస్ సంస్థను స్థాపించింది. ప్రపంచవ్యాప్తంగా శాఖోపశాఖలుగా విస్తరించిన రెడ్‌క్రాస్ సంస్థ ఇప్పటికే సేవా కార్యక్రమాలలో ముందంజలో ఉంటోంది. ఎక్కడ ప్రకృతి విపత్తులు తలెత్తినా, ప్రమాదాలు సంభవించినా ఆపన్నులకు ఆసరాగా నిలుస్తోంది. మన దేశంలో మదర్ థెరిసా స్థాపించిన 'మిషనరీస్ ఆఫ్ చారిటీ' స్వచ్ఛంద సేవారంగంలో మరో మైలురాయి. ఎక్కడో అల్బేనియాలో పుట్టి, ఇక్కడకు వచ్చిన ఆమె డార్జిలింగ్‌లో కొన్నాళ్లు టీచర్‌గా పిల్లలకు పాఠాలు బోధించారు. తర్వాత నన్‌గా మారి కలకత్తాకు వచ్చారు. కలకత్తాకు వచ్చిన తర్వాత కూడా కొన్నాళ్లు కాన్వెంట్‌లో పిల్లలకు పాఠాలు బోధించారు. అదే కాలంలో బెంగాల్ కరువు, మత కల్లోలాలు కలకత్తాను కుదిపేశాయి. ఎక్కడ చూసినా ప్రజలు రోగాలతో, దుర్భర దారిద్ర్యంతో అలమటించేవారు. వారిని చూసి చలించిన థెరిసా సేవామార్గం పట్టారు. అనాథలకు, ఆపన్నులకు తానే తల్లిగా మారారు. నిస్వార్థ సేవకు గుర్తింపుగా ఆమెను నోబెల్ శాంతి బహుమతితో పాటు పలు అంతర్జాతీయ అవార్డులు వరించాయి. మరణానంతరం ఆమెకు సెయింట్‌హుడ్ కూడా లభించింది.



క్లారా బార్టన్

*స్వచ్ఛంద సేవలో మార్గదర్శులుగా నిలిచిన మహానుభావులు ఎందరో... వారిలో కొందరి గాథలను మీతో పంచుకుంటున్నాం...*



## అపర అన్నపూర్ణ



అన్ని దానాల కంటే అన్నదానమే గొప్పదంటారు. అలాంటి అన్నదానాన్ని తన జీవితాంతం కొనసాగించిన 'అన్నపూర్ణ' ఒకరు మన తెలుగునాటనే ఉండేవారు. ఆమె పేరు డొక్కా సీతమ్మ. శతాబ్ది కిందట గోదావరి ప్రాంతాల్లో ఆమె పేరు ఎరుగని వారు ఉండేవారు కాదు. ఇంటికి ఏ వేళలో అతిథి అభ్యాగతులు వచ్చినా, లేదనకుండా వండి వడ్డించేవారామె. తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం మండలం మండపేట గ్రామంలో జన్మించారామె. ఆమె తండ్రి అనపిండి భవానీశంకరం. ఆయనను అందరూ 'బువ్వన్నగారు' అనేవారు. అడిగిన వారికి లేదనకుండా 'బువ్వ' పెట్టేవారు. అందుకే ఆయనకు ఆ పేరు వచ్చింది. లంకగన్నవరం గ్రామానికి చెందిన డొక్కా జోగన్న పంతులుతో వివాహమైంది. ఆయన భూవసతి గల రైతు, వేదపండితుడు, ఉదారుడు. సీతమ్మకు ఏనాడూ ఆంక్షలు పెట్టలేదాయన. సీతమ్మ దాతృత్వం ఇంగ్లాండు వరకు పాకింది. సొంత వనరులతోనే ఆమె సాగిస్తున్న సేవను తెలుసుకున్న అప్పటి బ్రిటిష్ చక్రవర్తి ఏడో జార్జి ఆమెను ఘనంగా సత్కరించాలనుకున్నారు. సన్మానం కోసం ఆమెను ఢిల్లీకి తోడ్కొని రావాల్సిందిగా అప్పటి మద్రాసు ప్రధాన కార్యదర్శిని ఆదేశించారు. సేవకు ప్రతిఫలం కోరనంటూ సన్మానానికి నిరాకరించిన నిరాడంబర వ్యక్తిత్వం ఆమెది. జీవితాంతం అన్నదాన యజ్ఞాన్ని కొనసాగించిన డొక్కా సీతమ్మను గోదావరి జిల్లాల ప్రజలు 'అపర అన్నపూర్ణ'గా ఇప్పటికీ భక్తిగా తలచుకుంటారు.

## బాల్యంలోనే పునాదులు వేయాలి




పిల్లలకు చిన్నప్పటి నుంచే సేవానిరతిని అలవరచాలి. ఇతరులతో పంచుకోవడంలో ఉన్న ఆనందాన్ని వారికి బోధపరచాలి. ఇతరులకు సాయం చేయడంలో ఉన్న సంతృప్తిని వారికి వివరించాలి. మంచి పనులు చేయడానికి బాల్యంలోనే పునాదులు వేయాలి. అప్పుడే వారు బాధ్యత గల పౌరులుగా ఎదుగుతారు. సేవా కార్యక్రమాల్లో పాల్గొనేలా తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు వారిని ప్రోత్సహించాలి. కొందరు పిల్లలు స్వతహాగానే ఇలాంటి కార్యక్రమాలపై ఆసక్తి చూపుతుంటారు. అలాంటి పిల్లలను మరింతగా ప్రోత్సహించండి. ఎలాంటి పనుల ద్వారా ఇతరులకు సాయం చేయవచ్చో వారికి మార్గదర్శకత్వం వహించండి. వ్యక్తిగత స్థాయిలో మనవంతుగా చేయగలిగే కొన్ని సేవా కార్యక్రమాలను మీ ముందు ఉంచుతున్నాం. ఇలాంటి ఆలోచనలతో మీరూ మీ వంతుగా స్వచ్ఛంద సేవ చేయవచ్చు.


స్వచ్ఛంద సేవ చేయడానికి ఎన్నెన్ని మార్గాలు ఉన్నాయో, అవకాశాలు ఉన్నాయో మీ పిల్లలకు చదివి చెప్పండి

## సేవకు శతకోటి మార్గాలు





ఇలాంటి అన్నార్తుల ఆకలి తీర్చండి



ఇలాంటి అభాగ్యులను ఆదుకోండి

వృద్ధులకు ఆసరాగా నిలవండి



ప్రమాదాల్లో గాయపడ్డ వారికి ప్రథమ చికిత్స చేయండి



పరిసరాలను శుభ్రంగా ఉంచండి



వీధిబడుల్లోని పిల్లలకు చదువు చెప్పండి

- వృద్ధుల్లో చాలామంది మొబైల్ ఫోన్లు వాడటం సరిగా తెలియక ఇబ్బంది పడుతుంటారు.అలాంటి పెద్దలకు స్మార్ట్‌ఫోన్ల వాడకానికి అలవాటు పడ్డ పిల్లలు, యువకులు తీరిక వేళల్లో కాస్త సాయం చేయవచ్చు. స్మార్ట్‌ఫోన్లు ఎలా వాడాలో నేర్పవచ్చు.

- నగరాలు, పట్టణాల్లో రద్దీ కూడళ్ల వద్ద రోడ్డు దాటడం మామూలు మనుషులకే కష్టం. అలాంటి కూడళ్లలో రోడ్డు దాటడంలో ఇబ్బందిపడే వికలాంగులు, వృద్ధులు ఎక్కడైనా తారసపడితే వారి మానాన వారిని వదిలేయకుండా వారిని సురక్షితంగా రోడ్డు దాటించవచ్చు.

- అపార్ట్‌మెంట్ ప్రాంగణంలో గానీ, స్కూలు ప్రాంగణంలో గానీ, కాలనీలో గానీ ఖాళీ మట్టి జాగా బోసిగా ఉన్నట్లయితే, అలాంటి స్థలాల్లో మొక్కలు నాటవచ్చు. ఆ మొక్కలు పెరుగుతూ ఉన్న కొద్దీ పరిసరాల్లో విస్తరించుకునే పచ్చదనం మనసుకు ఇచ్చే సంతృప్తే వేరుగా ఉంటుంది.

- బడికి వెళ్లలేని వీధిబాలలకు, బాల కార్మికులకు, చదువురాని పెద్దలకు చదవడం, రాయడం నేర్పించవచ్చు. ఉద్యోగాలు చేసుకునే వారు, రిటైరైన వారు కూడా తమకు తెలిసిన సబ్జెక్టులను పేద విద్యార్థులకు ఉచితంగా నేర్పవచ్చు.

- పుట్టినరోజు వంటి వ్యక్తిగత వేడుకలను ఇంట్లో ఆర్భాటంగా చేసుకునే బదులు ఆరోజు ఏదైనా అనాథాశ్రమానికి గానీ, వృద్ధాశ్రమానికి గానీ వెళ్లి అక్కడి వారికి పండ్లు, స్వీట్లు, పుస్తకాలు, దుస్తులు వంటివి పంపిణీ చేయవచ్చు.

- అత్యధిక జనాభా గల మన దేశంలో ఆకలి సమస్యతో బాధపడే వారి సంఖ్య తక్కువేమీ కాదు. పెళ్లిళ్ల వంటి వేడుకల్లో మిగిలిపోయి, వినియోగ యోగ్యంగా ఉన్న ఆహారాన్ని వృథాగా పారవేయకుండా, ఆకలితో అలమటించే నిరుపేదలకు పంచిపెట్టవచ్చు. కొన్ని నగరాలు, పట్టణాల్లో కొందరు యువకులు బృందాలుగా ఏర్పడి ఆహారాన్ని సేకరించి, పేదలకు పంచిపెడుతున్నారు. మీరూ అలాంటి బృందాన్ని తయారు చేయవచ్చు.

- రోడ్ల మీదుగా ప్రయాణిస్తున్నప్పుడు ఎక్కడైనా ప్రమాదాల్లో గాయపడిన బాధితులు కనిపించవచ్చు. అలాంటప్పుడు అంబులెన్స్‌కు సమాచారం ఇవ్వడం, బాధితులకు మంచినీరు తాగించడం, ప్రథమ చికిత్స చేయడం వంటి కనీస సాయాలు చేయవచ్చు.

- మీ అపార్ట్‌మెంట్‌లో లేదా కాలనీలో వృద్ధులెవరైనా ఒంటరిగా ఉంటున్నట్లయితే తరచుగా వెళ్లి వారి యోగ క్షేమాలు కనుక్కోవచ్చు. బజారుకు వెళ్లడం, ఆస్పత్రులకు వెళ్లడంలో వాళ్లకు సాయం చేయవచ్చు. వాళ్లకు కావలసినవేవైనా కొని తెచ్చివ్వవచ్చు.

**స్వచ్ఛంద సేవలో ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఇలాంటివి మీరూ కొన్ని చేస్తూ ఉండవచ్చు. మరికొన్ని కార్యక్రమాలు చేయాలని భావిస్తూ ఉండవచ్చు. స్వచ్ఛంద సేవకు సంబంధించి మీ ఆలోచనలను మాతో పంచుకోండి. కొత్తదనం ఉన్నవాటిని ప్రచురిస్తాం.**
**funday.sakshi@gmail.com**



# మగసిరి కోసం ముఖసిరీ అవసరం!

నోరు, చిగుళ్ల ఆరోగ్యం బాగా లేకపోతే అది పురుషుల్లో అంగస్తంభన సమస్యకు దారితీస్తుందంటున్నారు పరిశోధకులు. పంటి చిగుళ్ళు ఆరోగ్యంగా, పరిశుభ్రంగా ఉండటం పురుషపుంగవులకు చాలా అవసరమని ఈ పరిశోధనలు నిరూపిస్తున్నాయి. నోరు, చిగుళ్ళు ఆరోగ్యంగా లేకపోతే క్రమంగా గుండెజబ్బులు/ (కార్డియోవాస్కులర్ సమస్యలకు) రావచ్చనే సంగతి ఇదివరకే తెలుసు. దీంతోపాటు దీర్ఘకాలిక చిగుర్ల సమస్య ఉంటే అది పక్షవాతానికి దారితీసే ప్రమాదం ఉందనీ, దాంతో రక్తనాళాలు (ధమనులు) తమ సాగే గుణాన్ని కోల్పోవడం, గట్టిబారడం, పెళుసుగా మారడం (స్కెరోసిస్) కూడా తెలిసిన విషయమే. చిగుర్ల సమస్య (పెరియోడాంటైటిస్) పురుషుల్లో అంగస్తంభన సమస్య (ఎరక్టైల్ డిస్‌ఫంక్షన్)కు దారితీస్తుందని తాజాగా తెలిసింది. ''అయితే... మగసిరికీ, దంతసిరికీ నేరుగా ఉన్న సంబంధం (బయలాజికల్ మెకానిజమ్) ఇంకా స్పష్టంగా తెలియరాలేదు'' అంటున్నారు చైనాలోని గ్వాంగ్‌ఝూ మెడికల్ యూనివర్సిటీకి చెందిన పరిశోధకుడు డాక్టర్ జియాంగ్ ఝూవ్. 20 నుంచి 80 ఏళ్ల మధ్య వయస్కులైన దాదాపు రెండు లక్షలకు పైగా పురుషులపై చేసిన అధ్యయన ఫలితాలను ఆయన తన పరిశోధనల్లో పొందుపరిచారు. పెరియోడాంటైటిస్ అనే అంశం రక్తనాళాలు గట్టిబారడం వల్ల వల్ల ఎరక్టైల్ డిస్‌ఫంక్షన్‌ను ఎలా ప్రభావితం చేస్తుందనేది పరిశోధకులు ఊహిస్తున్నారు. అయితే నిర్దిష్టంగా దీనికి కారణం ఏమిటన్నది ఇంకా తెలియాల్సి ఉందంటున్నారు పరిశోధకులు.

# ఏజింగ్‌ను ఆపగలం!

వయసు పెరుగుతున్న కొద్దీ (ఏజింగ్) మనలో వచ్చే మార్పులన్నవి అందరికీ తెలిసిందే. ఏజింగ్ వల్ల కలిగే దుష్పరిణామాలు మానవజీవితంలో తప్పదని అందరూ అనుకునే మాట. కానీ వయసు పైబడటం వల్ల వచ్చే పరిణామాలు అన్నింటినీ ఆపవచ్చునని శాస్త్రవేత్తలు అంటున్నారు. పైగా వయసు పైబడినందు వల్ల జీవకణంలోని ఇంకా లోపలి అంశాలలో కలిగే మార్పులను గుర్తించి, అత్యంత సూక్ష్మమైన ఆ భాగాలనూ రిపేర్ చేయవచ్చని కాలిఫోర్నియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (కాల్‌టెక్) అనే సంస్థతో పాటు యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా, లాస్ ఏంజెలెస్ (యూఎల్‌సీఏ)కి చెందిన శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు. వాస్తవానికి ఇప్పటివరకూ కణంలోని బ్యాటరీ లేదా పవర్ హౌజ్ అని పేర్కొనే మైటోకాండ్రియాలో వచ్చిన మార్పులను ఎవరూ రిపేర్ చేయలేదు. ఇక వయసు పైబడుతున్న కొద్దీ ఆ డీఎన్ఏ నిర్మాణాలు తెగిపోవడం వల్ల ఏజింగ్ వల్ల జరిగే మార్పులు సంభవిస్తుంటాయి. కణంలోని దెబ్బతిన్న భాగాన్ని కణం తనంతట తానే స్వాహా చేసుకుంటుంది. ఇలా తనను తానే తొలగించుకోవడాన్ని ఆటోఫేజీ అంటారు. నిజానికి చాలా ఆసక్తికరమైన పరిశోధనలు ఈ రంగంలో జరుగుతున్నాయి. అల్జైమర్స్, పార్కిన్‌సన్స్ డిసీజ్ లాంటి ఏజింగ్‌తో వచ్చే వ్యాధుల్లో దెబ్బతిన్న కణాలను సైతం సమర్థంగా తొలగించి ఆ స్థానంలో ఆరోగ్యకరమైన కణాలు పెరిగేలా చూడటం ఈ చికిత్సలో భాగంగా చేస్తారు. అయితే ప్రస్తుతం ఇవి ప్రయోగదశలో ఉన్నాయి. ఈ పరిశోధనలు ఫ్రూట్‌ఫ్లై అనే కీటకంపై చేస్తున్నారు. మనుషుల్లో లాగే ఈ కీటకంలోని కండరాలు సైతం ఏజింగ్‌కు గురవుతాయి. జెనెటిక్ ఇంజనీరింగ్ ప్రక్రియ ద్వారా ఈ కీటకంలోని ఏజింగ్‌లో మొదట... ఎమ్‌టీ డీఎన్ఏలో ఏజింగ్ ప్రక్రియను మరింత త్వరగా అయ్యేలా చేశారు. అలా జరిగాక ఏజింగ్‌తో మార్పులు జరిగి వార్ధక్యం వచ్చిన డీఎన్ఏ భాగం దానంతట అదే ఆటోఫేజీకి గురయ్యింది. అలా కణంలో కొత్త స్థలానికి ఆస్కారం ఏర్పడింది. అప్పుడు అక్కడ మరింత కొత్తదీ, ఆరోగ్యకరమైన జీవకణ భాగం వృద్ధి చెందింది. ఇలా వార్ధక్యానికి లోనయ్యే భాగాన్ని మరింత వేగవంతం చేసి, అవి త్వరితంగా నశించేలా చేసే, కొత్త స్థలాన్ని సృష్టించి, ఆ ప్రదేశంలో సరికొత్త డీఎన్ఏ పెరిగేలా చేస్తున్నారు శాస్త్రవేత్తలు. ఈ పరిశోధనల గురించి కాల్‌టెక్‌కు చెందిన బ్రూస్ హే అనే శాస్త్రవేత్త వివరించారు. ''ఇలా తరచూ కణాన్ని ఖాళీ చేస్తుండటం వల్ల (సెల్ హౌస్ క్లీనింగ్) కొత్త కణపదార్థం పుట్టేలా చేయడం ద్వారా కణాన్ని యౌవనంగా ఉండేలా చేయవచ్చు'' అని చెబుతున్నారు బ్రూస్ హే.



**● కిసుక్కు**

సుబ్బారావు: మీ షాపులో తీసుకున్న అగరువొత్తులు వెలగడం లేదండీ!
దుకాణదారు: అవి వెలగవండీ... మీరే వెలిగించుకోవాలి.

– జి.రవి, నెల్లూరు

**● మీకు తెలుసా?**

ఆస్ట్రేలియాలోని ఒక పర్వతం పేరు... మౌంట్ డిజపాయింట్‌మెంట్! మౌంటెన్ టాప్ వ్యూ... బ్రిటిష్ అన్వేషకులకు నిరాశ కలిగించిందట. అందుకే ఈ పేరు పెట్టారు!!



# ఈ సర్కారును ఆపగలిగేవాడు ఎవడూ లేడు...



నాకు అడ్డొచ్చిన కొరియన్స్, మలేషియన్స్, ఇండోనేషియన్స్ ఎంతో మందిని చంపి ఈ ఎంపైర్ క్రియేట్ చేశాను. ఈ సర్కార్‌ను టచ్ చేయడం అంత ఈజీ కాదు

**'విలన్ అంటే ఇలా ఉండాలి'**

'ఇలాగే ఉండాలి' అనుకుంటే.... కచ్చితంగా అలానే ఉంటాడు. 'అలా' ఉండడం బానే ఉంటుంది గానీ అన్నిసార్లూ బాగుండదు. మొహం మొత్తుతుంది. అందుకే 'రొడ్డకొట్టుడు విలన్' పాత్రలు చేయడం అంటే కెల్లీ డోర్జీకి ఇష్టం ఉండదు.

విలనిజంలో వైవిధ్యాన్ని కోరుకుంటాడు.

అవసరమైతే దర్శకులతో చర్చలు చేస్తాడు.

'ఇలా చేస్తే బాగుంటుందేమో' అని వారిని ఒప్పించే ప్రయత్నం చేస్తాడు.

'హీరోగా నటించడానికి ఒకే ఒక మార్గం ఉంటుంది. విలన్‌గా నటించడానికి మాత్రం అనేక మార్గాలు ఉంటాయి' అని నమ్ముతాడు కెల్లీ డోర్జీ. నలుగురిని కొడితేనే హీరో, నాలుగు డ్యూయెట్లు ఉంటేనే హీరో, హోరుగాలిలోనూ క్రాఫ్ చెదరకుంటేనే హీరో... అనే అభిప్రాయం బలపడినప్పుడు... హీరోగా నటించడానికి ఒకే మార్గం ఉంటుంది!

కానీ విలన్‌కు చాలా మార్గాలు ఉంటాయి.

కత్తులతో.. కంటి సైగతో...

మీసాలతో...

తెల్లటి టాటా సుమోలతో... విలనిజాన్ని పండించవచ్చు. అయితే ఇంత శ్రమ కూడా అక్కర్లేదు అంటాడు కెల్లీ.

'బొద్దు మీసాలతో గట్టిగా అరిస్తేనే విలనా?' అని అడుగుతాడు.

'విలన్ కార్నర్' అనేది ఖాళీగానే ఉందని... అక్కడ పూరించవలసింది 'చాలా ఉంది' అని నమ్ముతాడు. 'బెస్ట్ విలన్ ఎలా ఉండాలంటే హిందీలో 'ఓంకార' సినిమాలో నటించిన సైఫ్ అలీఖాన్ పాత్రలాగా!' అంటాడు.

కొన్ని అభిప్రాయాలు ఉన్నప్పుడు... రావలసిన పాత్రలు వరస కట్టకపోవచ్చు. అలాంటి పరిస్థితి కెల్లీకి కూడా ఎదురైంది. ఒక సంవత్సరం అయితే అవకాశాలు లేక ఖాళీగా కూర్చోవలసి వచ్చింది. అయితే... పాత్రలే నా దగ్గరకు నడిచి రావాలి అని అతను ఎప్పుడూ బెట్టు చేయలేదు.

'నాకో చాన్స్ ఇవ్వండి' అంటూ కొత్త నటులలాగే దర్శకులు, నిర్మాతల తలుపు తట్టాడు.

'ప్రతిభ మాత్రమే అన్ని వేళలా పని చేయదు... ప్రయత్నం కూడా ముఖ్యం' అని నమ్ముతాడు డోర్జీ.

సినిమా భాషలో చెప్పాలంటే 'ఎవడి డప్పు వాడే కొట్టుకోవాలి' అంటాడు. 'నిన్ను నువ్వే మార్కెట్ చేసుకోవాలి' అని చెబుతాడు...



అవాస్తవం 17వ పేజీలో

ఇవి అనుభవం నేర్పిన గుణపాఠాలు కావచ్చు. కాకపోవచ్చు. అయితే 'విలనిజం' అనే పుస్తకంలో ఒక్క పాఠం కాదు... రకరకాల పాఠాలు నేర్చుకోవడానికే మొగ్గు చూపుతాడు కెల్లీ డోర్జీ. అందుకే... మన తెలుగు చిత్రసీమకు కూడా 'సుపరిచిత విలన్' అయ్యాడు.

●●●

'బద్రీనాథ్' సినిమాలో సర్కార్‌గా నటించాడు కెల్లీ డోర్జీ. ఈ సర్కార్ పచ్చి నెత్తురు తాగే వాడే కావచ్చు.

ఒకరిని చంపడానికి రౌడీలను పంపించి...

'చచ్చాడా లేదా అనేది మూడుసార్లు కన్‌ఫామ్ చేసుకోండి. శరీరాన్ని చూసి కాదు... శ్వాసను చూసి' అని క్రూరంగా జాగ్రత్తలు చెప్పేవాడే కావచ్చు.

'నీ కంఠంలో ప్రాణముండగా పెళ్లి జరిపించనన్నావు కదా...

అందుకే... కంఠం కోసేశాను' అని తన పైశాచికత్వాన్ని చాటుకునేవాడే కావచ్చు...అయితే ఈ సర్కార్‌కు కూడా ఒక లవ్‌స్టోరీ ఉంటుంది. లవ్ సెంటిమెంట్ ఉంటుంది. అందుకే ఇలా అంటాడు...

'సారీ మినిస్టర్... ల్యాండ్ సెటిల్‌మెంట్లు చేయాలన్నావు... చేశా. తోటి కాంట్రాక్టర్లను చంపమన్నావు... చంపా. నీ పవర్ మార్చమన్నావు... మార్చా. కానీ... నువ్వు ఎన్ని కోట్లు ఇచ్చినా... ప్రేమ విషయంలో ఎంటరవ్వను'

తన భార్యపై మామ చేయి చేసుకున్నప్పుడు కళ్లతో సర్కార్ పలికించిన భావాలు ఎంత బలంగా ఉంటాయి!

'డిఫరెంట్ లుక్స్'తో తనదైన విలనిజాన్ని సృష్టించుకున్న కెల్లీ డోర్జీ 'డాన్' 'ద్రోణ' 'బిల్లా' 'కేడీ' 'గోలీమార్' 'బద్రీనాథ్' 'దడ' 'బాద్‌షా'... మొదలైన చిత్రాల్లో నటించారు.

●●●

భూటాన్‌లోని థింపులో జన్మించిన కెల్లీ డోర్జీ, డార్జిలింగ్‌లోని సెయింట్ పాల్ హైస్కూల్, ముంబైలోని సెయింట్ జేవియర్ కాలేజీలో చదువుకున్నాడు. 'గ్లాడ్‌రాగ్స్ మ్యాన్‌హంట్ కాంటెస్ట్'తో వెలుగులోకి వచ్చాడు. 'మోడల్'గా రాణించాడు. బాలీవుడ్ సినిమా 'టాంగో ఛార్లీ'లో బోడో మిలిటెంట్ లీడర్‌గా వెండితెరకు పరిచయమయ్యాడు. తెలుగులో 'డాన్' సినిమాతో 'బెస్ట్ విలన్'గా 'మా టీవి వ్యూయర్స్ చాయిస్' అవార్డ్ అందుకున్న కెల్లీ డోర్జీ 'ఉత్తమ విలన్'గా తెలుగు ప్రేక్షకులను ఆకట్టుకుంటున్నాడు.

• మన దిగ్గజాలు

# ఆతిథ్య ప్రియ

వ్యాపార నిర్వహణలో మెలకువలు నేర్పించే తండ్రి ఉగ్రవాదుల తూటాలకు నేలకొరిగారు. ఆ విషాదం నుంచి తేరుకోక ముందే సోదరుడు రోడ్డు ప్రమాదంలో మరణించాడు. విషాదం వెంట విషాదం వెన్నాడినా ఆమె కుంగిపోలేదు. దుఃఖాన్ని దిగమింగి తండ్రి ఆశయాలను నెరవేర్చడానికి నడుం బిగించారు ప్రియా పాల్. ఆతిథ్య రంగంలో మూసపద్ధతులను తోసిరాజని, హోటల్ పరిశ్రమలో తనదైన ముద్రను చాటుకున్నారామె.

**భా**రత ఆతిథ్య పరిశ్రమలో 'ద పార్క్' హోటల్స్ పేరు ప్రఖ్యాతులను దశ దిశలకూ విస్తరించిన ప్రియా పాల్ 1967లో కోల్‌కతాలోని సంపన్న వ్యాపార కుటుంబంలో జన్మించారు. తండ్రి సురేంద్రపాల్ 'ద పార్క్' హోటల్ వ్యవస్థాపకుడు. అపీజే సురేంద్ర గ్రూప్ చైర్మన్‌గా ఉండేవారాయన. ప్రియా జన్మించిన ఏడాదే సురేంద్ర పాల్ కోల్‌కతాలో తొలి పార్క్ హోటల్‌ను ప్రారంభించారు. ఆ మరుసటి ఏడాదిలోనే విశాఖపట్నంలో రెండో హోటల్ ప్రారంభించారు. విశాఖపట్నంలో సురేంద్ర పాల్ నిర్మించిన 'ద పార్క్' హోటల్ అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లోనే తొలి ఫైవ్‌స్టార్ హోటల్.

**తండ్రే తొలి గురువు...**

ప్రియాపాల్ అమెరికాలోని వెల్లెస్లీ కళాశాలలో ఎకనామిక్స్‌లో డిగ్రీ పూర్తి చేశారు. చదువు పూర్తయ్యాక 1988లో ఇండియాకు తిరిగొచ్చారు. తండ్రి సురేంద్ర పాల్ ఆమెకు కోల్‌కతాలోని 'ద పార్క్' హోటల్ మార్కెటింగ్ మేనేజర్‌గా బాధ్యతలు అప్పగించి, హోటల్ నిర్వహణలో ఓనమాలు దిద్దించారు. సజావుగా సాగుతున్న కుటుంబంలో విధి విషాదం నింపింది. 'ఉల్ఫా' ఉగ్రవాదులు 1990లో సురేంద్ర పాల్‌ను కాల్చి చంపారు. ఆ సంఘటన నుంచి తేరుకోక ముందే ప్రియా సోదరుడు ఆనంద్ రోడ్డు ప్రమాదంలో మరణించాడు. వరుస విషాదాలతో ప్రియా పాల్ కుటుంబం శోక సముద్రంలో మునిగిపోయింది. ఇదే అదనుగా భావించిన బంధువులు, భాగస్వాములు వ్యాపారాన్ని దెబ్బతీసే కుట్రకు తెరలేపారు. అలాంటి క్లిష్ట సమయంలో ప్రియా పాల్ 'ద పార్క్' హోటళ్ల నిర్వహణను భుజానికెత్తుకున్నారు. అప్పుడామె వయసు ఇరవై రెండేళ్లే. చైర్మన్‌గా పగ్గాలు చేపట్టగానే యూనియన్ల పేరుతో సంస్థకు తెల్ల ఏనుగుల్లా మారిన ఉద్యోగులను దారికి తెచ్చారు. అప్పట్లో మన దేశంలో హోటళ్లంటే వినియోగదారుల దృష్టిలో కేవలం వసతి గృహాలు మాత్రమే. ప్రియా తనదైన వ్యూహంతో ఈ పరిస్థితిని సమూలంగా మార్చేశారు.



స్నాక్ సెంటర్
19వ పేజీలో

**నిత్య నవీనతే విజయ రహస్యం**

అప్పటికే పరిశ్రమలో ఉన్న ఐటీసీ, ఒబెరాయ్, తాజ్ వంటి దిగ్గజాలను తట్టుకొని 'పార్క్ హోటళ్లు' తమదైన ప్రత్యేకతను నిలిపేందుకు బోటిక్ హోటళ్ల నమూనాను అమలు చేశారు. ఈ విధానంలో హోటల్స్‌తో పాటు ప్రతి గది ప్రత్యేక డిజైన్లతో ఉంటుంది. పెద్ద హోటళ్ల కంటే తక్కువ గదులుంటాయి. సిబ్బంది ఎక్కువగా ఉండి సత్వర సేవలందిస్తారు. అంతర్జాతీయ వాస్తు శిల్పులను రంగంలోకి దింపి నిర్జీవంగా ఉండే హోటళ్లకు తన దైన నిర్మాణ శైలితో జీవం నింపారు. హైదరాబాద్ నగరం నగలకు ప్రసిద్ధి కావటంతో 'పార్క్ హైదరాబాద్' అలంకరణలో అదే థీమ్‌ను అనుసరించారు. కెంపులు, పచ్చలు, నీలమణి వంటి విలువైన రాళ్లతో ఒక్కో అంతస్తును డిజైన్ చేశారు. గదులు నగల పెట్టెల్లా రూపొందించారు. చెన్నై హోటల్‌ను జెమినీ స్టూడియోలో నిర్మించారు. దీన్ని సినిమా థీమ్‌తో నిర్మించారు. ఇలా ఒక్కో హోటల్ నిర్మాణానికి ఒక్కో థీమ్‌ను ఎన్నుకున్నారు. అందుకే ఏ రెండు పార్క్ హోటళ్లు.. ఒక హోటల్‌లోని ఏ రెండు గదులు ఒకేలా ఉండవు. ప్రతి ఏడేళ్లకు ఒకసారి హోటల్ రూపురేఖలను పూర్తిగా మార్చేస్తారు. అందుకే పార్క్ హోటళ్లు ప్రముఖులతో కళకళలాడుతూ ఉంటాయి. కాలం కంటే ముందు మారితేనే వ్యాపారంలో మనుగడ అని భావించి విమర్శలకు వెరవకుండా హోటళ్లలో నైట్‌క్లబ్బులు, బార్లు, డాన్స్‌ఫ్లోర్, లాంజ్‌లు ఏర్పాటు చేశారు. 'పార్క్'లో రూమ్ దొరకటం అంత సులభం కాదు అనే స్థాయికి హోటళ్ల ఖ్యాతిని పెంచారు. ప్రియా హయాంలో బెంగళూరు, చెన్నై, హైదరాబాద్, కోల్‌కతా, న్యూఢిల్లీ, విశాఖపట్నం, గోవా వంటి వాణిజ్య, పర్యాటక ప్రాంతాల్లో కొత్త హోటళ్లను నిర్మించారు. ప్రపంచ ఉత్తమ 101 హోటళ్ల జాబితాలో పార్క్ బెంగళూరు హోటల్ స్థానం దక్కించుకుంది. ప్రస్తుతం వ్యాపార పరిమాణం రూ. 1700 కోట్లకు చేరింది.

**సేవాస్ఫూర్తిలోనూ మేటి...**

ఆతిథ్యరంగంలో కృషికి గుర్తింపుగా భారత ప్రభుత్వం 2012లో ప్రియా పాల్‌ను 'పద్మశ్రీ'తో సత్కరించింది. వ్యాపార రంగానికే పరిమితం కాకుండా, ఆమె సేవా రంగంలోనూ తనవంతు కృషి సాగిస్తున్నారు. పశ్చిమ బెంగాల్‌లో పలు పాఠశాలలు ఏర్పాటు చేయటం, అస్సాంలో గొట్టపు బావులు తవ్వించటం, ఢిల్లీలోని చారిత్రాత్మక జంతర్‌మంతర్ సంరక్షణ బాధ్యతలను నిర్వహించటం ద్వారా సేవా కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

- దండేల కృష్ణ

• అవాస్తవం

## అపోహ:
## ఐస్‌క్రీమ్ తింటే జలుబు ఎక్కువవుతుంది



**వాస్తవం:** జలుబు చేసినప్పుడు ఐస్‌క్రీమ్ తినడం వల్ల సమస్య మరింత తీవ్రంగా మారుతుందనేది అపోహ మాత్రమే. ఐస్‌క్రీమ్ తయారీలో వాడే పాలు, అందులోని చక్కెర కఫాన్ని మరింత పెంచుతాయని, ఐస్‌క్రీమ్ చల్లదనం కారణంగా గొంతు బొంగురుపోతుందని చాలామంది చెప్పే మాటలు పూర్తిగా నిరాధారమైనవి. నిజానికి పడిశం పట్టినప్పుడు చల్ల చల్లని ఐస్‌క్రీమ్‌ను ఆస్వాదించడమే మేలని, దానివల్ల బొంగురుపోయిన గొంతుకు కాస్త సాంత్వన కలుగుతుందని 'మాయో క్లినిక్' వైద్య నిపుణులు చెబుతున్నారు. జలుబు చేసి పడిశం పట్టినప్పుడు కడుపు నిండా తినడం కూడా కష్టంగా ఉంటుంది. అలాంటప్పుడు ఐస్‌క్రీమ్ తింటే అందులో పుష్కలంగా ఉండే చక్కెర వల్ల తక్షణమే శక్తి వస్తుందని కూడా 'మాయో' నిపుణులు చెబుతున్నారు. మరికనేం! ఈసారి జలుబు చేసినప్పుడు ఐస్‌క్రీమ్ తినొద్దని ఎవరు చెప్పినా వినకే వినొద్దు. నచ్చిన రుచులలో హిమక్రీములను ఇంచక్కా లాగించేయండి.

• విడ్డూరం

## మంచున్నా సరే... మార్గం ఉంటుంది!




జపాన్‌లోని 'డోమినోస్' పిజ్జా కంపెనీకి మంచు వల్ల ఇబ్బందులు ఎదురవుతున్నాయి.

రోడ్డు మీద మంచు పేరుకు పోవడం వల్ల... సరియైన సమయంలో కస్టమర్లకు పిజ్జా డెలివరీ చేయలేకపోతున్నారు.

కొన్నిసార్లు ఆర్డర్ క్యాన్సిల్ చేయడం తప్ప మరో ప్రత్యామ్నాయం లేని ప్రతికూల వాతావరణ పరిస్థితులు ఎదురవుతున్నాయి. ఈ పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని... రెయిన్ డీర్‌లతో పిజ్జా డెలివరీ చేయాలని ఆలోచించింది డోమినో. ఆలోచించడమే కాదు...అప్పుడే రంగంలోకి కూడా దిగింది.

'పిజ్జా డెలివరీ'పై ఇషికారీ సిటీలో రెయిన్ డీర్‌లకు శిక్షణ ఇవ్వడం మొదలుపెట్టింది.

అయితే ఈ పిజ్జా రెయిన్ డీర్‌లు ఇంకా డ్యూటీలోకి దిగకముందే విమర్శలు ఎదురవుతున్నాయి. రెయిన్ డీర్‌లను పిజ్జా డెలివరీలకు ఉపయోగించడం వల్ల... లాభాల కంటే నష్టాలే ఎక్కువ ఉంటాయి అంటున్నారు విమర్శకులు.

## యస్... నా గొయ్యి నేనే తవ్వుకుంటాను!





'**త**న గొయ్యి తానే తవ్వుకున్నాడు' అంటుంటారు. కెనడా బిజినెస్‌మెన్ కిక్‌హమ్ మాత్రం తన గొయ్యి తానే తవ్వుకున్నాడు. అయిదారు అడుగుల ఈ గొయ్యిని తవ్వడం తనకు ఎంతో గర్వకారణమైన విషయం అని కూడా అంటున్నాడు ఈ ఎనభై తొమ్మిది సంవత్సరాల వృద్ధుడు.

ఒక కన్‌స్ట్రక్షన్ కంపెనీకి యజమాని అయిన కిక్‌హమ్ తన దగ్గర ఉన్న యంత్రాల సహాయంతో చుట్టాలు, స్నేహితులు చనిపోయినప్పుడు వారి సమాధి కోసం గొయ్యి తవ్వడం అలవాటు.

'తొంభై సంవత్సరాలు బతికితే నా గొయ్యి నేనే తవ్వుకోవాలి' అనుకున్నాడట ఒకసారి. ఇంకా కొద్ది రోజుల్లో తొంభైలోకి ప్రవేశించనున్న కిక్‌హమ్ తాను అనుకున్నది చేశాడు.

''మీరు చేస్తున్న పని గురించి అంతా వింతగా మాట్లాడుకుంటున్నారు'' అని ఎవరైనా అంటే...

''వింతగా మాట్లాడుకోకపోతేనే వింత కదా'' అంటున్నాడు కిక్‌హమ్!

## ఈ ఆవు... ఆరడుగుల బుల్లెట్టు!

కాలిఫోర్నియా (యు.ఎస్)కు చెందిన ఈ ఆవు పేరు డేనియల్.

ఈ ఆవు ఎత్తు ఆరడుగుల నాలుగు అంగుళాలు. తన ఆవు ప్రపంచంలోనే ఎత్తైన ఆవు అని నమ్ముతున్నాడు దాని యజమాని కెన్ ఫెర్లీ.

''ఎత్తులోనే కాదు... హుషారులోనూ డేనియల్ ఇతర ఆవుల కంటే ఒక మెట్టు మీద ఉంటుంది'' అని మురిపెంగా చెబుతున్నాడు యజమాని.






ధర: సుమారు 240 డాలర్లు (రూ. 16,500)

## పాస్తా కావాలా నాయనా!

**నా**స్తాగా పాస్తా కావాలా నాయనా! అంటే ఎవరు వద్దంటారు? సూపర్ మార్కెట్లలో రెడీమేడ్ పాస్తా ప్యాకెట్లు దొరుకుతున్నాయి గానీ, అందులో ఏయే రసాయనాలు కలుపుతారో మనకు తెలీదు. ఎందుకొచ్చిన గొడవలే ఈ పూటకు అలవాటైన ఇడ్లీలతో సరిపెట్టేసుకుందాం అనుకుంటారు జాగ్రత్తపరులు. ఇదిగో ఇక్కడ ఫొటోలో కనిపిస్తున్న యంత్రం ఒకటి ఇంట్లో ఉంటే, అలా సరిపెట్టుకోనక్కర్లేదు. నాస్తాగా శుభ్రంగా పాస్తానే లాగించేయవచ్చు. పాస్తాకు కావలసిన పిండి, నీరు... ఇంకా కావాలనుకుంటే కోడిగుడ్ల సొన ఈ యంత్రంలో వేసి, కావలసిన రీతిలో సెట్టింగులు అమర్చుకుని, స్విచాన్ చేస్తే చాలు... తాజా తాజా పాస్తా కాడలు బయటకు వస్తాయి. యంత్రం నుంచి ఇవి బయటకు వస్తున్నప్పుడు కావలసిన సైజులో చాకుతో కట్ చేసుకోవచ్చు. పాస్తా కాడలను సన్నగా లేదా మందంగా... కోరుకున్న ఆకారాల్లో తయారు చేసుకునేందుకు వీలైన చక్రాలు ఇందులోనే అమర్చి ఉంటాయి. ఇదే యంత్రంతో నూడుల్స్ వంటివి కూడా తేలికగా తయారు చేసుకోవచ్చు.




## పొగ లేకుండా కాల్చేస్తుంది

ధర: సుమారు 300 డాలర్లు (రూ.20,500)

**పొ**య్యి మీద మొక్కజొన్న కండెలను కాలిస్తేనే పొగ వస్తుంది. అలాంటిది కబాబ్‌లను కాలిస్తే పొగరాదూ! తప్పకుండా వస్తుందని అంటారా..? అయినా జిహ్వాచాపల్యం ముందు పొగదేముందిలే అని సర్దిచెప్పుకుంటారా..? కబాబ్‌ల వంటి పదార్థాలను బొగ్గుల మీద కాల్చినా, సాదా సీదా గ్రిల్స్ మీద కాల్చినా పొగ మాత్రం కామన్. ఇక్కడ ఫొటోలో కనిపిస్తున్న ఇన్‌ఫ్రారెడ్ గ్రిల్ మాత్రం ఏమాత్రం పొగ రానివ్వకుండానే ఎలాంటి పదార్థాలనైనా ఇట్టే కాల్చేస్తుంది. రుచికి రుచి, శుచికి శుచి... పొగ, మసి ఉండనే ఉండవు. ఇందులోని ఇన్‌ఫ్రారెడ్ సాంకేతికత వల్ల ఇది ఆన్ చేయగానే ఒకేసారి అత్యధిక ఉష్ణోగ్రత విడుదలవుతుంది. నిమిషాల్లోనే ఎలాంటి పదార్థాలనైనా కోరుకున్న రీతిలో కాలుస్తుంది. బ్రెడ్ టోస్ట్ మొదలుకొని చికెన్, టర్కీ రోస్ట్ వరకు ఎలాంటి వంటకాలకైనా ఇది చాలా అనువుగా ఉంటుంది.

## చిటికెలో తరిగేస్తుంది

**వం**టకాలకు కావలసినవి తరుక్కోవాలంటేనే పెద్ద ఇబ్బంది అనుకునే ఉంటారు చాలామంది. కొందరికి కత్తిపీట సౌకర్యంగా ఉంటే, ఇంకొందరికి చాకులు అలవాటుగా ఉంటాయి. వంట చేసేవాళ్లకు వేటితో తరగడం అలవాటుగా ఉన్నా, తరిగే సాధనాలు సమయానికి పదును తగ్గి ఇబ్బందిపెడితే మాచెడ్డ చిరాగ్గా ఉంటుంది. ఇక్కడ ఫొటోలో కనిపిస్తున్న ఎలక్ట్రిక్ ఫుడ్ స్లైసర్ ఇలాంటి వంటింటి ఇబ్బందులను సునాయాసంగా దూరం చేస్తుంది. వంటింట్లో ఇది ఉంటే తరగడానికి తంటాలు పడనక్కర్లేదు. తరిగేటప్పుడు ఏమరుపాటు వల్ల చేయి తెగుతుందనే బెంగ కూడా అక్కర్లేదు. తరగాలనుకున్న పదార్థాలను ఇందులో వేసి, స్విచ్చాన్ చేస్తే చాలు. వాటిని కోరుకున్న రీతిలో ఇట్టే తరిగేస్తుంది. కూరగాయలు, మాంసం, బ్రెడ్, పనీర్, చీజ్ వంటి పదార్థాలు వేటినైనా దీని సాయంతో కావలసిన సైజుల్లో ఇట్టే తరిగేసుకోవచ్చు. ఇందులో పదార్థాలను పెట్టిన తర్వాత, ఏ మందంలో ముక్కలు కావాలను కుంటున్నామో ఆ మేరకు ఇందులో బ్లేడ్లను అడ్జస్ట్ చేసుకోవచ్చు. ఇందులో 1/16 అంగుళాల నుంచి 9/16 అంగుళాల వరకు గల మందంలో ముక్కలను తరుక్కోవచ్చు.

ధర: సుమారు 146 డాలర్లు (రూ. 10,000)





• స్నాక్ సెంటర్

# బాయిల్డ్ పీతా

**కావల్సినవి:** వరిపిండి – 3 కప్పులు, పెసరపప్పు – 2 కప్పులు, అల్లం ముక్కలు – 1 టీస్పూను, వెల్లుల్లి రెబ్బలు – 2, పచ్చిమిర్చి – 2, ఉప్పు – తగినంత, కొత్తిమీర – 1 కప్పు, ఆవాలు, జీలకర్ర అర టీస్పూను, పసుపు – అరటీస్పూను, ఆయిల్ వేయించడానికి సరిపడా

**తయారీ:** ముందుగా పెసరపప్పు రెండు గంటలు నానబెట్టాలి. తర్వాత స్టౌ పై బౌల్ పెట్టి రెండు గ్లాసులు నీళ్లు పోసి మరగనివ్వాలి. ఈ నీరు మరిగాక వరిపిండి వేసి ఉండలు లేకుండా కలపాలి. అందులో టీస్పూను ఆయిల్ వేసి చపాతీ ముద్దలా కలిపి పక్కన పెట్టుకోవాలి. ఇప్పుడు నానిన పెసరపప్పు, అల్లం ముక్కలు, వెల్లుల్లి, పచ్చిమిర్చి, ఉప్పు వేసి మెత్తగా మిక్సీ వేసుకోవాలి. ముందుగా సిద్ధం చేసుకున్న వరిపిండి ముద్దను చిన్న చిన్న చపాతీల్లా చేసుకోవాలి. చపాతీల్లో ముందుగా మిక్సీ చేసుకున్న పెసరపప్పు మిశ్రమాన్ని ఉంచి కజ్జికాయల మాదిరిగా మధ్యకు మడపాలి. వీటిని స్టీమ్ చేసుకోవాలి. తర్వాత మరో పాన్‌లో రెండు టేబుల్ స్పూన్ల ఆయిల్ వేసి కాగాక, ఆవాలు, జీలకర్ర వేయాలి. అవి వేగాక రెడీగా ఉన్న పీతాలను మీద ఈ పోపును వేసుకుని, ముక్కలుగా కట్ చేసుకుని కొత్తిమీరతో సర్వ్ చేస్తే బాయిల్డ్ పీతాలు రెడీ.



# మేథీ మూంగ్ బోండా

**కావల్సినవి:** పెసరపప్పు – 2 కప్పులు, వరిపిండి – 1 టీ స్పూన్, బొంబాయి రవ్వ – 1 టీస్పూన్, పచ్చిమిర్చి– 3, అల్లం ముక్కలు –1 టీస్పూను, మెంతి ఆకు – ఒక కప్పు, ఉప్పు సరిపడా, జీలకర్ర – 1 టీస్పూను, ఆయిల్ వేయించడానికి సరిపడా.

**తయారీ:** ముందుగా పెసరపప్పు రెండు గంటలు నానబెట్టాలి. నానిన పెసరపప్పు, పచ్చిమిర్చి, అల్లం ముక్కలు, జీలకర్ర, ఉప్పు మిక్సీలో వేసి మెత్తగా రుబ్బుకోవాలి. ఈ మిశ్రమంలో వరిపిండి, బొంబాయి రవ్వ, సన్నగా తరిగిన మెంతి ఆకు వేసి బాగా కలపాలి. ఇప్పుడు స్టౌపై ఫ్రైయింగ్ పాన్‌ను పెట్టి అందులో వేయించడానికి సరిపడా ఆయిల్ పోయాలి. ఆయిల్ కాగాక చిన్న చిన్న బోండాలుగా వేసుకోవాలి. బంగారు రంగు వచ్చే వరకూ వేయించాలి. శీతాకాలంలో వీటిని వేడివేడిగా ఉల్లిపాయలు, పచ్చిమిర్చి ముక్కలతో కలిపి తింటే... భలే బాగుంటుంది కదా!

# బీట్‌రూట్ టిక్కీ

**కావల్సినవి:** బీట్‌రూట్ తురుము – 2 కప్పులు, బంగాళ దుంప – 1, ఉల్లిపాయ ముక్కలు – 1 కప్పు, పచ్చిమిర్చి – 2, ఉప్పు – తగినంత, కారం – టీస్పూను, దనియాల పొడి – అర టీ స్పూను, జీలకర్ర పొడి – అర టీస్పూను, కార్న్‌ఫ్లోర్ – 1 కప్పు, అల్లం వెల్లులి పేస్టు – 1 టీ స్పూను, పసుపు – పావు టీస్పూను, ఆయిల్ – తగినంత

**తయారీ:** బీట్‌రూట్ తురుము, బంగాళదుంపను వేరు వేరుగా ఉడకబెట్టుకోవాలి. వీటిని ఒక బౌల్‌లో వేసి ఉల్లిపాయలు, పచ్చిమిర్చి ముక్కలు, ఉప్పు, కారం, కార్న్‌ఫ్లోర్, దనియాల పొడి, జీలకర్ర పొడి, అల్లం వెల్లుల్లి పేస్ట్ వేసి కలపాలి. ఈ మిశ్రమాన్ని చిన్ని చిన్ని టిక్కీలుగా చేసుకుని ఆయిల్ వేసి డీప్ ఫ్రై చేసుకోవాలి. అంతే! ఆరోగ్యకరమైన బీట్‌రూట్ టిక్కీలు తయార్...



• టూర్‌దర్శన్

## కొండలలో కోటి జ్ఞానకాంతుల స్వామి

# పళని మురుగన్

శివపార్వతుల గారాల తనయుడు, దేవసేనాధిపతి, తారకాసురుడనే రాక్షస సంహారానికి ఉద్భవించిన కారణజన్ముడు కార్తికేయుడు. సకల విద్యాపారంగతుడిగా, జ్ఞానప్రదాతగా, దండాయుధపాణిగా, నిత్యయవ్వనుడుగా సుబ్రహ్మణ్యేశ్వరునికి పేరుంది. సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయాలకు, ఆయనను అర్చించే భక్తులకు తెలుగునాట కొదవలేనప్పటికీ తమిళనాడు, కర్ణాటకలలో మనకన్నా అధికంగా సుబ్రహ్మణ్యేశ్వరునికి అడుగడుగునా గుడులు కట్టి పూజించడం సర్వసాధారణంగా కనబడుతుంటుంది. తమిళనాట గల ప్రసిద్ధి చెందిన సుబ్రహ్మణ్యక్షేత్రం పళని. దండాయుధపాణిగా, బాలమురుగన్‌గా, పళని మురుగన్‌గా తమిళులు కొలిచే ఈ స్వామి ఆలయం ఎంతో ప్రముఖమైనదిగా, మహిమాన్వితమైనదిగా వాసికెక్కింది.

**స్థలపురాణం:** వినాయకచవితినాడు మనందరం చెప్పుకునే కథ ఒకటుంది. అదేమంటే గణాధిపత్యం కోసం పోటీపడుతున్న కుమారులతో భూమండలంలోని అన్ని పుణ్యతీర్థాలలోనూ స్నానం చేసి, ఎవరు ముందుగా తమ వద్దకు వస్తారో, వారికే గణాధిపత్యమిస్తానని శివుడు చెప్పడం, ఆ మాట వినడంతోటే తన మయూరవాహనాన్ని అధిరోహించి, కుమారస్వామి వాయువేగంతో వెళ్లిపోవడం, వినాయకుడు తెలివి తేటలను ఉపయోగించి, నారాయణ మంత్రాన్ని పఠిస్తూ, మూడుమార్లు తన తల్లిదండ్రులైన శివపార్వతుల చుట్టూ ప్రదక్షిణ చేయడం, ఆ ప్రదక్షిణ మహిమతో కుమారస్వామి ఏ పుణ్యతీర్థానికేగినా అన్నగారే తనకన్నా ముందుగా వచ్చి పుణ్యతీర్థాలలో స్నానం చేసి వెళ్లిన ఆనవాళ్లు కనిపించి ఖిన్నుడై, కైలాసం వచ్చేసరికి, ఈ పరీక్షలో గణేశుడే నెగ్గాడంటూ గణాధిపత్యాన్ని వినాయకుడికే కట్టబెట్టడం.. ఆ ఆనందోత్సాహాలతో వినాయక చవితి పండుగ జరుపుకోవడం... ఇంతవరకూ కథ అందరికీ తెలిసిందే. ఆ తర్వాత ఏం జరిగిందో, వినాయకచవితిరోజున తెలుసుకోవడానికి అవకాశం ఉండదు. అది ఇప్పుడు తెలుసుకుందాం.. అప్పుడు జరిగిన పరిణామానికి బాలసుబ్రహ్మణ్యేశ్వరుడు ఎంతో బాధపడతాడు. తలిదండ్రుల మీద అలిగి, అన్నగారిలాగా తనకు కూడా పరిపక్వమైన జ్ఞానం లభించాలనే కాంక్షతో తన అలంకారాలన్నింటినీ వదిలేసి, భూలోకం వెళ్లి అక్కడ తనకు నచ్చిన ఒక కొండమీద గల ప్రశాంతమైన వాతావరణంలో తపస్సులో మునిగిపోయాడు. కైలాసంలో కుమారుని జాడ తెలియక పార్వతీదేవి బెంగపడుతుంది. పరమేశ్వరుడు పత్నిని ఊరడించి, ఆమెను వెంటబెట్టుకుని కొడుకుని వెతుకుతూ భూలోకానికి పయనమవుతాడు. ఇద్దరూ కలిసి వెతుకుతుండగా, తమిళనాడులోని తిరు ఆవినంకుడి అనే ప్రదేశం వద్దకు రాగానే కొండశిఖరం బంగారు కాంతులతో మెరుస్తూ కనపడటంతో తమ కుమారుడు అక్కడే ఉన్నాడని తెలుసుకుంటారు. తపోదీక్షలో ఉన్న పుత్రుని చేరదీసి, ముద్దాడుతూ, 'నువ్వే నా జ్ఞానఫలానివిరా బంగారుకొండా' అంటూ పార్వతీ పరమేశ్వరులు కుమారుని అనుగ్ర

బాల మురుగన్ కొలువుదీరిన పళని కొండ


స్వామిని ఊరేగించే స్వర్ణరథం

హిస్తారు. తల్లిదండ్రుల ఊరడింపుతో కుమారస్వామి అలకమానతాడు కానీ, ఆ ప్రదేశం తనకు ఎంతో నచ్చడంతో తన అంశను అక్కడే వదిలి, తలిదండ్రులతో తిరిగి కైలాసం చేరతాడు. ఇదీ పళని సుబ్రహ్మణ్యేశ్వరుని పురాగాథ.

ఆ ప్రదేశమే ప్రస్తుతం సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని భక్తులు అర్చించే పళని ఆలయం.

## ఎలా వెళ్లాలంటే..?

పళని సుబ్రహ్మణ్యేశ్వరాలయానికి వెళ్లడం సులువే. రైలు, బస్సు, విమాన మార్గాలున్నాయి. దేశంలోని అన్ని ప్రధాన నగరాలనుంచి పళనికి నేరుగా బస్సులు, రైళ్లు ఉన్నాయి.

**రైలు మార్గం:** పొల్లాచ్చి మీదుగా మధురై నుంచి కోయంబత్తూరు వెళ్లే రైలుంది. అలాగే తిరుచెందూరు నుంచి మధురై మీదుగా పళని వెళ్లేందుకు రైలుంది. చెన్నై సెంట్రల్ నుంచి పళని వెళ్లేందుకు ప్రత్యేకంగా రైలుంది. ఎలాగైనా పళని చేరుకుంటే అక్కడి నుంచి కేవలం రెండు కిలోమీటర్ల దూరంలో గల ఆలయాన్ని చేరుకోవడానికి ఆటోరిక్షాలు, బస్సులు విరివిగా ఉన్నాయి.

**వాయుమార్గం:** పీలమేడు లేదా కోయంబత్తూరు, మధురై వరకు విమానంలో వెళ్తే అక్కడినుంచి పళనికి బస్సులు, రైళ్లు ఉన్నాయి.

తమిళనాడులోని దిండిగల్ జిల్లాలో మధురైకి వంద కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ కొండ ప్రకృతి రమణీయకతకు పెట్టింది పేరు.

**అన్ని విగ్రహాల్లాంటిది కాదు:** పళని సుబ్రహ్మణ్యేశ్వర స్వామి విగ్రహం అన్ని విగ్రహాలలా రాతితో మలిచింది కాదు. నవపాషాణాలతో ప్రత్యేకంగా తీర్చిదిద్దినది. ఈ నవ పాషాణాలనే తొమ్మిది విధాలైన మూలికలు అని కొందరంటారు, తొమ్మిది భయంకరమైన విషాలనూ ప్రత్యేకమైన పాళ్లలో కలిపితే అమృతం వంటి ఔషధం తయారవుతుందని, అందుకే దీనిని భోగార్ అనే ముని ఈ విగ్రహాన్ని ప్రత్యేకశ్రద్ధతో మలచాడని క్షేత్రపురాణం చెబుతోంది. ఈ ఆలయం దాదాపు పదహారు గంటలసేపు తెరిచే ఉంటుంది. అందరూ స్వామిని దర్శనం చేసుకునేందుకు వీలుగా గర్భాలయం తలుపులు ఎల్లప్పుడూ తెరిచే ఉంటాయి.

ఈ మందిరం క్రీస్తుశకం 7వ శతాబ్దంలో కేరళ రాజు చీమన్ పెరుమాళ్ కట్టించగా, దానిని పాండ్యరాజులు పునరుద్ధరించారు. అద్భుతమైన శిల్పసంపదతో, కేవలం కౌపీనం మాత్రమే కట్టుకుని, చేతిలో శూలాయుధం పట్టుకుని, చూడగానే ఆకట్టుకునే అందమైన విగ్రహంతో కనువిందు చేస్తాడు ఈ దేవసేనాని, దండాయుధ పాణి. కావడి మొక్కులంటే ఇష్టమట ఈస్వామికి. అంటే ఏదయినా ఆపద కలిగినప్పుడు తాము

ఆలయంలోని పళని మురుగన్

## ఎప్పుడు వెళ్లాలి?

వాతావరణ పరిస్థితుల రీత్యా పళని వెళ్లేందుకు చలికాలమే అనకూలమని చెప్పాలి. ఎందుకంటే ఎండాకాలంలో విపరీతమైన వేడి ఉంటుంది. వర్షాకాలంలో కొండ ఎక్కడం కొంచెం కష్టమే. అదే చలికాలంలో అయితే హాయిగా వెళ్లవచ్చు. ప్రకృతి అందాలను తనివితీరా తిలకించవచ్చు. పళనిలో ప్రత్యేకమైన కొంగలు బారులు తీరుతాయి. నారాయణ పక్షులు, గోల్డెన్ వడ్రంగి పిట్టలు కనువిందు చేస్తాయి. వాటి కిలకిలరావాలతో మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తాయి. చలికాలంలోనే పళనిలో అనేక ఉత్సవాలు జరుగుతాయి. వాటిలో కావడి ఉత్సవం, మార్గశిరశుద్ధ షష్ఠికి జరిగే కల్యాణోత్సవం ఒకటి.

వివాహం కానివారు, సంతానం లేనివారు, కుజదోషం ఉన్నవారు, రాహు, కేతు, కుజగ్రహదోషాలు ఉన్నవారు, కాలసర్పదోషం, నాగదోషం వగైరాలతో బాధపడేవారు పళని సుబ్రహ్మణ్యేశ్వరుని సందర్శించుకుని స్వాంతన పొందుతారు. అంతేకాదు, జ్ఞానప్రదాతగా పేరుగాంచిన సుబ్రహ్మణ్యేశ్వరుని బుద్ధిమాంద్యంతో బాధపడేవారు కన్నులారా సందర్శించుకుని ఆయా బాధలనుంచి విముక్తి పొందుతుంటారు.

సమర్పించగలిగినదానిని కావిళ్లకొద్దీ సమర్పించుకుంటామని మొక్కుకుని, ఆపద తీరగానే, నియమ నిష్ఠలతో స్వామికి కావిళ్లలో కానుకలు మోసుకుంటూ నృత్యగానాలతో స్వయంగా సమర్పించుకుంటారు భక్తులు. తండ్రి అయిన శివునిలాగే ఈయన కూడా అభిషేక ప్రియుడు. కార్తికమాసంలో అయితే రోజుకు కనీసం 700 మార్లు భక్తుల అభిషేకాలందుకుంటాడు ఈ స్వామి. వల్లీ, దేవసేన ఆయన భార్యలు. ప్రతి సంవత్సరం మార్గశిర శుద్ధ షష్ఠిరోజున స్వామివారికి కన్నులపండువగా కల్యాణోత్సవం జరుగుతుంది.

### పర్యాటక స్థలాల పళని

పళని చుట్టూ బోలెడన్ని పర్యాటక స్థలాలున్నాయి. తిరునావినంకుడి ఆలయం, ఇదుంబన్ ఆలయం, పదగణపతి ఆలయం, తిరు అవినాకుడి ఆలయం, పెరియ నాయకి అమ్మన్ ఆలయం, పెరియన్ అవుడైయర్ ఆలయం, కన్నడి పెరుమాల్ ఆలయం, పళని కొండలు, పార్వతీదేవికి తల్లిగా పేర్కొనే మరియమ్మన్ ఆలయం, మురుగన్ విగ్రహ శిల్పి భోగర్ సమాధి ఆలయం, కురుంజి అందవార్ ఆలయం, లక్ష్మీనారాయణ పెరుమాళ్ ఆలయం ముఖ్యమైనవి. అసలు పళని కొండలే ఎంతో ఆహ్లాదకరంగా ఉంటాయి. ప్రకృతి అందాలను వీక్షిస్తూ పళని ఆలయాన్ని చేరుకోవాలంటే మెట్లమార్గంలో వెళ్లడం ఉత్తమం.

**- డి.వి.ఆర్. భాస్కర్**

ఇక్కడ మూడు రకాల హెయిర్ స్టయిల్స్ ఉన్నాయి. మూడింటిని కలిపే త్రీ హెడ్‌బ్యాండ్ బ్రెయిడ్స్ అంటారు. హెయిర్‌ను లీవ్ చేసుకోవడం ఇష్టపడేవారికి ఈ మూడు స్టయిల్స్ భలేగా నచ్చుతాయి. ఇందులోని మూడు జడలు... మూడు రకాలుగా ఉండి, మీ సిగ సోయగాన్ని మరింత పెంచుతాయి. ఈ మూడు హెయిర్ స్టయిల్స్ వేసుకోవడానికి జుత్తు మరీ పొడవుగా ఉండాల్సిన పని లేదు. అలాగే కర్లీ హెయిర్ ఉన్నవాళ్లకు కూడా ఇవి బాగా నప్పుతాయి. స్టెప్ బై స్టెప్ ఫాలో అవుతూ హాయిగా ఈ మూడు రకాల స్టయిళ్లనూ మీరూ ట్రై చేయండి మరి. ఎలా అంటే? ఇలా...



# త్రీ హెడ్‌బ్యాండ్ బ్రెయిడ్స్...

## A

1. ముందుగా జుత్తునంతా చిక్కులు లేకుండా దువ్వుకోవాలి. తర్వాత కుడి చెవివైపున పాపిట తీసి, ఎడమవైపు జుత్తులో నుంచి సన్నని మూడు పాయలను తీసుకోవాలి.

2. పై పాయలతో ఒక అల్లిక అల్లి, తర్వాత ఇరువైపుల నుంచి ఒక్కో సన్నని పాయను తీసుకొని అల్లుకుంటూ పోవాలి.

3. జుత్తును చివరి వరకూ కాకుండా.. కాస్తంత వదిలేసి అల్లుకోవాలి. ఆ మిగిలిన జుత్తును కుడివైపుకు తీసుకెళ్లి, స్లైడ్ పెట్టుకోవాలి.

4. జడ అల్లిక మరీ టైట్‌గా లేకుండా... ఒక్కో పాయను కదిలిస్తూ వదులు చేసుకోవాలి. అంతే, అందమైన హెయిర్ స్టయిల్ రెడీ.

## B

1. ముందుగా జుత్తునంతా చిక్కులు లేకుండా దువ్వుకోవాలి. తర్వాత కుడి చెవివైపున పాపిట తీసి, ఎడమవైపు జుత్తులో నుంచి సన్నని మూడు పాయలను తీసుకొని అల్లాలి. చివర కాస్తంత వదిలేసి, బ్యాండ్ పెట్టుకోవాలి.

2. ఇప్పుడు నుదుటి దగ్గర ఉన్న జుత్తులో నుంచి ఒక సన్నని పాయను తీసుకొని, ఫొటోలో కనిపిస్తున్న విధంగా జడలోని ఓ అల్లిక మధ్యలో నుంచి తీయాలి.

3. తర్వాత మరో పాయను తీసుకొని, పై విధంగానే జడలోని మరో అల్లికలో నుంచి బయటికి తీయాలి. ఆ పాయలు కదలకుండా కుడివైపు ఏదైనా పెద్దసైజు క్లిప్ పెట్టుకోవాలి.

4. అలా మీకు నచ్చినన్ని పాయలను అల్లికల్లో నుంచి బయటికి తీయొచ్చు. చివరికి క్లిప్ తీసి, స్లైడ్స్ పెట్టుకుంటే... హెయిర్ స్టయిల్ సూపర్‌గా ఉంటుంది.

## C

1. ముందుగా జుత్తునంతా చిక్కులు లేకుండా దువ్వుకోవాలి. తర్వాత కుడి చెవివైపున పాపిట తీసి, ఎడమవైపు జుత్తులో నుంచి రెండు పాయలను తీసుకోవాలి. వాటిని విడివిడిగా మెలితిప్పి... రెండింటికీ కలిపి బ్యాండ్ పెట్టుకోవాలి.

2. ఇప్పుడు మళ్లీ ఇరువైపుల నుంచి రెండు పాయలను తీసుకోవాలి. వాటిని కూడా పై విధంగా మెలితిప్పుకొని బ్యాండ్ పెట్టుకోవాలి. పై పోనీని ఇందులో కలపాలి.

3. ముందు స్టెప్‌లో చేసినట్టుగానే... ఇరువైపుల నుంచి మరో రెండు పాయలను తీసుకోవాలి. వాటిని కూడా ట్విస్ట్ చేసి బ్యాండ్ పెట్టుకోవాలి. ప్రతిసారీ బ్యాండ్ పెట్టుకునేటప్పుడు పై పోనీని ఇందులో కలపాలి.

4. చివరగా జుత్తును టైట్‌గా లేకుండా వదులు చేసుకోవాలి. అలాగే చివరి పోనీకున్న బ్యాండ్‌ను తొలగించి స్లైడ్ పెట్టుకోవచ్చు లేదా బ్యాండ్‌ని ఉంచుకోవచ్చు. అంతే... ఎంతో అందమైన హెయిర్ స్టయిల్ మీ సొంతం.









లెగ్గింగ్, జెగ్గింగ్, జీన్స్, సిగరెట్ ప్యాంట్ ఏ మోడల్‌ది ఎంచుకున్నా అన్నింటికీ చక్కగా అమరే టాప్ కుర్తీ. క్యాజువల్ వేర్‌గానూ, పార్టీ వేర్‌గానూ కుర్తీ భేషుగ్గా ఇమిడిపోతుంది. నైస్‌గా ఉండే కుర్తీ డ్రాఫ్ట్ తెలుసుకుంటే ఎవరికి వారు సొంతంగా డిజైన్ చేసుకోవచ్చు. ప్యాచ్ వర్క్, ఎంబ్రాయిడరీ వర్క్ లాంటివి డ్రాఫ్టింగ్ పూర్తయ్యాక ఎంపిక చేసుకోవచ్చు. మరి ఇంకేం...శరీర కొలత ప్రకారం క్లాత్ తీసుకొని కుర్తీ డ్రాఫ్టింగ్ ఇప్పుడే మొదలుపెట్టండి.

# లాంగ్ స్లీవ్స్ కుర్తీ



**ఇంచులలో కొలతలు...**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీ కొలత | 32 | 34 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ చుట్టుకొలత | 33 | 35 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ కింది భాగం | 26 | 27 | 30 | 32 | 34 | 37 |
| హిప్ (పిరుదుల భాగం) | 33 | 34 | 38 | 40 | 42 | 45 |
| భుజం | 11 | 12 | 12 | 13 | 13 | 14 |
| చేతుల పొడవు 3/4 | 15 | 15 | 15 | 17 | 17 | 17 |
| చంకభాగం | 14 | 15 | 15 | 16 | 17 | 17 |
| ముందు నెక్ డెప్త్ | 6 | 6.5 | 7 | 7 | 7.5 | 7.5 |
| వెనుక నెక్ డెప్త్ | 8 | 8 | 8.5 | 8.5 | 9 | 9 |
| మొత్తం పొడవు | 36 | 38 | 38 | 38 | 40 | 40 |

సుస్మిత, డిజైనర్

నిర్వహణ: ఎన్.ఆర్

కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడిఐ), హైదరాబాద్ www.idi.co.in

ఫ్రంట్ బాడీ డ్రాఫ్టింగ్




## ఫ్రంట్ బాడీ

- AB = పూర్తి పొడవు
- AE = ఆర్మ్‌హోల్ రౌండ్ /2
- AF = నడుము పొడవు
- AG = హిప్ లెంగ్త్
- EE1 = ఛాతీ చుట్టుకొలత/4
- FF1 = నడుము చుట్టుకొలత / 4
- GG1 = హిప్ చుట్టుకొలత / 4
- A1 నుంచి కిందుగా E E1 లైన్‌కి అటాచ్ చేస్తూ E2 వద్ద మార్క్ చేయాలి.
- మళ్లీ A1 దగ్గరకు వచ్చి అర అంగుళం కిందుగా మార్క్ చేయాలి. A2 నుంచి A3 వరకు మార్క్ చేస్తే ఇది షోల్డర్ స్లోప్ అవుతుంది.
- A2&E2 మధ్య పాయింట్ A4 అవుతుంది. దీనికి అర అంగుళం లోపలికి మార్క్ చేయాలి. ఈ మార్క్ A5 గా మార్క్ చేయాలి.
- A2, A4, E1 & A2, A5, E1 ముందు, వెనక భాగాల ఆర్మ్‌హోల్ వంపును గీయాలి.
- E1, F1, G1 & B1 ఇది కుర్తీకి రెండువైపులా కింది భాగపు వంపు అవుతుంది.

నోట్: క్లాత్ లేదా చార్ట్‌ను మధ్యకు నిలువుగా మడత వేసి, సిద్ధం చేసుకోవాలి. పై విధంగా ఛాతీ భాగాన్ని డ్రాఫ్ట్ చేయాలి.

బ్యాక్ బాడీ డ్రాఫ్టింగ్




## బ్యాక్ బాడీ

- AA1 = భుజం /2
- AA2 = 1/2 షోల్డర్ స్లోప్
- AA3 = నెక్ విడ్త్/2
- A3, A2 స్ట్రెయిట్ లైన్ షోల్డర్ స్లోప్
- A3AX = నెక్ డెప్త్

నోట్: ఫ్రంట్ డ్రాఫ్ట్‌లో ఇచ్చినట్టు A2, A4, E1 & A2, A5, E1 ముందు, వెనక భాగాల ఆర్మ్‌హోల్ వంపును గీయాలి. E1, F1, G1 & B1 ఇది కుర్తీకి రెండువైపులా కింది భాగపు వంపు అవుతుంది.

## స్లీవ్స్ డ్రాఫ్టింగ్

- AB = స్లీవ్స్ పొడవు
- AA1 = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- A A2 = 3 అంగుళాలు
- BB1 = ముంజేతుల చుట్టుకొలత /2
- ఇలస్ట్రేషన్‌లో చూపిన విధంగా A A2 వరకు వంపు భాగాన్ని గీసుకోవాలి. అలాగే A2 నుంచి B1 చేతి కింది భాగం డ్రాఫ్ట్ చేయాలి.



• కథ

# ఊరికి పోయి రావాల

• పాలగిరి విశ్వప్రసాద్

ఉదయం 6 గంటలకు మంచం మీద నుండి లేవడానికి కునికిపాట్లు పడుతుండగా సెల్‌ఫోన్ మోగింది. ఇంక లేవక తప్పలేదు. అవతలి నుండి 'విశ్వనాథ్ గారా?' కన్నడంలో అడిగారెవరో. నాకు కన్నడం రాదు.

అతను చెప్పిన పేరు నాదే. 'ఔను. విశ్వనాథ్‌నే మాట్లాడుతున్నా'. అవతలి నుండి, తన పేరు రఘురామ సోమయాజి... అంటూ కన్నడంలో చెప్పుకుపోతున్నాడు.

నేను ఇంగ్లీషులో అడిగే ప్రయత్నం చేసినా, అతను కన్నడంలోనే చెప్పుకుపోతున్నాడు. అతని మాటల్లో అక్కడక్కడా వినిపించిన ఇంగ్లీషు పదాల ఆసరాగా కొంత అర్థమయింది.

ఆర్నెళ్ల కిందట చనిపోయిన మావూరి వాడే అయిన నా మిత్రుడు చంద్రారెడ్డి దానం చేసిన గుండె, ఈ రఘురామ సోమయాజిలో ఉంది.

అంతకు మించి అర్థం కాలేదు 'ఐ విల్ కాల్ బ్యాక్ ఇన్ ఏ ఫ్యూ మినిట్స్' అని ఫోన్ కట్ చేసినా. వెంటనే కన్నడం తెలిసిన మిత్రుడు భాస్కర్‌కు ఫోన్ చేసి, సోమయాజి నెంబరు ఇచ్చి విషయం కనుక్కోమన్నాను.

నాలో ఆలోచనలు ముసురుకున్నాయి.

చంద్రారెడ్డి గుండెను అమర్చుకున్న రఘురామ సోమయాజి! చనిపోయిన చంద్రారెడ్డి గుండెతో జీవిస్తున్న సోమయాజి!

•••

ఆ రోజు చంద్రారెడ్డి బ్రెయిన్ డెడ్ అయ్యాక, అవయవ దానానికి చంద్రారెడ్డి భార్య, కొడుకులను ఒప్పించింది తనే. కొడుకులిద్దరూ ఒక్క మాటతోనే ఒప్పుకున్నారు. ఉష మాత్రం ససేమిరా కాదంటే కాదంది.

కడపలోనే ఉంటున్న నా చిన్ననాటి స్నేహితుడు కృష్ణయ్యకు 'లివర్' పూర్తిగా చెడిపోయింది. అతన్ని బతికించాలని నా తాపత్రయం. ఎలాగూ మట్టిలో కలిసిపోయే అవయవాల వల్ల మరొకరు, మరికొన్నేళ్ళు జీవించే అవకాశం ఉన్నప్పుడు... ఆ సందర్భం కళ్ళముందుకొచ్చినప్పుడు... నేను ఆమెలాగే విచక్షణ కోల్పోయి మౌనంగా ఉండకూడదనుకున్నాను.

కృష్ణయ్యను బతికించడానికి చంద్రారెడ్డి భార్య ఉషను బలవంతంగా ఒప్పించాల్సి వచ్చింది. కృష్ణయ్యకు లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ జరిగింది. ఒక మనిషిగా నా కర్తవ్యం చేశాననుకున్నాను.

తక్కిన అవయవాలు రెండు కళ్ళూ, రెండు కిడ్నీలు, ఊపిరితిత్తులు, గుండె ఎవరికి చేరాయో!

గుండె మార్పిడి మాత్రం అప్పుడు టీవీ ఛానెల్స్‌లో, పత్రికల్లో ప్రముఖంగా వచ్చింది. చెన్నై ఆసుపత్రిలో చంద్రారెడ్డి బ్రెయిన్ డెడ్ శరీరం నుండి అన్ని అవయవాలు తీసిన తర్వాత చివరగా గుండెను తీశారు.

హాస్పిటల్ నుండి ఏర్‌పోర్ట్ వరకూ పోలీసులు ట్రాఫిక్ క్లియర్ చేసి ఉంచారు. గాజుపెట్టెలో ఏదో లిక్విడ్‌లో పెట్టిన గుండె అంబులెన్స్‌లో ఆఘమేఘాల మీద ఏర్‌పోర్ట్‌కు చేరింది. అక్కడి నుండి విమానంలో బెంగుళూరుకు దూసుకుపోయింది. ఆ నగరంలో కూడా ఏర్‌పోర్ట్ నుండి హాస్పిటల్ వరకూ ట్రాఫిక్ క్లియర్ అయింది. అంబులెన్స్‌లో ఆ గుండె శరవేగంగా ఆసుపత్రికి చేరింది. గుండెను శరీరం నుండి తీసిన నాలుగు గంటలలోపే అది అవసరమైన వారి శరీరంలో అమర్చాలట.

ఈ సంఘటనను చెబుతూ 'మీడియా' ఆ రోజు ఆ రెండు ఆసుపత్రులనూ, ఆ డాక్టర్లనూ ఆకాశానికెత్తింది. గుండెను దానం చేసినవారి ఊసుమాత్రం ఆ వార్తల్లో లేదు.

•••

చంద్రారెడ్డి గుండె చేరింది ఈ రఘురామ సోమయాజి శరీరంలోకా! ఇప్పుడెందుకు ఫోన్ చేసినట్లు? నా ఫోన్ నెంబరు ఎలా దొరికింది?... అసలు నాకే ఎందుకు ఫోన్ చేసినట్లు?

నా ఆలోచనలు గతంలోకి, వర్తమానంలోకి గింగుర్లు తిరుగుతున్నాయి. అర్ధగంట తర్వాత భాస్కర్ నుండి ఫోన్ వచ్చింది.

''బాసూ! మీ ఫ్రెండెవరో బ్రెయిన్ డెడ్ అయినప్పుడు అతని అవయవాలు దానం చేసినారన్నావు గదా! అతని గుండె అమర్చింది ఈ సోమయాజికేనంట. మామూలుగా అయితే అవయవాలు దానం చేసినవారి వివరాలు తీసుకున్నవారికీ, తీసుకున్నవారి వివరాలు దానం చేసినవారికీ చెప్పరంట. బెంగుళూరు



ఆసుపత్రి డాక్టర్లలో తనకున్న పలుకుబడితో, చెన్నై ఆసుపత్రి డాక్టర్లను పరిచయం చేసుకున్నాడట. ఫోన్లలో పని కాకపోతే స్వయంగా చెన్నై వెళ్ళి తనకు జీవితం ఇచ్చిన వారి వివరాలు కనుక్కున్నాడంట. మీ ఫ్రెండ్ భార్యకు, కొడుకులకు ఫోన్‌లు చేస్తే పనిచేయడం లేదట. పనిచేస్తున్న ఒక్క ఫోన్ వారం రోజుల నుండి రింగవుతోంది గానీ లిఫ్ట్ చేయడం లేదంట. ఆ అవయవ దానానికి సూత్రధారివి నువ్వేనని కనుక్కుని, నీ నెంబరు పట్టుకుని ఫోన్ చేసినాడంట. తనకు జీవితం ఇచ్చినవారిని కలుసుకుని కృతజ్ఞత చెప్పుకోవాలంట. డాక్టర్లు మాత్రం వెళ్ళొద్దు, వాళ్ళను చూసి ఎమోషనల్ అయితే గుండెకు దెబ్బ అంటున్నారంట. అయినా వాళ్ళను కలుసుకుంటాను, తనకు సహకరించమంటున్నాడు.

ఈ రోజే బెంగుళూరు నుండి కార్లో బయలుదేరుతున్నారంట. నిన్నూ, నన్నూ కడప విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దనీ ఫోన్‌లోనే కాళ్ళు పట్టుకుంటున్నాడు. ఆయన్ను, మీ ఫ్రెండ్



భార్యా కొడుకులతో కలపనంత కలిపి పుణ్యం కట్టుకోరా!'' గడగడా మాట్లాడి, నన్ను మాట్లాడనీయకుండానే ఫోన్ కట్ చేసినాడు.

నాకు దిక్కు తోచలేదు. ఆర్నెల్ల నుండీ మా వూరికి పోవాలంటేనే నాకు మొహమెక్కడం లేదు. ఆరోజు కృష్ణయ్య జీవితం నిలబెట్టాలనే తాపత్రయంతో, చంద్రారెడ్డి భార్యను వత్తిడి చేసి వొప్పించిన సందర్భమే మహాసంకట సమయంలో జరిగింది.

ఆ రోజు చంద్రారెడ్డి చనిపోవడమే ఒక విస్మయం. హఠాత్మరణం. మా వూర్లో పెద్ద భూస్వామి చంద్రారెడ్డి. చంద్రారెడ్డికీ వాళ్ళ నాయన మాదిరే రాజకీయాల ధ్యాస లేదు. తనూ, తన కుటుంబం, తన వ్యవసాయం, తన సంపాదన అంతే. ప్రతిఫలం లేకుండా ఎవరికీ ఏ సాయం చేయని 'లోభి' తనముందనే పేరుంది.

పురానీతి 28వ పేజీలో

ఆ రోజు ఉదయమే వూరి నుండి ఫోన్.

పల్లె నుండి ప్రొద్దుటూరుకు పోతున్న చంద్రారెడ్డి పట్టణ శివారులో యాక్సిడెంట్‌కు గురైనాడు. ప్రొద్దుటూరు గవర్నమెంటు ఆసుపత్రి నుండి కడపలోని మల్టీకేర్ కార్పొరేట్ హాస్పిటల్‌కు తీసుకొస్తున్నారు... అని ఫోన్ సారాంశం. నేను ఊరు విడిచి వచ్చి ఇరవై యేళ్ళయినా... ఊరి దగ్గరున్న అమ్మా, నాయనలు కాలమయి పోయినా ఊరితో నా వేర్లు తెగలేదు.

నేను హాస్పిటల్‌కు చేరుకున్న సమయంలోనే, ప్రొద్దుటూరు నుండి అంబులెన్స్ చేరుకుంది. వెనుక 'సుమో'లో ఆడవాళ్ళు దిగినారు. మగవాళ్ళెవరూ రాలేదు. వెనుక మోటర్ బైకుల్లో వస్తున్నారన్నారు.

ఇక హాస్పిటల్‌లో 'అంతా నేనే' అవ్వాల్సి వచ్చింది. వెంటిలేటర్‌తో శ్వాస పోసుకుంటున్న చంద్రారెడ్డి శరీరాన్ని అంబులెన్స్ నుండి స్ట్రెచర్ మీద కిందికి దించినారు. చంద్రారెడ్డి అప్పటికే కోమాలోకి పోయినట్లుంది. ముక్కు నుండి, చెవుల నుండి రక్తం కారుతూ మొహమంతా రక్తమయమయింది. డాక్టర్లు చూడగానే అత్యవసర కేసుగా గుర్తించి, సంబంధించిన డాక్టర్ల టీమ్‌ను నిమిషాల మీద పిలిపించినారు.

శరీరంలో మొత్తం అన్ని అవయవాలను 'స్కానింగ్' చేయాలని నిర్ధారించినారు. రిపోర్టు రాసి హాస్పిటల్‌కు చెందిన ప్రత్యేక అంబులెన్స్‌లో నగరంలో ఖరీదైన అధునాతన స్కానింగ్ సెంటర్‌కు పంపించారు. వెంట ఆసుపత్రి స్టాఫ్ ఉన్నారు.

నాకు తెరపి దొరికి చుట్టూ చూశాను.

వెయిటింగ్ హాల్‌లో ఉష అచేతనంగా కుర్చీలో జారగిలబడి వుంది.

స్కానింగ్ సెంటర్ నుండి అంబులెన్స్ వచ్చింది. చంద్రారెడ్డిని హాస్పిటల్‌కు చేర్చగానే బయట నుండి వచ్చిన డాక్టర్ల టీమ్ ముసురుకుంది.

ఓ పది నిమిషాలు రిపోర్టులూ, శరీరాన్నీ పరిశీలించి ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

హాస్పిటల్‌కు చెందిన డాక్టరు బయటకు వచ్చి ''చెన్నై తీసుకుపోండి, ఏర్పాట్లు చేస్తాం!'' అన్నాడు. ప్రక్కనే ఉన్న నర్సుకు ఒక చీటీ ఇచ్చి, ''వాళ్ళతో అడ్వాన్స్ పోసూ ఈ డబ్బు క్యాష్ కౌంటర్‌లో కట్టించు. కట్టిన వెంటనే వచ్చి చెప్పు'' పురమాయించాడు.

నేను డాక్టర్‌ను కదిలించినా.

'బ్రెయిన్ డెడ్. తలలో నరాలన్నీ చిట్లిపోయినాయి. చెన్నై వెళ్ళాక అక్కడ డాక్టర్స్ టీమ్ ఇంకోసారి ఎగ్జామిన్ చేస్తారు. వెంటిలేటర్, స్పెషల్ అంబులెన్స్ ఏర్పాటు చేసి పంపిస్తాం. అక్కడ ఆర్గాన్స్ డొనేట్ చేసేట్లయితే ముందుగానే నిర్ణయించుకోండి'

'ఆర్గాన్స్ డొనేట్' మాట వినగానే నాకు కృష్ణయ్య జ్ఞాపకం వచ్చినాడు. వాడికి లివర్ పూర్తిగా చెడిపోయింది. ఏ తాగుడు వ్యసనం వల్లో వాడి లివర్ చెడిపోలేదు. ఏదో 'సిర్రోసిస్' అనే రోగం వచ్చింది. కుటుంబ సభ్యుల లివర్ మ్యాచ్ కాలేదు. అయినా మరొకరి లివర్‌ను కత్తిరించి అమర్చే దశ దాటిపోయింది. ఇపుడు పూర్తి లివర్... కెడావరిక్ లివర్ అంటే బ్రెయిన్ డెడ్ అయిన వారి నుండి పూర్తి లివర్ కావాలి.

వాడు 'జీవన్ దాన్'లో రిజిష్టరు చేయించుకుని, బ్రెయిన్ డెడ్ అయిన వారి లివర్ కోసం చావును కళ్ళల్లో పెట్టుకుని ఎదురుచూస్తున్నాడు. క్షణమాలోచించకుండా, ఉన్నఫళంగా అంబులెన్స్‌తోపాటు, వెనుక వాహనంలో నేనూ చెన్నై బయలుదేరాను.

వాహనంలో పోతుండగానే, చంద్రారెడ్డి కొడుకులిద్దరికీ ఫోన్ చేశాను. ఎంటెక్ పూర్తిచేసి ఢిల్లీలో సివిల్స్‌కు ప్రిపేర్ అవుతున్న పెద్ద కొడుకుతో, ఈ నడుమనే పూణేలో సాఫ్ట్‌వేర్‌లో చేరిన చిన్న కొడుకుతో మాట్లాడాను. ఇద్దరూ 'యాక్సిడెంట్ విషయం' తెలిసిందన్నారు.

బ్రెయిన్ డెడ్ విషయం చెప్పి, అవయవ దానానికి వాళ్ళను ఒప్పించే ప్రయత్నం చేశాను.

చెన్నై హాస్పిటల్‌లో మరోసారి డాక్టర్స్ టీమ్ 'బ్రెయిన్ డెడ్' నిర్ధారించాక, అవయవ దానం ప్రస్థావన చేశాను. కొడుకులిద్దరూ సమ్మతి తెలిపినారు. ఉష అస్సలు ఒప్పుకోలేదు. ససేమిరా కాదంటే కాదంది. హిస్టీరిక్‌గా ప్రవర్తించింది.

''అవయవాలన్నీ తీసేసి కాయాన్ని మూటగట్టి ఇస్తే తీసుకుపోవాల్నా? నేనొప్పుకోను. నా మొగుడే పోయిన తర్వాత, ముక్కూ మొఖం తేలీని వాళ్ళెకెవరికో ఆయప్ప అవయవాలిచ్చి వాళ్ళను బతికించేంత దయ నాకు లేదు. ఆ పుణ్యం మాకొద్దు'' అంటూ చెన్నై హాస్పిటల్‌లో పిచ్చిదానిలా ఊగిపోయింది. ఏడుస్తూ ఉన్మాదిలా రేగిపోయింది.

ఆమె అన్న, తమ్ముళ్ళకు విడమరిచి చెప్పి,

వాళ్ళ ద్వారా ఆమెనెలాగో
ఒప్పించామందరమూ. కొడుకులిద్దరూ ఆసుపత్రి వాళ్ళిచ్చిన అన్ని కాగితాల మీదా బాధగానే సంతకాలు చేసినారు. ఉష ఏడుస్తూ, అందర్నీ శాపనార్థాలు పెడుతూ సంతకం చేసింది.

●●●

ఆ రోజు నుండి ఊర్లో ఉష కనపడినవాళ్ళందరి దగ్గరా నన్ను శాపనార్థాలు పెడుతోందని విన్నాను. ఎట్టున్నవాడిని అట్లే పూడ్చి సమాధి కట్టుకోకుండా, తన భర్తను పీలికలు పీలికలు చేసి మూట కట్టి చేతిలో పెట్టించానని దుమ్మెత్తి పోస్తోందని విన్నాను.

ఇవన్నీ విని నాకు ఊరికి పోవడానికే మొహమెక్కడం లేదు. పుణ్యానికి పోయి ఏదో పాపం చేశానేమోననే న్యూనత. మా ఊరికి పోయి ఉషకు కృతజ్ఞతలు చెప్పి వద్దామని, కృష్ణయ్య ఎన్నోసార్లు మొరపెట్టుకున్నాడు. నేను ఆ మొర ఆలకించలేదు. ఇప్పుడు తప్పేటట్టు లేదు. కృష్ణయ్యకూ ఫోన్ చేసినా. ''మా ఊరికి వెల్దాం. గంటలో రడీగా ఉండు.''

మధ్యాహ్నం రెండు గంటలకు భాస్కర్ నుండి ఫోనొచ్చింది. 'వాళ్ళు కడపకు ఎంటరయినారంట. హరిత టూరిజం రెస్టారెంట్ దగ్గరకు రమ్మన్నా. నువ్వు రా సామీ!''

నేను వెళ్ళగానే రఘురామ సోమయాజిని పరిచయం చేశాడు. యాభై యేళ్ళు దాటినట్లున్నాయి. మరో ఇద్దరు. యువకుడు తమిళం. యువతి కన్నడం. ముప్పై, ముప్పై అయిదేళ్ళ మధ్యలో ఉన్నారు. వాళ్ళకూ తెలుగు రానట్లుంది. ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు.

''వీళ్ళిద్దరూ కూడా మీ ఫ్రెండ్ లైఫ్ ఇచ్చినవాళ్ళే. డాక్టర్ శరవణన్, కల్పన. చంద్రారెడ్డి రెండు కిడ్నీలూ వీళ్ళలో చెరొకటి ఉన్నాయి.''

భాస్కర్ మాటలు, నాకు సంభ్రమం కలిగించాయి.

చంద్రారెడ్డి మరణంతో, జీవిస్తున్న ముగ్గురు అజ్ఞాత వ్యక్తులు నా కళ్ళముందు కనిపిస్తున్నారు. నాలుగోవాడు కృష్ణయ్య వచ్చాడు.

ఏవేవో బేకరీ ఐటమ్స్ మోసుకొచ్చాడు.

వాటిని కారులో పెడదామని డిక్కీ తెరిపిస్తే, డిక్కీ నిండా పండ్ల పెట్టెలు. ఆపిల్స్, పైనాపిల్స్, ఆల్‌మండ్స్, కర్జూరాలు... రకరకాలు. వాటితోపాటు తేనె సీసాలు.

నేను, భాస్కర్‌ను పక్కకు పిలిచి, నేను ఊరికి ఎందుకు రాలేనో దీనంగా చెప్పి, నా పరిస్థితి అర్థం చేసుకోమన్నాను. వాళ్ళను మా ఊరికి తీసుకుపోయి ఉషతో మాట్లాడించి తీసుకురమ్మన్నాను. అక్కడ వీళ్ళు గానీ, ఆమె గానీ ఏ రకమైన ఎమోషన్‌కు గురికాకుండా చూడమన్నాను. 'అందుకు నువ్వే సమర్థుడి'వంటూ కాళ్ళా వేళ్ళాపడ్డాను.

''నాకు ఇదేం పితలాటకం సామీ!... సరేలే!''

ఐదుగురూ కారెక్కారు. డాక్టర్ శరవణన్ డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. నేను కారెక్కకపోయే సరికి, బెంగుళూరు నుండి వచ్చిన ముగ్గురు దిగి నా చేతులు పట్టుకుని బలవంతం చేశారు. భాస్కర్ వారితో కన్నడంలో ఏదో సర్దిచెప్పి కారెక్కించాడు.

●●●

నాకు మనసు కుదురుగా లేదు. అన్ని పనులు విడిచిపెట్టి ఇంట్లోనే కూర్చున్నా. నిలకడ లేదు... కాలు కాలిన పిల్లినైపోయాను... అక్కడేం జరుగుతోందో! భాస్కర్‌కు ఫోన్ చేయాలనుకుని చేతికి తీసుకోవడం. మళ్ళీ ఆలోచన విరమించుకుని పక్కన పడేయడం. ఫోన్ రింగైతే, పరుగున పోయి 'భాస్కరేమో?' అని చూడడం... నిరాశగా లిఫ్ట్ చేసి అవతలి వాళ్ళతో పొడిపొడిగా మాట్లాడి, 'బిజీగా ఉన్నా'నంటూ కట్ చేయడం.




నాకు నరాలు చిట్లిపోయేట్లున్నాయి.

సాయంత్రం ఆరు గంటలవుతుండగా భాస్కర్ నుండి ఫోన్.

''ఏమైంది రా?''

''బాగా టెన్షన్ పడ్తున్నట్లుందే. అంతా సవ్యం బాసూ! బయలుదేరి మీ వూరి పొలిమేర దాటుకున్నాం.''

''ఉష ఏమనింది?''

''ముందు కొంచెం ముభావంగా ఉన్నింది. వీళ్ళు మాట్లాడిన తీరు ఆమెను కరిగించింది. శరవణన్, కల్పనతో పాటు రఘునాథ సోమయాజి కూడా వంగి ఆమె కాళ్ళకు నమస్కరించేసరికి ఆమె తత్తరపడింది. ఇంకా మనోడు కృష్ణయ్య కూడా పాదాభివందనం చేసేసరికి సిగ్గుపడింది. ఇక్కడ నేనోగొప్ప అనువాదకుడినైపోయినా. వీళ్ళ మాటలు ఆమెకు తెలుగులో, ఆమె మాటలు వీళ్ళకు కన్నడంలో, తమిళంలో చెప్పడమే నా పని అయిపోయింది. మేము పోయిన అర్ధ గంటకు పల్లెలో వాళ్ళు చాలామంది ఆ ఇంటికి చేరినారు. వీళ్ళు, ఊరిలో వాళ్ళతో ఉష మా పాలిట దైవమనీ, ఆమె వల్లే తాము బతుకుతున్నామనీ లేకుంటే ఈ శరీరాలు ఈ పాటికే మట్టిలో కలిసుండేవని పదే పదే చెప్పుకున్నారు. బాసూ! మీ వూర్లో అంతకుముందు చంద్రారెడ్డి ఆర్గాన్స్ డొనేషన్స్ గురించి ఏమనుకున్నారో గానీ, వీళ్ళు పోయిన తరువాత ఇప్పుడు చంద్రారెడ్డి, ఆయన భార్య చాలా గొప్పవాళ్ళయిపోయినారు. వీళ్ళు అక్కడికి చేరిన వారందరికీ పండ్లు, స్వీట్స్ పంచినారు. సోమయాజి డబ్బు ఇవ్వబోతే కూడా ఉష తీసుకోలేదు. వీళ్ళు తెచ్చిన పండ్ల పెట్టెలు, తేనె సీసాలు కూడా వద్దంది. బలవంతం చేస్తే రకానికొక పండ్ల పెట్టె, ఒక తేనె సీసా తీసుకుంది. మిగిలినవన్నీ తిరుగుటపా. అవన్నీ నీకూ నాకే...''

''నోర్మూసుకోరా! నీ ఓగల కూతలూ నువ్వూ! పక్కన వాళ్ళున్నారనే సిగ్గు కూడా లేదా!..''

''సిగ్గెందుకు బాబూ! వాళ్ళకు మన ఓగల కూతలేవీ అర్థం కావులే. ఆ సరుకంతా తిరిగి తీసుకుపోవడం వాళ్ళు అవమానంగా భావిస్తున్నారు. అయినా...''

భాస్కర్ మాట్లాడుతుండగానే సెల్‌లో ఉష ఫోన్.

భాస్కర్‌ను కట్ చేసి ఉష ఫోన్ లిఫ్ట్ చేసినా 'హలో' అన్నా సంశయంగా.

''అన్నా! బాగున్నారా! నన్ను క్షమించు. మా ఆయప్ప కాయము అంతా కోసి మూటకట్టి ఇచ్చినారని అందరితో నిన్ను నానా మాటలు మాట్లాడినా. ఈ పొద్దు వాళ్ళొచ్చి పోయినాక తెలుస్తాంది ఎంత గొప్పపని చేయించినావు. చచ్చిపోవాల్సిన నలుగురు మనుషులు మా ఆయప్ప అవయవాలతో బతికి, నా ముందుకొచ్చి నిలబడి ఉంటే నాకు ఏందో వింత జరిగినట్లుంది. ఊర్లో ఈయప్ప ఎవరికీ ఏ సాయం చేయడని అనుకుంటారు. ఈపొద్దు ఎనిమిది మందికి బతుకునిచ్చినాడు గదన్నా. వాళ్ళు నాలుగు లక్షలు లెక్క ఇయ్యబోతే వద్దంటే వద్దని చెప్పినా. ఆ లెక్క తీసుకుంటే ఆయప్పను అమ్ముకున్నట్లు గాదాన్నా!...'

కండ్లు, ఊపిరితిత్తులు, ఇంగా ఏవో అవయవాలు తీసుకున్నవాళ్లు ఎక్కడుంటారో నీకు తెలుసా అన్నా! వాళ్ళను కూడా చూసింటే బాగుండుననిపిస్తాంది.''

ఉష నన్నేమీ మాట్లాడనీయలేదు. నేనేమీ మాట్లాడలేకపోయాను.

''నువ్వూ, వదినా ఊరికి వచ్చినప్పుడు ఇంటి కాడికి రాండన్నా!'' అన్నది చివరగా.

''సరేమ్మా!''

ఉష మాట్లాడాక నా మనసులో ఆర్నెళ్లుగా మోస్తున్న బరువేదో దిగిపోయినట్లయింది.

'ఒకసారి ఊరికి పోయి రావాల' అనుకున్నా.

• సందేహం

# శాశ్వత పరిష్కారం లేదా?



డా॥ వేనాటి శోభ
లీలా హాస్పిటల్
మోతీనగర్,
హైదరాబాద్

**నా వయసు 19 ఏళ్లు. ఎత్తు 5.5 అడుగులు, బరువు 42 కిలోలు. నాకు మూతి మీద, గడ్డం మీద పలచగా వెంట్రుకలు వస్తున్నాయి. షేవ్ చేసుకుంటే మరింత గరుగ్గా మారతాయని భయంగా ఉంది. ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం ఏదైనా సూచించగలరా?**

**- దివ్య, పొద్దుటూరు**

కొందరిలో హార్మోన్ల అసమతుల్యత వల్ల అవాంఛిత రోమాలు ఏర్పడుతాయి. మగ వారిలో ఎక్కువగా ఉండే టెస్టోస్టిరాన్ అనే ఆండ్రోజన్ హార్మోన్ కొందరి ఆడవారిలో కూడా అనేక కారణాల వల్ల ఎక్కువగా స్రవిస్తుంది. దీనివల్ల పెదవులపైన, గడ్డంమీద, కొందరిలో ఛాతిపైన, కాళ్లు, చేతులుపైన ఎక్కువగా వెంట్రుకలు వస్తాయి. అండాశయాలలో ఎక్కువగా నీటిబుడగలు, అంటే పాలిసిస్టిక్ ఓవరీస్ (పిసిఓడీ), అడ్రినల్ గ్రంథిలో కంతులు, కొన్ని జన్యుపరమైన సమస్యలు వంటి ఎన్నో సమస్యల వల్ల అవాంఛిత రోమాలు ఏర్పడు తాయి. నీకు గల కారణాన్ని తెలుసుకోవడానికి గైనకాలజిస్ట్ లేదా ఎండోక్రైనాలజిస్ట్‌ను సంప్రదించి టెస్టోస్టిరాన్, డీహెచ్ఈఎస్ వంటి అవసరమైన హార్మోన్, రక్తపరీక్షలతోపాటు, అల్ట్రాసౌండ్, అబ్డామిన్ అండ్ పెల్విస్ చేయించుకుని, కారణాన్ని బట్టి దీర్ఘకాలంగా చికిత్స తీసుకోవలసి ఉంటుంది. శరీరంలో ఉన్న హార్మోన్లని తగ్గించడానికి చికిత్స తీసుకోవడం వల్ల కొత్తగా వచ్చే వెంట్రుకల సాంద్రత మెల్లగా తగ్గుతూ వస్తుంది. ముందు నించి వెంట్రుకలను తొలగించుకోవడానికి తాత్కాలిక పద్ధతులను పాటించవచ్చు. ఇప్పుడు ఆధునికంగా చేసే లేజర్ ట్రీట్‌మెంట్ ఒక్కొక్కరి శరీరతత్వాన్ని బట్టి హార్మోన్ల అసమతుల్యతను బట్టి వాటి సిట్టింగ్స్‌కు సమయం పడుతుంది. శాశ్వత అవాంఛిత రోమాల నివారణకు చాలా సమయం పడుతుంది. ఖర్చు అవుతుంది. కాబట్టి ఓపికతో చికిత్స తీసుకోవలసి ఉంటుంది. శరీరంలో ఉన్న హార్మోన్స్‌ను నియంత్రణ చెయ్యకుండా కేవలం లేజర్ చికిత్స తీసుకోవడం వల్ల కొంత కాలం వెంట్రుకలు లేకపోయినా, మళ్ళీ వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి.

**నా వయసు 44 ఏళ్లు. ఎత్తు 5.1 అడుగులు, బరువు 66 కిలోలు. మూడు నెలలుగా నాకు నెలసరి రాలేదు. మెనోపాజ్ అనుకున్నాను. రెండు రోజుల కిందటే మళ్లీ బ్లీడింగ్ మొదలైంది. బాగా ఎక్కువగా బ్లీడింగ్ అవుతోంది. కడుపులో బాగా నొప్పిగా ఉంటోంది. కాళ్లు, చేతులు తిమ్మిర్లుగా అనిపిస్తున్నాయి. నా సమస్యకు పరిష్కారం సూచించగలరు.**

**- జగదాంబ, అనకాపల్లి**

మధ్యవయసు దాటిన తర్వాత సాధారణంగా పీరియడ్స్ సంవత్సరం పాటు రాకపోతే దానిని మెనోపాజ్‌గా పరిగణిస్తాము. కొందరిలో మెనోపాజ్ వచ్చే మూడు, నాలుగు సంవత్సరాలు ఇంకా ముందు నుంచి కూడా శరీరంలో హార్మోన్లలో మార్పులు జరుగుతుంటాయి. వాటి అసమతుల్యత వల్ల పీరియడ్స్ సక్రమంగా రాకుండా, బ్లీడింగ్‌లో హెచ్చుతగ్గులు కనిపిస్తుంటాయి. ఈ వయసులో ఇది మామూలే కదా అని నిర్లక్ష్యం చెయ్య కూడదు. ఎందుకంటే ఈ వయసులో గర్భాశయంలో, అండాశయంలో కంతులు, సిస్ట్‌లు, క్యాన్సర్‌లు ఇంకా ఇతర సమస్యలు కూడా ఏర్పడే అవకాశాలు ఉంటాయి. ఈ విషయంలో మూడు నెలల నుంచి బ్లీడింగ్ అవ్వకుండా, ఇప్పుడు ఎక్కువగా అవ్వడం వల్ల రక్తహీనత ఏర్పడి నీరసంగా ఉండడం, కాళ్ళనొప్పులు, తిమ్మిర్లు వంటివి ఉండి ఉండవచ్చు. అలాగే మూడు నెలల నుంచి బ్లీడింగ్ కానప్పుడు కొందరిలో ఎండోమెట్రియం పొర మందంగా ఏర్పడి, అతి తర్వాత బ్లీడింగ్ రూపంలో బయటకు వచ్చేటప్పుడు కొందరిలో పొత్తికడుపు, నడుం నొప్పి వస్తుంది. కాబట్టి మీరు అశ్రద్ధ చెయ్యకుండా గైనకాలజిస్ట్‌ను సంప్రదించి బ్లీడింగ్ తగ్గడానికి మందులు వాడుకుంటూ, ఈ సమస్యకు గల కారణాన్ని తెలుసుకొని దానికి తగ్గ చికిత్స తీసుకోవడం మంచిది.



ఇంటికి-ఒంటికి
29వ పేజీలో

దీనికోసం కంప్లీట్ బ్లడ్‌కౌంట్, థైరాయిడ్ ప్రొలాక్టిన్ వంటి హార్మోన్ పరీక్షలు, అల్ట్రాసౌండ్, పాప్‌స్మియర్ వంటివి చేయించుకుంటే మంచిది. వీటిలో ఏ సమస్యా లేకపోతే మెనోపాజ్ ముందు వచ్చే మార్పులుగా అనుకుని, భయపడాల్సిన అవసరం లేదు. బ్లీడింగ్ ఎక్కువగా ఉన్నప్పుడు అది తగ్గడానికి మందులు వాడుకుంటూ, రక్తహీనత ఉంటే సరైన పోషకాహారంతో పాటు ఐరన్‌మాత్రలు, విటమిన్స్, కాల్షియం మందులు వాడటం మంచిది. మీ ఎత్తుకి 55 కేజీల వరకు బరువు ఉండవచ్చు. మీరు 10 కేజీల అధిక బరువు ఉన్నారు. అధిక బరువు ఉన్నప్పుడు కూడా హార్మోన్ల అసమతుల్యత ఏర్పడి పీరియడ్స్ సక్రమంగా రావు. కాబట్టి బ్లీడింగ్ అరికట్టడానికి మందులు వాడుకుంటూ, బరువు తగ్గడానికి వాకింగ్, వ్యాయామాలు, పరిమితమైన పౌష్టికాహారం తీసుకోవడం మంచిది.

# శుక్రాచార్యుడి శపథం

**రా**క్షసుల గురువు ఉశీనుడు శుక్రాచార్యుడనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు. శుక్రాచార్యునికి తెలియని విద్య లేదు. రాని యుద్ధ తంత్రం లేదు. ఆయన ఒక్కగానొక్క కూతురు దేవయాని. ఆచార్యునిగా శుక్రుడు చాలా మేటి. అయితే ఆయనకు రెండు బలహీనతలున్నాయి. వాటిలో మొదటిది సురాపానమైతే, రెండవది కూతురిపట్ల గల ప్రేమానురాగాలు. శుక్రాచార్యునికి అపురూపమైన, అత్యద్భుతమైన మృతసంజీవనీ విద్య తెలుసు. దాని సాయంతో ఆయన దేవతల చేతిలో పరాజితులై, మృతిచెందిన రాక్షసవీరులను బతికిస్తూ, రాక్షస జాతి నశించిపోకుండా కాపాడుకుంటూ వస్తున్నాడు. దాంతో రాక్షసుల బలం పెరుగుతూ, దేవతల బలం తగ్గుతూ వస్తోంది. ఇలా లాభం లేదనుకుని దేవతల గురువు బృహస్పతి ఒక ఉపాయం ఆలోచించాడు. ఎలాగైనా సరే, రాక్షసగురువు నుంచి మృతసంజీవని విద్యను నేర్చుకోవాలి. చూస్తూ చూస్తూ శుక్రుడు దేవతలకు ఆ విద్యను బోధించడు కాబట్టి ఎలాగోలా నేర్పుగా శుక్రుడి నుంచి ఆ విద్యను సంగ్రహించాలి. అందుకు ఎంతో ఒడుపు, చాకచక్యమూ కలిగిన వారు కావాలి. అంత ఒడుపుగా ఆ విద్యను సాధించగలవారెవ్వరా అని ఆలోచిస్తుండగా, నేనున్నానంటూ కచుడు ముందుకొచ్చాడు. కచుడు ఎవరో కాదు, బృహస్పతి కుమారుడే. దేవతలందరూ వెనుకాడుతున్న పనిని నేను చేయగలనంటూ ముందుకొచ్చిన కచుణ్ణి పితృవాత్సల్యంతో కావలించుకున్నాడు బృహస్పతి. ''కుమారా! ఎంతో నేర్పరితనం, తెలివితేటలూ నీకున్నాయని తెలుసు. అయితే, ఆ విద్యను సాధించేందుకు కేవలం తెలివితేటలొక్కటే సరిపోదు. తంత్రం కూడా తెలిసుండాలి. అదేమంటే, శుక్రాచార్యుడికి కూతురంటే పంచప్రాణాలు. ఆమెకోసం ఆయన ఏమైనా చేస్తాడు కాబట్టి ముందుగా నీవు ఆయన కూతురు ప్రేమను సాధించుకో. అప్పుడు నీకు ఎటువంటి ప్రమాదమూ ఉండదు'' అంటూ చక్కటి మార్గాంతరాన్ని ఉపదేశించాడు బృహస్పతి.

కచుడు మానవరూపంలో శుక్రాచార్యుడి వద్దకు వెళ్లాడు. ఎంతో వినయంతో ఆయనకు తనను తాను ఎవరూ లేని అనాథనని, మీవద్ద విద్యలు నేర్చుకోవడానికి వచ్చానని పరిచయం చేసుకున్నాడు. ముందు ఒప్పుకోకపోయినా, విద్యపట్ల అతనికున్న తపన, అతని వినయ విధేయతలకు, తెలివితేటలకు ముచ్చటపడి, తన వద్దనే ఉంచుకున్నాడు శుక్రుడు. గురువు బోధించిన విద్యలన్నిటినీ నేర్చుకుంటూ, ఎంతో వినయంతో, భక్తి గౌరవాలతో గురువుకు సేవలు చేయసాగాడు కచుడు. తమ గురువు కచుణ్ణి అభిమానించడం, గురుపుత్రిక దేవయాని కచుణ్ణి ఆరాధించడం రాక్షసులకు కంటగింపుగా మారింది. ఓసారి అదను చూసి అడవిలో ఒంటరిగా ఉన్న కచుణ్ణి కొట్టి చంపేశారు రాక్షసులు. తర్వాత ఏమీ ఎరగనట్లుగా కచుడు కనబడటం లేదంటూ గురువుకు చెప్పారు. ఏమి జరిగిందో దివ్యదృష్టితో గ్రహించాడు



శుక్రాచార్యుడు. మృతసంజీవనీ విద్యతో కచుణ్ణి బతికించాడు. ఈవిధంగా రెండుమూడుసార్లు జరిగింది.

చివరికి రాక్షసులు కచుణ్ణి చంపి, కాల్చి బూడిదచేసి, ఆ బూడిదను మద్యంలో కలిపి మాటల్లో పెట్టి శుక్రాచార్యుడి చేత తాగించారు. కచుడు ఎక్కడున్నాడా అని దివ్యదృష్టితో చూసిన శుక్రుడికి కచుడు బూడిదరూపంలో తన ఉదరంలోనే ఉన్నట్లు తెలిసింది. పుత్రిక మీదున్న ప్రేమతో శుక్రాచార్యుడు తన ఉదరంలో ఉన్న కచుడికి మృతసంజీవనీ విద్యను ఉపదేశించాడు. కచుడు శుక్రుడి పొట్టను చీల్చుకుని వచ్చి, తనకు నేర్పిన విద్యతో తిరిగి గురువును బతికించుకున్నాడు.

'పుత్రిక అంటే తనకున్న అపారమైన ప్రేమ, మద్యమంటే ఉన్న మక్కువ వల్లే కదా, రాక్షసులకు గురుస్థానంలో ఉన్న తనే తన నోటితో శత్రువులకు మృతసంజీవనీ విద్యను ఉపదేశించవలసి వచ్చింది,' అని ఆలోచించిన శుక్రుడికి సిగ్గు వేసింది. జీవితంలో ఇక మద్యం ముట్టనని, ఎవరి మీదా మక్కువ పెంచుకోననీ శపథం చేశాడు.














# చిరిగినా... చిత్రాలు చేయొచ్చు

మనకు ఇష్టమైన దుపట్టాలు, స్కార్ఫులు కొన్నాళ్లు వాడితే చిరిగి పీలికలవుతాయి. రంగులు మాత్రం వన్నె తరగవు. అలాంటి వాటిని పారేయకుండా కొత్త కొత్తగా అలంకరణలను మనమే తయారు చేసుకోవచ్చు. పెద్దగా శ్రమ పడక్కర్లేదు.

కొంచెం ఐడియా ఉంటే చాలు. మరి ఆ ఐడియా ఏంటో తెలుసుకుందామా...

1. దుప్పట్టాను పొడువుగా, వెడల్పుగా కత్తిరించుకోవాలి.
2. వెడల్పు ఉన్న భాగాన్ని మధ్యకు మడిచి బెల్టు ఆకారంలో కుట్టాలి.
3. ఇప్పుడు కావల్సిన సైజు థర్మాకోల్ బాల్స్‌ను దుప్పట్టా లోపలకు ఎక్కించి బాల్‌కు, బాల్‌కు మధ్య ముడివేయాలి.
4. గొలుసు ఆకారంలో ఎంత పొడవు కావాలంటే అంత పొడువు దుప్పట్టాకి ఇరువైపులా దారంతో కుట్టేయాలి.

పెద్దలకు, పిల్లలకు రకరకాల ఆకారాల్లో ఈ గొలుసులను తయారు చేసుకోవచ్చు కాస్త విభిన్నంగా, ఇంకాస్త విలక్షణంగా కనిపించాలనుకుంటే...

దుప్పట్టా గొలుసును మీరు ట్రై చేస్తారు కదూ...







# సీసాతో... చిత్రాలు!!

గాజుసీసా లేని వంటిల్లు లేదంటే లేదంటే ఆశ్చర్యపోక తప్పదు. అవునండీ: ప్రస్తుతం తేనె, జామ్, పచ్చళ్లు... ఇలాంటివి గాజు సీసాల్లో అమ్ముతున్నారు. దీంతో గాజు సీసాలు మన వంటింటికి వచ్చి చేరుతున్నాయి. సీసాలను ఇంటి అలంకరణకు ఉపయోగిస్తే ఎలా ఉంటుంది? సూపర్‌గా ఉంటుంది కదా!

గాజు సీసాలకు రకరకాల రంగులను వేసుకుని పూలతో అలంకరిస్తే చాలా అందంగా కనిపిస్తాయి. అంతేకాకుండా రంగురంగుల దారాలను చుట్టి కొత్తగా అలంకరించుకోవచ్చు. సీసాలకు రంగులు వేసి అద్దాలు, పూసలు, దారాల వంటి వాటితో అమర్చి అలంకరణ వస్తువులుగా హాల్లో వాడుకోవచ్చు లేదా కిచన్లో స్పూన్స్ స్టాండుగా వినియోగించుకోవచ్చు. సీసాలకు రంగులతో కొద్దిగా టచప్ ఇచ్చి డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర మేకప్ సామన్లు వేసుకోవచ్చు. సీసాలను గోడలకు అమర్చేలా స్టాండ్లను తయారు చేసుకుంటే మరింత ఆకర్షణగా కనిపిస్తాయి.





• డిసెంబర్ 7 ఇంటర్నేషనల్ సివిల్ ఏవియేషన్ డే




విమానయానంలో వేగం పెంచిన తొలితరం జెట్ విమానం

# విమానాలు... విశేషాలూ...

పురాణాల్లోని పుష్పక విమానం గురించిన కథలు చాలా శతాబ్దాలుగానే ప్రచారంలో ఉన్నాయి. శతాబ్దం కిందటి వరకు ఆ కథలు విన్న వాళ్లెవరూ ఆకాశంలో నిజంగా ఎగిరే విమానాన్ని చూసి ఎరుగరు. అమెరికాకు చెందిన రైట్ సోదరులు 1905 నాటికి పూర్తిస్థాయిలో మనుషుల రవాణాకు పనికొచ్చే తొలి విమానానికి రూపకల్పన చేసి, విజయవంతంగా దాన్ని ఆకాశంలో నడిపించగలిగారు. అప్పట్లో వారు తయారు చేసిన విమానం చాలా నెమ్మదిగా ఎగిరేది. ఇప్పుడైతే విమానాలు ధ్వని వేగాన్ని మించిన వేగంతో ప్రయాణించగలుగుతున్నాయి గానీ, రైట్ బ్రదర్స్ రూపొందించిన విమానం గరిష్ఠ వేగం గంటకు 48 కిలోమీటర్లు మాత్రమే. రైట్ బ్రదర్స్ విమానం కనుగొన్న పదేళ్లకు గానీ విమానయానం ప్రయాణికులకు అందుబాటులోకి రాలేదు. అమెరికాకు చెందిన ఎలియట్ ఎయిర్ సర్వీస్ 1915లో మొట్టమొదటిసారిగా పౌర విమానయానాన్ని అందుబాటులోకి తెచ్చింది. విమానయానం దేశ దేశాలకు పాకడంతో 1944లో అంతర్జాతీయ పౌర విమానయాన సంస్థ (ఐసీఏఓ) ఏర్పడింది. ఐసీఏఓకు 1994లో యాభయ్యేళ్లు పూర్తయిన సందర్భంగా డిసెంబర్ 7వ తేదీని అంతర్జాతీయ పౌర విమానయాన దినోత్సవంగా (ఇంటర్నేషనల్ సివిల్ ఏవియేషన్ డే) ఐక్యరాజ్య సమితి ప్రకటించింది. అంతర్జాతీయ పౌర విమానయాన దినోత్సవం సందర్భంగా విమానయానం గురించి కొన్ని ఆసక్తికరమైన సంగతులు...

## మన దేశంలో జేఆర్డీ టాటా ఆద్యుడు



మనదేశంలో పౌర విమానయానానికి జేఆర్డీ టాటా ఆద్యుడు. పారిశ్రామికవేత్త అయినప్పటికీ స్వయంగా పైలట్ అయిన టాటా దృష్టి విమానయానంపైనే ఉండేది. ఆయన 1932లో ప్రారంభించిన టాటా ఎయిర్‌లైన్స్ ప్రయాణికుల రవాణాతో పాటు తపాలా బట్వాడా సేవలనూ అందించేది. ప్రారంభమైన తొలి ఏడాదిలోనే టాటా ఎయిర్‌లైన్స్ విమానాలు 1.60 లక్షల మైళ్లు ప్రయాణించాయి. 155 మంది ప్రయాణికులను సురక్షితంగా గమ్యానికి చేర్చాయి. 10 టన్నుల తపాలాను బట్వాడా చేశాయి. టాటా ఎయిర్‌లైన్స్ తొలినాళ్లలో తన విమానాలను భారత భూభాగం పరిధిలోనే నడిపేది. విమానయాన సేవలను అంతర్జాతీయ స్థాయికి విస్తరించేందుకు 1946లో టాటా ఎయిర్‌లైన్స్‌ను 'ఎయిర్ ఇండియా'గా మార్చారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత భారత ప్రభుత్వం ఎయిర్ ఇండియాలోని 49 శాతం పెట్టుబడులను స్వాధీనం చేసుకుంది. ఆ తర్వాత జేఆర్డీ టాటా సలహాపై భారత ప్రభుత్వం డొమెస్టిక్ విమానాలు నడిపేందుకు 'ఇండియన్ ఎయిర్‌లైన్స్' ప్రారంభించింది.




ఎయిర్ ఇండియా తొలి విమానం



మొట్టమొదటి కమర్షియల్ విమానం



రైట్ సోదరులు రూపొందించిన తొలి విమానం

అప్పటి నుంచి 'ఎయిర్ ఇండియా' పూర్తిగా అంతర్జాతీయ విమానయాన సేవలు ప్రారంభించింది.

## విమానయానంలో వేగమే వేదం

విమానయానానికి వేగమే వేదంగా మారింది మాత్రం జెట్ విమానాలు అందుబాటులోకి వచ్చిన తర్వాతే. తొలిసారిగా 1964లో 'లియర్‌జెట్' విమానాలు ప్రయాణాలు అందుబాటులోకి వచ్చాయి. వీటి గరిష్ఠ వేగం గంటకు 900 కిలోమీటర్లకు పైనే. 'లియర్‌జెట్' విమానాలు అందుబాటులోకి వచ్చిన దశాబ్దం గడవక ముందే బోయింగ్ విమానాలు మరింత వేగంతో రంగంలోకి దిగాయి. వీటి గరిష్ఠ వేగం గంటకు దాదాపు 990 కిలోమీటర్లు. ఇవి అందుబాటులోకి వచ్చిన తర్వాత దూరాల భారం గణనీయంగా తగ్గి ప్రయాణాలు సులభతరమయ్యాయి.

# నీ నవ్వు చెప్పింది నాతో...



సిరివెన్నెల సీతారామశాస్త్రి
గీత రచయిత



రాజ్ మాదిరాజు
దర్శకుడు

''అమ్మాయితో పరిచయం..ప్రణయం..పరిణయం.. క్లుప్తంగా ఓ వ్యక్తి జీవిత ప్రయాణాన్ని అందంగా ఐదు నిమిషాల్లో చెప్పిన గీతమిది'' అన్నారు రాజ్ మాదిరాజు. నాగార్జున, ఊర్మిళ జంటగా రామ్‌గోపాల్ వర్మ దర్శకత్వంలో వచ్చిన చిత్రం 'అంతం'. ఈ చిత్రంలో 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి 'నీ నవ్వు చెప్పింది నాతో..' అనే పాట రాశారు. ఆర్.డి. బర్మన్ స్వరపరిచిన ఈ పాటతత్వం గురించి 'ఋషి', 'ఆంధ్రాపోరి' చిత్రాల దర్శకుడు రాజ్ మాదిరాజు మాటల్లో....

ఈ పాట సందర్భం ఏంటంటే... చిన్నప్పట్నుంచీ ఓ మారణాయుధంలా పెంచబడ్డ ఓ అనాథ కుర్రాడు తొలిసారి జీవితంలో అమ్మాయి అనే అందం, సున్నితత్వాలకు పరిచయమవుతాడు. అమ్మాయితో అతడి పరిచయం, స్నేహం, ప్రణయం.. ఒక్కో దశను ఈ పాటలో ఆవిష్కరించారు.

**పల్లవి: నీ నవ్వు చెప్పింది నాతో నేనెవ్వరో ఏమిటో**
**నీ నీడ చూపింది నాలో ఇన్నాళ్ల లోటేమిటో (2)**

ఓ జంటకు, ఒంటరి జీవితానికీ మధ్య తేడా ఏంటనేది శాస్త్రిగారు ఈ పల్లవిలో అద్భుతంగా చెప్పారు. పాట సందర్భానికి కూడా తగ్గట్టు.. తన పక్కన నడిచే అమ్మాయి నీడ ఇన్నాళ్ల తన జీవితంలో ఉన్న లోటు, అమ్మాయి నవ్వే తానెవ్వరో చెప్పిందంటూ అందంగా వర్ణించారు.

**చరణం1: నాకై చాచిన నీ చేతిలో చదివాను నా నిన్నని (2)**
**నాతో సాగిన నీ అడుగులో చూసాను మన రేపుని**
**పంచేందుకే ఒకరు లేని బతుకెంత బరువో అని**
**ఏ తోడుకి నోచుకోని నడకెంత అలుపో అని**

అబ్బాయి ఆలోచనలకు, బాధకూ అక్షర రూపం ఈ చరణం. స్నేహంతో అతడికి ఓ అమ్మాయి చేయి అందించింది. అంతకు ముందు ఏ అమ్మాయి తన జీవితంలో లేని విషయాన్ని గుర్తు చేసుకుని ఆ చేతిలో నా గతాన్ని చదివానని చెబుతున్నాడు. అమ్మాయి తన పక్కనే నడుస్తుంటే, ఆ అడుగుల్లో రేపు అనే రోజు ఎంత అందంగా ఉంటుందో ఊహించుకుంటాడు.



పట్టుకోండి చూద్దాం
37వ పేజీలో

జీవితంలో తోడు లేదంటే నడకలో అలుపు, బతుకులో బరువు తప్పదని ఆ అబ్బాయి తెలుసుకుంటాడు.

**చరణం2: నల్లని నీ కనుపాపలలో ఉదయాలు కనిపించనీ (2)**
**వెన్నెల పేరే వినిపించని నడిరేయి కరిగించనీ**
**నా పెదవిలో దారి నాకే చిరునవ్వు పుడుతుందనీ**
**నీ సిగ్గు నా జీవితాన తొలి ముగ్గు పెడుతుందనీ..**

ఉదయం పూట అమ్మాయిలు ముగ్గులు వేస్తారు. అటువంటిది అమ్మాయి సిగ్గు అబ్బాయి జీవితంలో ముగ్గు పెట్టడం అంటే..





అమ్మాయి రాకతో తన జీవితం ఉదయించిందని చెబుతున్నాడు. ప్రతి ఉదయం అమ్మాయి కనుపాపలో మొదలవ్వాలని ఆశిస్తున్నాడు. జీవితంలో మార్పును ఆహ్వానిస్తున్నాడు.

**చరణం3: ఏనాడైతే ఈ జీవితం రెట్టింపు బరువెక్కునో (2)**
**తనువు మనసు చెరిసగమని పంచాలి అనిపించునో**
**సరిగా అదే శుభముహూర్తం సంపూర్ణమయ్యేందుకు**
**మనమే మరో కొత్త జన్మం పొందేటి బంధాలతో**

॥నీ నవ్వు...॥

బాధలు, బాధ్యతలతో జీవితం బరువెక్కినప్పుడు మనం ఎవరితోనైనా పంచుకుంటే బరువు తగ్గుతుంది. ఆయుధంలా పెరిగిన ఆ యువకుడి బాధను పంచుకోవడానికి అమ్మాయి వచ్చిందనే విషయాన్నీ చెప్పారు. అదే సమయంలో వాళ్లిద్దరూ ఒక్కటయ్యారనే అంశాన్ని శృంగారాత్మకంగానూ చెప్పారు. మొదటి చరణంలో అతడు పడిన బాధకు ఇక్కడ ముగింపు పలికారు.

ఆర్.డి.బర్మన్ స్వరం, శాస్త్రిగారి సాహిత్యం అద్భుతమైతే... ఎస్పీ బాలసుబ్రహ్మణ్యంగారి గానం, 'ఓ లలాలలా..' అనే ఆలాపన మహాద్భుతం. ఆయన గానం మంత్రముగ్ధుల్ని చేస్తుంది.

అందమైన ప్రయోగాలు, అద్భుతమైన ప్రతి భావంతుల కలయిక ఈ పాట.

దాదాపు పాతికేళ్ల క్రితం వచ్చిన ఈ పాట నా జీవితంలోనూ మార్పు తీసుకొస్తుందని ఊహించలేదు. (నవ్వుతూ...) అప్పుడు నేను నాగార్జునగారిలా ఉన్నానని గట్టిగా నమ్మేవాణ్ణి. ప్రతి అమ్మాయి దగ్గర ఆగి కళ్లు ఆర్పకుండా చూసేవాణ్ణి. పైగా, అమ్మాయే నన్ను చూసిందని స్నేహితులకు చెప్పేవాణ్ణి. టీనేజ్ నుంచి తలెత్తి ఓ ధిక్కారపు యవ్వనంలోకి వెళ్తున్న సమయం అన్నమాట. టీనేజ్‌లో తల్లిదండ్రులు నేర్పిన సంస్కారం వలన అమ్మాయిల కాళ్లు తప్ప, నేనెప్పుడూ వాళ్ల ముఖాలు చూసింది లేదు. యవ్వనంలో డెనిమ్ జాకెట్ జేబుల్లో చేతులు పెట్టుకుని నిర్లక్ష్యంగా కాళ్ళను అటోటీ.. ఇటోటీ.. విసిరేస్తూ, నీళ్ళలో నా రోడ్‌స్టార్ షూస్ తడిసేలా నడిచేవాణ్ణి. అప్పుడొచ్చిందీ 'అంతం'. సినిమా అంతా ఒక ఎత్తయితే.. ఈ పాట ఒక్కటీ మరో ఎత్తు. హాంటింగ్ మెలోడీ అంటే ఏమిటో అప్పుడు నాకు తెలీదు. ఆ ఆలాపన, భావన, సంగీతం మళ్లీ మళ్లీ వినాలని నా మనసులో బలమైన కోరిక. అంతసేపు ఒకే పాట వింటూంటే పిచ్చి ఎక్కాల్సిందిపోయి ఇంకా ఇంకా కావాలని కోరుకునే ఓ అలౌకిక స్థితి. క్యాసెట్‌కి రెండు వైపులా ఈ పాటను రికార్డు చేయించి పెట్టుకున్నాను.

**పీయస్:** ఈ పాట నాపై అంత ప్రభావం చూపించిందని నాకూ తెలీదు. పాడుకుంటూ విజయవాడ నుంచి హైదరాబాద్ వచ్చేశాను. ఆ ఏడాది మైథిలి పరిచయమైంది. ఇద్దరమూ ఏడడుగులూ వేసి అప్పుడే పదిహేడేళ్లు అయ్యింది.

ఇంటర్వ్యూ: **సత్య పులగం**

## ● సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### ● మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | ■ | ■ |
| ■ | ■ | | ■ | | ■ | 4 |
| 5 | | | 6 | ■ | 7 | |
| | ■ | ■ | 8 | | ■ | ■ |
| 9 | | ■ | | ■ | 10 | 11 |
| | ■ | 12 | | 13 | ■ | |
| ■ | 14 | ■ | ■ | 15 | | |

**అడ్డం:**

1. 'కళాతపస్వి' పండించిన ఈ సినిమాలో...సర్వదమన్ బెనర్జీ పండిట్ హరిప్రసాద్ పాత్రలో నటించాడు. మున్‌మున్ సేన్ ప్రత్యేక పాత్ర పోషించారు. (5)
5. 'ఆలయశిఖరం' 'శ్రుతిలయలు' 'అగ్నిగుండం' 'మెరుపు దాడి' 'అంతిమతీర్పు' 'వేట' 'చట్టంతో పోరాటం' సినిమాలలో నటించిన అందాల నటి (4)
7. ఈ చిత్రకారుడు, సృజనాత్మక దర్శకుడి అసలు పేరు సత్తిరాజు లక్ష్మీనారాయణ. 'మిస్టర్ పెళ్లాం' 'రాంబంటు' 'రాధాగోపాళం' 'సుందరకాండ' 'శ్రీరామరాజ్యం' చిత్రాల దర్శకుడు (2)
8. కెమెరామెన్ కేవీ ఆనంద్ దర్శకత్వంలో వచ్చిన చిత్రం. ఈ పొలిటికల్ థ్రిల్లర్‌లో జీవా, అజ్మల్ అమీర్, కార్తీక...నటించారు(2)
9. మదన్ డైరెక్ట్ చేసిన ఈ సినిమాలో ఆది 'వరాల బాబు'గా నటించాడు. అగస్త్య సంగీతం సమకూర్చారు. ఈ రొమాంటిక్ కామెడీ యాక్షన్ ఫిల్మ్‌కు సాయికుమార్ నిర్మాత (2)
10. శ్రీను వైట్ల సినిమా అటు నుంచి. కానీ మధ్యలోనే ఆగిపోయాడు (2)
12. తెలుగు, తమిళ, కన్నడ సినిమాలలో నటించిన ఈ నటి అసలు పేరు రత్నకుమారి. 'జీవనజ్యోతి' 'దసరాబుల్లోడు' 'రంగుల రట్నం' మొదలైన చిత్రాల్లో నటించారు.
14. ఎనిమిదవ గడిలో అక్షరానికి ఈ గడిలోని అక్షరం చేరిస్తే... 'బావాగారు బాగున్నారా' సినిమా కథానాయిక (2)
15. నిత్యానంద్ సంగీతం సమకూర్చిన ఈ సినిమాలో కాంతారావు, శారద, వసంత... మొదలైన వారు నటించారు (3)

**నిలువు:**

2. రాజా, పార్వతిమెల్టన్ నటించిన ఈ సినిమాకు దేవకట్ట దర్శకుడు. మహేష్ శంకర్ సంగీతం. (3)
3. శ్రీవాస్ దర్శకత్వంలో గోపిచంద్, అనుష్క, కళ్యాణి, జగపతిబాబు....నటించిన సినిమా. మణిశర్మ సంగీతం సమకూర్చారు (2)
4. చిరంజీవి, రాధ నటించిన ఒక సినిమా. ఇదే పేరుతో విజయ్ కూడా ఒక సినిమాలో నటించాడు. పవన్‌కళ్యాణ్ సినిమా పేరులో కూడా ఉంటుంది (2) కింది నుంచి
5. భీమినేని శ్రీనివాసరావు దర్శకత్వంలో పవన్ కళ్యాణ్ నటించిన సినిమా. 'ఏ స్వప్నలోకాల' 'హ్యాపీ హ్యాపీ బర్త్ డేలు' పాటలు ఈ సినిమాలోనివే (4)
6. కె.రాఘవ నిర్మించిన ఈ సినిమాకు కోడి రామకృష్ణ దర్శకుడు. సుమన్, భానుచందర్, పూర్ణిమ...నటించారు. సంగీతం జే.వి.రాఘవులు (4)
11. శ్యాంప్రసాద్‌రెడ్డి నిర్మించిన ఈ సినిమాలో రాజశేఖర్, జీవిత జంటగా నటించారు. సత్యం సంగీతం సమకూర్చారు (3)
13. 'తెలుగు వీర లేవరా దీక్ష బూని సాగరా...' రాసి ఉత్తేజం నింపిన మహాకవి (2)

### ● మైథోగ్రఫీ

1. యదువు కొడుకు.
◇◇◇

2. బ్రహ్మ శాసనం మేరకు రాజైనవాడు. పై జవాబులో '1'వ అక్షరంతో.
◇◇◇◇◇

3. రెండవ జవాబులో '4'వ అక్షరంతో... కాలమానం.
◇◇◇

4. విశ్వామిత్రుడి శిష్యుడు. పై జవాబులో...'2'వ అక్షరంతో.
◇◇◇◇

5. పవిత్ర మంత్రం... నాల్గవ జవాబులో మొదటి అక్షరంతో.
◇◇◇

### ● బ్రెయిన్ జిమ్

1. చీమ నోటి కంటే చిన్నది.
2. సర్కిల్‌కు ఎన్ని సైడ్‌లు ఉంటాయి?
3. ఎర్రకొండ కింద, మీద తెల్ల గుర్రాలు.
4. వరి కాని వరి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇ | న్ | సై | డ్ | పి | కే |
| అ | వు | ట్ | సై | డ్ | గో |
| ల | జ | వ | డ | కే | దా |
| చీ | మ | తి | నే | ది | వ |
| ప | అ | మ | జీ | రా | రి |
| ళ్లు | న | క | రా | భా | మా |

### కిసుక్కు

పేషెంట్: చెవికి, గుండెకు ఏమైనా సంబంధం ఉందంటారా?
డాక్టర్: ఉంది. బిల్లు ఎంతైందో చెవి విని గుండెకు చెప్పుతుంది. అప్పుడు అది దడదడమని కొట్టుకుంటుంది!

– జి.శ్వేత, కొరటికల్

### మీకు తెలుసా

అమెరికాలోని కొలింగలో ఐరన్ పార్క్ ఉంది. ఈ పార్క్‌లో పంప్ జాక్‌లతో తయారు చేసిన... రకరకాల జంతువులు, పక్షులు, కార్టూన్ క్యారెక్టర్ల ఆకారాలు ఉన్నాయి. ఇది పర్యాటక ప్రాంతంగా కూడా ప్రసిద్ధి పొందింది.

### జవాబులు

**మాయా బజార్**

అడ్డం: 1. సిరివెన్నెల 5.సుమలత 7. బాపు 8. రంగం 9. గరం 10. ఆగడు 12. వాణిశ్రీ 14. రంభ 15. శ్రీమతి
నిలువు: 2. వెన్నెల 3. లక్ష్యం 4. పులి 5. సుస్వాగతం 6. తరంగిణి 11. ఆహుతి 13. శ్రీశ్రీ

**మైథోగ్రఫీ**

1.రిపుడు 2. రిపుంజయుడు 3. యుగాలు 4. గాలవుడు 5. గాయత్రి

**బ్రెయిన్ జిమ్**

## పదశోధన - 416

నిర్వహణ : **అదృష్టదీపక్**

**ఆధారాలు**

**అడ్డం**

1. బంగారం కాదు– నిప్పు (3)
4. మొదటి హల్లు (1)
5. రెడ్డిరాజుల ఆస్థానంలో విద్యాశాఖాధికారి (4)
7. కీర్తిగలవాడు (3)
9. తడి (2)
10. స్నేహం (2)
11. శివుడు (4)
13. స్థానం, చోటు (2)
14. పతకం మొదలు సాగదీస్తే మహాపాపం (3)
15. సక్రమంగా వెయ్యని తలుపు (3)
16. ప్రావు, తోడ్పాటు (3)
17. మొదలగునవి (3)
18. వేశ్య, అధిపురాలు (2)
19. బాధ్యత లేకుండా తిరిగేవాడు – అల్లు అర్జున్ సినిమా (3)
21. స్వీకారం (2)
22. గొప్పతనం, గౌరవం (3)
24. ఆకాశం (2)
26. స్వేద బిందువు (5)
28. ఇరవై అయిదు నిలువులో వజ్రాయుధం (2)
29. బొడ్డు (3)
30. అన్నదానం చేసే యిల్లు (2)

**నిలువు**

2. విశ్వామిత్రుని వలన ప్రసిద్ధి చెందిన మంత్రం (3)
3. పైకి వచ్చిన బాణం (2)
5. శ్రీవారికి స్త్రీ వాచకం (3)
6. ప్రథమా విభక్తి ప్రత్యయాలు (4)
8. తలకిందుగా తపస్సు చేసేవాడు (3)
9. తడవ (2)
12. చిలుక (2)
13. తన్ను, పాద తాడనం (2)
14. పాణి మధ్య అక్షరం చేర్చి పాదాలకు రాయండి (3)
15. త్రాసు (3)
16. వృక్షాలు లేనిచోట ఇదే మహావృక్షమని లోకోక్తి (6)
17. అడవితో మొదలయ్యే స్త్రీ (3)
18. గంధం తీసే రాయి (2)
20. అగ్నిపర్వతం నుంచి వెలువడేది (2)
23. పరాజయం (3)
24. అధికం, ఎక్కువ (3)
25. పరిశుద్ధం (3)
27. పైకి ఎగిరిన పొట్టు (2)
28. సారం, సామర్థ్యం (2)

### పదశోధన - 415 జవాబు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శ | 2 శి | క | ళ | | 3 ఊ | 4 ప | | 5 స | 6 భ |
| | ల | | | 7 శ్రీ | ర | స్తు | | | క్త |
| 8 అ | ప్ప | డం | | 9 మం | ట | | 10 లు | జ | ప్ర |
| 11 మ | ది | | 12 వం | తు | | 13 వా | | | హ్లా |
| 14 వ | కా | వ | క | లు | | 15 స | 16 దా | | ద |
| 17 స | రం | | ర | | 18 ఆ | న | వా | లు | |
| | | 19 అం | గీ | కా | రం | | గ్ని | | 20 మె |
| 21 ట | | | త | | 22 జ్యో | త్స్న | | 23 సం | తు |
| 24 ము | ద్ద | 25 రా | లు | | తి | | 26 మే | | కు |
| కు | | ణి | | 27 ద్రా | | 28 చి | ను | కు | లు |

## • టేస్టీ టెస్ట్

**అడ్డం:**

4. గోధుమపిండితో ఇంట్లో చపాతీలు మాత్రమే కాదు, పిల్లలకు ఇష్టపడే ఈ చిరుతిండినీ తయారు చేయవచ్చు.
6. అరటికాయ కూరే.. ఇంగ్లిష్‌లో
7. బ్రెడ్‌కు వెన్న పూసి, జామ్ రాసి తింటే వెరైటీ ఏముంది? ఇలా స్వీట్ తయారు చేసుకోవచ్చు.

**నిలువు:**

1. కాలిఫ్లవర్ వేపుడును ఇలా కూడా అంటారు. (కింది నుంచి)
2. గులాబిలా వినిపిస్తుంది. చుట్టలు చుట్టలుగా చుట్టుకొనే తీపి వంటకం
3. విదేశీ చిరుధాన్యమైన ఓట్స్‌తో తయారు చేసే స్వదేశీ మిఠాయి
5. పఫ్డ్‌రైస్ లడ్డూలనే తెలుగులో ఇలా అనొచ్చు.

**జవాబు**

అడ్డం: 4.గోధుమబిస్కెట్స్ 6.రాబనానాకర్రీ 7. డబుల్‌కామీఠా
నిలువు: 1.గోబీఫ్రై 2.జిలేబి 3.ఓట్స్‌లడ్డూ 5.మరమరాల ఉండలు

## సుడోకు - 176

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 5 | | 2 | 7 | 3 | | 9 | |
| | | | 8 | | | 7 | | 5 |
| | | | | 9 | | | 1 | 3 |
| | 7 | | 3 | | | | | 9 |
| | | | | 4 | | | | |
| 9 | | | | | 1 | | 6 | |
| 2 | 4 | | | 8 | | | | |
| 1 | | 6 | | | 7 | | | |
| | 8 | | 1 | 2 | 6 | | 4 | |

కఠిన స్థాయి 1 2 3 4 5

### సుడోకు 175 జవాబు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 9 | 2 | 4 | 8 | 5 | 7 | 1 | 6 |
| 4 | 6 | 1 | 9 | 7 | 2 | 3 | 8 | 5 |
| 7 | 5 | 8 | 3 | 6 | 1 | 9 | 2 | 4 |
| 2 | 8 | 3 | 5 | 9 | 6 | 4 | 7 | 1 |
| 9 | 1 | 4 | 2 | 3 | 7 | 6 | 5 | 8 |
| 6 | 7 | 5 | 1 | 4 | 8 | 2 | 3 | 9 |
| 1 | 4 | 9 | 8 | 2 | 3 | 5 | 6 | 7 |
| 8 | 2 | 7 | 6 | 5 | 4 | 1 | 9 | 3 |
| 5 | 3 | 6 | 7 | 1 | 9 | 8 | 4 | 2 |

• వారఫలాలు

## 4 డిసెంబర్ నుంచి 10 డిసెంబర్ 2016 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
అనుకున్న పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఆర్థిక పరిస్థితి మరింత మెరుగ్గా ఉంటుంది. ఆప్తుల నుంచి అందిన సమాచారం ఊరట కలిగిస్తుంది. పాతమిత్రుల ద్వారా ఆహ్వానాలు రాగలవు. స్థిరాస్తి వివాదాల నుంచి బయటపడతారు. గృహ నిర్మాణయత్నాలు సానుకూలమవుతాయి. వ్యాపారాలలో లాభాలు. రాజకీయవర్గాలకు ఉత్సాహవంతంగా ఉంటుంది. లేత పసుపు, తెలుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. దేవీస్తోత్రాలు పఠించండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా, రోహిణి, మృగశిర 1,2 పా.)
ఆర్థిక వ్యవహారాలు కొంత నిరాశ కలిగించినా అవసరాలు తీరతాయి. ఆప్తుల నుంచి ఆహ్వానాలు అందుకుంటారు. ప్రతిభ వెలుగులోకి వస్తుంది. ఇంటిలో శుభకార్యాలు నిర్వహిస్తారు. వాహనయోగం. కీలక నిర్ణయాలకు తగిన సమయం. వ్యాపారాలు అభివృద్ధిదాయకంగా ఉంటాయి. ఉద్యోగస్తులకు హోదాలు. కళాకారులకు సన్మానాలు. ఎరుపు, లేత గులాబీ రంగులు, ఉత్తర దిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్ ఛాలీసా పఠనం మంచిది.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
అనుకున్న ఆదాయం సమకూరడంలో కొంత జాప్యం. ముఖ్యమైన పనులు నెమ్మదిగా పూర్తి చేస్తారు. ఆత్మీయులు, బంధువుల నుంచి ముఖ్య సమాచారం అందుతుంది. చిరకాల స్వప్నం నెరవేరుతుంది. సంఘంలో గౌరవం పెరుగుతుంది. వివాహ యత్నాలు అనుకూలిస్తాయి. సభలు, సమావేశాలలో పాల్గొంటారు. వ్యాపారాలు ఉత్సాహవంతంగా సాగుతాయి. ఉద్యోగాలలో అనుకూల పరిస్థితి. రాజకీయవర్గాలకు పదవులు దక్కే అవకాశం. పసుపు, లేత నీలం రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. అంగారకస్తోత్రాలు పఠించండి.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
శ్రమానంతరం పనులు పూర్తి కాగలవు. ఆర్థిక పరిస్థితి గతం కంటే మెరుగ్గా ఉంటుంది. సన్నిహితులు, మిత్రులతో స్వల్ప వివాదాలు నెలకొంటాయి. విద్యార్థులకు ఒత్తిడులు ఉన్నా అనుకున్న ఫలితాలు సాధిస్తారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. దూరపు బంధువులను కలుసుకుంటారు. శుభకార్యాల రీత్యా ఖర్చులు పెరుగుతాయి. వ్యాపారాలు స్వల్పంగా లాభిస్తాయి. ఉద్యోగులకు అదనపు పనిభారం. కళాకారులకు సామాన్యంగా ఉంటుంది. తెలుపు, ఎరుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. నవగ్రహస్తోత్రాలు పఠించండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
ఇంటాబయటా ప్రోత్సాహకరంగా ఉంటుంది. సన్నిహితులు, మిత్రులతో ఉత్సాహంగా గడుపుతారు. కాంట్రాక్టులు దక్కించుకుంటారు. ప్రముఖుల నుంచి కీలక సమాచారం అందుతుంది. వాహనాలు, భూములు కొనుగోలు చేస్తారు. ఆలోచనలు అమలు చేస్తారు. రాబడి కొంత పెరుగుతుంది. వ్యాపారాలు ఉత్సాహవంతంగా సాగుతాయి. ఉద్యోగులకు కొత్త హోదాలు దక్కవచ్చు. పారిశ్రామికవర్గాలకు విదేశీ పర్యటనలు. గులాబీ, నేరేడు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. ఆదిత్య హృదయం పఠించండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1,2 పా.)
కొత్త పనులకు శ్రీకారం చుడతారు. ఆత్మీయుల నుంచి పిలుపురావచ్చు. ఆదాయం గతం కంటే మెరుగ్గా ఉంటుంది. పాతమిత్రులను కలుసుకుని ఉత్సాహంగా గడుపుతారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఒక సమాచారం నిరుద్యోగులకు ఊరటనిస్తుంది. విద్యార్థులకు కొత్త ఆశలు. వ్యాపార లావాదేవీలు మరింత పుంజుకుంటాయి. ఉద్యోగులకు పదోన్నతులు. రాజకీయవర్గాలకు సన్మానయోగం. పసుపు, తెలుపు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుస్తుతి మంచిది.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ 1,2,3 పా.)
ప్రతిభాపాటవాలు వెలుగుచూస్తాయి. బంధువర్గం సలహాలతో ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. భూవివాదాలు కొంత వరకూ పరిష్కారమవుతాయి. దేవాలయాలు సందర్శిస్తారు. కుటుంబంలో శుభకార్యాల నిర్వహణ. ఆరోగ్యం కొంత మందగిస్తుంది. వ్యాపారాలలో లాభాలు అందుకుంటారు. ఉద్యోగులకు కొత్తహోదాలు దక్కవచ్చు. కళాకారుల కృషి ఫలిస్తుంది. నీలం, ఆకుపచ్చ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గాదేవిస్తోత్రాలు పఠించండి.



**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
కొన్ని కార్యక్రమాలు అప్రయత్నంగా పూర్తి కాగలవు. రావలసిన సొమ్ము అంది అవసరాలు తీరతాయి. ఇంటాబయటా ప్రోత్సాహకరంగా ఉంటుంది. భూములు, వాహనాలు కొనుగోలు చేస్తారు. శుభకార్యాల రీత్యా ఖర్చులు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు సంతోషకరమైన సమాచారం. పారిశ్రామికవర్గాలకు ఆకస్మిక విదేశీ పర్యటనలు. ఎరుపు, లేత పసుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. ఆంజనేయస్వామి స్తోత్రాలు పఠించండి.



**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
ఆర్థిక వ్యవహారాలు నిరాశ కలిగిస్తాయి. శ్రమకు తగ్గ ఫలితం కనిపించదు. ఆస్తి వివాదాలు నెలకొంటాయి. బంధుమిత్రులతో అకారణంగా తగాదాలు. ఆరోగ్యంపై కొంత శ్రద్ధ వహించండి. పాతమిత్రులను కలుసుకుంటారు. ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. నిర్ణయాలలో తొందరపాటు వద్దు. వ్యాపార లావాదేవీలు మందకొడిగా సాగుతాయి. ఉద్యోగులకు అదనపు విధులు. రాజకీయ వర్గాలకు చికాకులు తప్పకపోవచ్చు. ఎరుపు, నేరేడు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశ్‌స్తోత్రాలు పఠించండి.



**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
ఉత్సాహంగా చేపట్టిన కార్యక్రమాలు పూర్తి చేస్తారు. ఆర్థిక వ్యవహారాలలో పురోగతి కనిపిస్తుంది. సన్నిహితులు, మిత్రులతో సంతోషంగా గడుపుతారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఇంటి నిర్మాణయత్నాలు సానుకూలమవుతాయి. వ్యాపారాలలో అనుకున్న లాభాలు తథ్యం. ఉద్యోగులకు పదోన్నతులు దక్కుతాయి. కళాకారులకు అవకాశాలు అప్రయత్నంగా దక్కుతాయి. నీలం, ఆకుపచ్చరంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. శివాష్టకం పఠించండి.



**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. ప్రముఖుల నుంచి అందిన సమాచారం ఊరట కలిగిస్తుంది. బంధువుల సహాయంతో ముఖ్యమైన పనులు పూర్తి చేస్తారు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. శుభకార్యాలకు డబ్బు వెచ్చిస్తారు. రాబడి ఉత్సాహాన్నిస్తుంది. కుటుంబసభ్యులతో వివాదాలు పరిష్కారమవుతాయి. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగుల సేవలకు గుర్తింపు పొందుతారు. రాజకీయవర్గాలకు అనుకున్న పదవులు దక్కుతాయి. నలుపు, నేరేడు రంగులు, పశ్చిమ దిశ ప్రయాణాలు అనుకూలం. వేంకటేశ్వరస్వామిని పూజించండి.



**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
కొత్త కార్యక్రమాలు చేపడతారు. ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉంటుంది. సన్నిహితులు మరింత దగ్గరవుతారు. వాహనాలు, భూములు కొనుగోలు చేస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. కొన్ని వివాదాలు ఓర్పుతో పరిష్కరించుకుంటారు. గత సంఘటనలు గుర్తుకు వస్తాయి. పలుకుబడి కలిగిన వారితో పరిచయాలు. వ్యాపారాలలో లాభాలు తథ్యం. ఉద్యోగులకు అదనపు పనిభారం తగ్గుతుంది. పారిశ్రామికవర్గాలకు ఆహ్వానాలు అందుతాయి. గులాబీ, బంగారు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. దత్తాత్రేయస్తోత్రాలు పఠించండి.

• టారో

4 డిసెంబర్ నుంచి
10 డిసెంబర్, 2016
వరకు












టారో ఇన్సియా
అనలిస్ట్

**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)**
ఒత్తిళ్లు, చికాకులు, కోపాలు, ఇతరులతో వివాదాలు మిమ్మల్ని కొంత నిరాశకు గురి చేయవచ్చు. ధ్యానం చేయడం ద్వారా మీ సమస్యలను మీరే పరిష్కరించుకోగలిగే నేర్పరితనం అలవడుతుంది. కెరీర్ పరంగా కొత్తమార్గాలు ఆవిష్కృతమవుతాయి. తికమకలు, పరధ్యానాలను పక్కన పెట్టండి. ప్రశాంతంగా పని చేసుకోండి.
**కలిసొచ్చే రంగు: ఆకుపచ్చ**

**వృషభం (ఏప్రిల్ 20 - మే 20)**
మీరనుకున్న పనులన్నీ నెరవేరాయన్న సంతృప్తి కలుగుతుంది. అయితే మీలోని స్తబ్దతను, నిస్తేజాన్ని తొలగించుకోండి. సరైన సంబంధం కుదురుతుంది. ఒక ఇంటి వాళ్లవుతారు. మీ శ్రమకు తగిన ఫలితాన్ని, గుర్తింపును పొందుతారు. అభద్రతాభావాన్ని విడనాడి, ధైర్యంగా, నిశ్చింతగా ఉండండి. ఒక స్త్రీ మూలంగా అదృష్టం, ఆస్తి కలిసి వస్తుంది.
**కలిసొచ్చే రంగు: ఎరుపు**

**మిథునం (మే 21 - జూన్ 20)**
కీర్తిప్రతిష్ఠలు, విజయం వరిస్తాయి. ఆర్థికంగా కొంత అభద్రత, అస్థిరత ఉండవచ్చు. భయపడకండి. ఆదాయ మార్గాలు కూడా ఉన్నాయి. ఒంటరితనం, ఏదో కోల్పోయిన భావనలు వెంటాడవచ్చు. ఆధ్యాత్మికతను అలవరచుకోండి. ప్రశాంతత అదే వస్తుంది. పనిపరంగా అంతా సవ్యంగా సాగుతుంది. ఆఫీసులో అంతా మిమ్మల్ని మెచ్చుకునేలా పని చేస్తారు. ప్రయాణాలు, సాహసాలు చేస్తారు.
**కలిసొచ్చే రంగు: లేత గులాబీ**

**కర్కాటకం (జూన్ 21 - జూలై 22)**
ఒంటరితనం, ఏదో కోల్పోయానన్న భావన మిమ్మల్ని వెంటాడవచ్చు. ఆధ్యాత్మిక మార్గం వైపు మళ్లండి. అన్నీ ఉన్నాయన్న సంతృప్తి కలుగుతుంది. పనిలో మీ నిజాయితీయే మీకు శ్రీరామరక్ష. అయితే మౌనంగా విధులను నిర్వహించడమే కాదు, మీ హక్కులను గురించి గుర్తు చేసుకోండి. ఆర్థికభద్రత కలుగుతుంది. సాహసాలు, ప్రయాణాలు చేస్తారు. పాతను వదిలి కొత్తదనాన్ని అలవరచుకుంటారు.
**కలిసొచ్చే రంగు: పగడం రంగు**

**సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)**
ఈవారమంతా మీకు ఆనందోత్సాహాలతో గడిచిపోతుంది. భావసారూప్యత కలిగిన వారితో కలిసి ప్రయాణిస్తారు. పాతబంధాల నుంచి బయటపడతారు. పనిలో లేదా పని ప్రదేశంలో మార్పు ఉండే అవకాశం ఉంది. అహాన్ని వదిలిపెట్టి అందరితో కలసి మెలసి ఉండటం ఆనందాన్నిస్తుందని ఇప్పుడైనా అర్థం చేసుకోండి. ప్రయాణాలు చేస్తారు.
**కలిసొచ్చే రంగు: మబ్బురంగు**

**కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)**
పనులలో కొద్దిపాటి అడ్డంకులు, అవరోధాలు తప్పకపోవచ్చు. కష్టించి పని చేయండి. మేలు జరుగుతుంది. ఈ వారం మీ జీవితం మలుపు తిరిగే మంచి సంఘటనలు జరగవచ్చు. పనిలో కొత్తపంథాను అనుసరించి, సృజనాత్మకంగా పని చేయండి. భారీమొత్తాలలో దీర్ఘకాలిక పెట్టుబడులు అంత అనుకూలమైన ఫలితాలను ఇవ్వకపోవచ్చు. ఆరోగ్యం విషయంలో ఇంకొంచె జాగ్రత్త తీసుకోవడం మంచిది.
**కలిసొచ్చే రంగు: పాచిరంగు**

**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)**
ఈవారం మీరు అన్ని విషయాలలోనూ కొంచెం జాగ్రత్తగా, మెలకువగా ఉండటం అవసరం. ఎన్నో ఒడుదొడుకులు ఎదుర్కొన్న మీరు సమయస్ఫూర్తి వ్యవహరించడం, లౌక్యంగా మాట్లాడటం అవసరమని గ్రహించండి. పనిలో కొత్తశక్తి, ఉత్సాహం తెచ్చిపెట్టుకుంటారు. మానసిక ఒత్తిడిని తొలగించుకుంటేనే శారీరక ఆరోగ్యం మెరుగుపడుతుందని తెలుసుకోండి.
**కలిసొచ్చే రంగు: ఎరుపు**

**వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)**
పగటికలలు కనడం మాని, ప్రాక్టికల్‌గా ఆలోచించడం, నిజాయితీతో పని చేయడం ఎంతో మేలు చేస్తుంది. కొత్త పని లేదా ప్రాజెక్టులో క్షణం తీరికలేకుండా గడుపుతారు. రకరకాల అవకాశాలు మీ తలుపు ఒకేసారి తడతాయి. మీకు నచ్చినది, మీరు చేయగలిగినది ఎంచుకుని కెరీర్‌ను మీరు అనుకున్నట్లుగా తీర్చిదిద్దుకోండి. మీ పుట్టినరోజు తర్వాత నుంచి మీకు మనశ్శాంతి, ఊరట లభిస్తాయి.
**కలిసొచ్చే రంగు: లేత గులాబీ**

**ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)**
ముఖ్యమైన పనులన్నీ పూర్తి చేస్తారు. ప్రేమ వ్యవహారాలు సాఫీగా సాగుతాయి. కళ్యాణ ఘడియలు సమీపించాయి. ఆర్థిక భద్రత, స్థిరత్వం కలుగుతాయి. అయితే అందుకు మరి కొంత సమయం ఉంది. ఆందోళన చెందకండి. పని, ప్రయాణాలు రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉంటాయి. మీరు ఉద్యోగులైతే వ్యాపారావకాశం మీ తలుపు తడుతుంది. వ్యాపారులైతే ఉద్యోగావకాశం వరిస్తుంది.
**కలిసొచ్చే రంగు: పసుపుపచ్చ**

**మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)**
విజయం మీ వెంటే ఉంటుంది. గుర్తింపు, కీర్తిప్రతిష్ఠలు వస్తాయి. అందుకు తగ్గట్టు పని చేయాలి కదా! సానుకూల భావనలు, సానుకూల ఆలోచనలు మీకెంతో మేలు చేస్తాయి. ఏ పని చేసినా, ఆత్మవిశ్వాసంతో చేయండి. మీ ప్రేమ ఫలించేందుకు, మీ విషయం పెద్దల వరకు వెళ్లేందుకు ఒకరి సాయం లభిస్తుంది.
**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

**కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)**
తగిన ప్రణాళిక లేకపోవటం, సిద్ధంగా ఉండకపోవడం వల్ల కొద్దిపాటి ఆందోళన, అనిశ్చితి, గందరగోళం తప్పకపోవచ్చు. ఇవన్నీ మీ స్వయంకృతాపరాధాలే. గతం గురించి పశ్చాత్తాపం చెందడంతో సరిపోదు, దానినుంచి పాఠాలు కూడా నేర్చుకోవాలి. ఆత్మవిశ్వాసం అవసరమే కానీ, అతి వద్దు. ప్రేమవ్యవహారాలలో కొంచెం వేగిరపాటు ఉండచ్చు. మీ సానుకూల భావనలు మీకెంతో మేలు చేస్తాయి.
**కలిసొచ్చే రంగు: వెండిరంగు**

**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)**
మీపాటికి మీరు ప్రశాంతంగా గడుపుతారు. తెలియనివారికి మీరు కొంచెం అహంభావి అనిపించవచ్చుగాక.. అయినా, మీ గురించి తెలిసిన తర్వాత మీరెంత స్నేహశీలి అన్నదీ వారికే అర్థం అవుతుంది. ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా ముందడుగు వేస్తారు. గతంలోని చేదు జ్ఞాపకాలు, బాధలు, భయాల నుంచి నెమ్మదిగా బయటపడతారు. జీవిత భాగస్వామి మనసును అర్థం చేసుకుని వారి కోరికను తీరుస్తారు.
**కలిసొచ్చే రంగు: బూడిదరంగు**

# మిణుగురు రాంబాబు!

''మా ఫ్రెండ్ ఒకడు బాగా కొడుతుంటాడు రా..?'' సెస్పెన్స్ మెయింటెయిన్ చేయడానికి నాందిగా మా రాంబాబుగాడు ఈ స్టైలు వాక్య నిర్మాణం చేస్తుంటాడు. అందుకే వాడి ధోరణి పట్ల నాకు మండింది. వాడికీ కాస్త నా మంట అంటేలా చేద్దామని నా ఉద్దేశం. అందుకే వాడికి ఘాటుగా బదులిస్తున్నట్టు...

''ఏంటి పోజులు కొట్టడమా? స్టైలు కొట్టడమా? మాంసం కొట్టడమా లేక కంప్యూటర్ మీద టైప్ కొట్టడమా?. స్పెసిఫిక్‌గా ఇదీ అని చెప్పాలిరా'' అన్నాను.



''ఎక్కడున్నావురా బాబు నువ్వు... ఇవన్నీ ఎప్పుడో పాతబడిపోయాయి. సిక్స్ కొట్టడం కూడా సచిన్ నాటికే పాతబడిపోయింది. వాడు ఫేస్‌బుక్‌లో 'లైక్'లు కొడుతుంటాడు. అదీ ఇప్పటి ట్రెండ్'' అన్నాడు వాడు నా అంచనాలకు అందకుండా.

''అవున్లే... చాలా మంది తెలుగు భాష మీద అభిమానం ఉన్న వాళ్లు ఫేస్‌బుక్‌ను ముఖ పుస్తకం అంటుంటారు. అవునట. అస్తమానం ఆ పుస్తకంలో గడపటం కూడా ఒక వేలం వెర్రిరా...'' అంటూ ఉండగానే...

''నో... నో... దాన్ని ముఖపుస్తకం అనడమూ తప్పే. దాంట్లో గడపటం వేలం వెర్రీ అనుకోవడమూ తప్పే'' అంటూ నా మాటలకు అడ్డొచ్చాడు రాంబాబుగాడు.

''మరి ఒప్పు ఏమిట్రా''

అడిగా.

''దాన్ని కేవలం ముఖ పుస్తకం అనకూడదు రా. ముఖ గ్రంథం అనాలి. అయినా అది పుస్తకం లెవెల్‌కు చాలా ఎక్కువ. గ్రంథం అనడం కూడా సరైనది కాదనుకో. అదొక ఉద్గ్రంథం. ఒక వాంగ్మయం. ఒక కావ్యం... ఒక ఇతిహా...'' అంటూ వాడు తన్మయంగా అనబోతుంటే...

''ఒరేయ్... మరీ అంతగా పొగడకు. దాంతో టైమ్ వేస్ట్ తప్ప మరే ఉపయోగమూ లేదు'' అంటూ నేను రెట్టించబోతుండగా మళ్లీ నా మాటలకు అడ్డొచ్చాడు.

''చూడు గురూ... ఎదురుగా ఉంటే నేను మాట్లాడబోతుంటే ఎందుకో అందరూ తప్పుకు తిరుగుతుంటారు. కానీ ఫేస్‌బుక్... అదే ముఖ పుస్తకంలో ముఖం చాటేయడానికి అవకాశమే లేదు. పైగా ఫేస్‌బుక్‌లో నా ముఖం చూడకుండా నా గురించి తెలియకుండా ఉన్నవాడెవడైనా నన్నే లైక్ చేస్తారు. ఎందుకంటే విచ్చలవిడిగా, ఎలాంటి అరమరికలు లేకుండా నేను ధారాళంగా లైక్‌లు కొడుతుంటా కాబట్టి...'' అంటూ చెప్పబోతుంటే

''అసలు అలా లైక్‌లు కొట్టడంలో ఏదైనా అర్థం ఉంది. నిజంగా బాగుంటే కొట్టాలిగానీ... కానీ నువ్వు కొట్టే లైక్‌ల ఆధారంగానే నీ గురించి తెలియని వాళ్లు నిన్ను నువ్వు వాళ్ల అభిమానాన్ని అనుమానించాలి'' అన్నాను.

''ఫేస్‌బుక్‌లో ఉన్నవాళ్లకు అవన్నీ ఎందుకు రా. నేను వాళ్లవి లైక్ చేస్తాను. కాబట్టి వాళ్లూ ఇతోధికంగా... బార్టర్ సిస్టమ్‌లో లాగా నన్నూ లైక్ చేస్తుంటారు. ఇంకో విషయం చెప్పనా?''

''చెప్పు''

''అసలు నువ్వు ఎప్పుడైనా నా పుట్టినరోజు గుర్తుపెట్టుకున్నావా? అంతెందుకు నీ సొంతపెళ్లాం పుట్టినరోజైనా గుర్తుండదు కదరా నీకు. కానీ ఫేస్ బుక్ ప్రతిరోజూ ఎవడెవడి పుట్టిన రోజునో జాగ్రత్తగా గుర్తుపెట్టుకొని నాకు గుర్తు చేస్తుంది. దాంతో వాళ్లు నాకు తెలిసిన వాళ్లూ... తెలియని వాళ్లనే తేడా లేకుండా అందరికీ నేను విషెస్ చెబుతా. దాంతో అందరూ నన్నే ఎక్కువ లైక్ చేస్తుంటారు రా. అందుకే నేను నీ కంటే ఎక్కువ అడ్వాన్స్‌డ్ అని ఘంటాపథంగా చెప్పగలను. నేనొక స్వేచ్ఛా సైబర్ లైకరిని రా. పైగా నేను త్రికరణశుద్ధిగా ఫేస్‌బుక్‌ను ఫాలో అవుతుంటాను'' అంటూ ఇంకా గొప్పలు చెప్పుకోబోతుండగా అడ్డుతగిలాను నేను.

''ఒరేయ్... అసలు నీకు త్రికరణశుద్ధి అంటే అర్థం తెలుసా?'' అడిగా.

''ఓ... కానీ నువ్వు అనుకుంటున్న మనస్సు, వాక్కు, కర్మ మాత్రమే కాదు... ఫేస్‌బుక్ త్రికరణాలు వేరే ఉన్నాయి. మనస్సుకు నచ్చినదాన్ని లైక్ కొట్టడం త్రికరణాలలో మొదటిది, మనసుకు హత్తుకున్న దాన్ని గురించి మాట్లాడటం అనగా కామెంట్ చేయడం రెండోది. ఇక మూడోదీ, అతి ఉన్నతమైనదీ, గొప్పదీ అయిన కర్మ... షేర్ చేయడం. అనగా ఈ మూడింటినీ ఆచరించడమే రా ఫేస్‌బుక్ త్రికరణాలూ. ఇవే ఫేస్‌బుక్‌లోని నువ్వు పెట్టిన ఫొటో లేదా పోస్ట్ లేదా కామెంట్ కింది ఉండేవి. చూశావా నీకూ నాకూ తేడా. నువ్వు ఫేస్‌బుక్‌ను యాంత్రికంగా చూస్తావు. కానీ నేను దాన్ని ఒక సత్కర్మలా ఆచరిస్తాను. ఒక వేదాంత ధోరణితో అవలోకిస్తాను. ఇప్పుడు చెప్పు... నేనొక బుక్కర్షినా కాదా'' అడిగాడు.

''బుక్కర్షి ఏమిట్రా''

అయోమయంగా అడిగా.

''ఫేస్‌బుక్‌లోనే ఉంటాను కాబట్టి మహర్షి, రాజర్షి టైప్‌లో మొట్టమొదటిసారిగా ఒక పదాన్ని సృష్టిస్తూ బుక్కర్షి అని నన్ను నేను డిక్లేర్ చేసుకుంటున్నాను'' అన్నాడు.

''బుక్కర్షి కాదు గానీ... పుస్తకపు పురుగువు రా నువ్వు'' అన్నాను నేను వాడిని పురుగులాగే చూస్తూ.

''ఒకే నువ్వనుకున్నదే ఖాయం. కానీ ఫేస్‌బుక్‌జ్ఞానంతో వెలిగిపోయే స్వయంప్రకాశం ఉన్న 'మిణుగురు'పురుగునే రా నేనూ'' అంటూ మళ్లీ కంప్యూటర్‌లోని ఫేస్‌బుక్‌లో ఫేస్ దాచుకున్నాడు వాడు.

**- యాసీన్**

**• కిసుక్కు**

పేషెంట్: డాక్టర్‌గారూ..నన్ను ఎప్పుడు డిశ్చార్జ్ చేస్తారు?

డాక్టర్: ఈ బెడ్‌పైకి కొత్త పేషెంట్ వచ్చిన వెంటనే...

– అస్లాం షరీఫ్, శాంతినగర్

**• మీకు తెలుసా?**

ఫాగ్‌బో అంటే?

ఇది రెయిన్‌బోలాంటిదే. అయితే ఈ ఫాగ్‌బోకు రంగులు ఉండవు. దీన్ని 'వైట్ రెయిన్‌బో' అని కూడా పిలుస్తారు.

**• పట్టుకోండి చూద్దాం**

# Crime Solve

**భూ**పతిరాజాకు ఇద్దరు కొడుకులు. ఇంటర్మీడియెట్ చేస్తున్నారు. పిల్లలు చదువులోనే కాదు ఆటపాటల్లోనూ ముందుండాలనేది ఆయన కోరిక. అందుకే పిల్లలకు శాస్త్రీయ సంగీతం నేర్పిస్తున్నాడు. ఒకసారి టీవిలో బ్రూస్లీది ఏదో సినిమా చూస్తున్నప్పుడు కరాటే మీద మనసు పడ్డాడు.

తన పిల్లలకు కూడా కరాటే నేర్పించాలని ముచ్చటపడ్డాడు భూపతిరాజా. అయితే ఆ ఊళ్లో కరాటే అంటే ఆసక్తి ఉన్న వాళ్లుగానీ నేర్పించేవాళ్లుగానీ ఎవరూ లేరు. ఈ విషయం గురించి ఆలోచిస్తున్నప్పుడు భూపతిరాజాకు రమణ గుర్తుకు వచ్చాడు. తన పెద్దన్నయ్య ఫ్రెండ్ కామేశ్వర్రావు కొడుకు రమణ. కరాటేలో మంచి ప్రావీణ్యం ఉంది. బ్లాక్‌బెల్ట్ కూడా.

ఆమధ్య కామేశ్వర్రావు కలిసి...

''మావాడికి ఏదైనా పని ఉంటే చూడవయ్యా...'' అని అడిగాడు.

అయితే అప్పుడే ఆ విషయం మరిచిపోయాడు భూపతిరాజా.

ఇప్పుడది గుర్తుకు వచ్చింది. వెంటనే రమణను పిలిపించాడు.

''మా ఇంట్లోనే ఉంటూ పిల్లలకు కరాటే నేర్పించు. దీంతో పాటు కొన్ని బిజినెస్ పనులు కూడా అప్పగిస్తాను'' అని చెప్పాడు భూపతిరాజా. ఇక ఆరోజు నుంచి పిల్లలకు కరాటేలో శిక్షణ ఇవ్వడం ప్రారంభించాడు రమణ.

అప్పుడప్పుడూ రమణను చిన్న చిన్న డబ్బు మొత్తాలను వసూలు చేయడానికి ఊళ్లకు పంపించేవాడు భూపతి. ఒకరోజు మాత్రం ఒకచోటు నుంచి అయిదు లక్షలు వసూలు చేసుకురావల్సిందిగా రమణను  పొరుగూరికి పంపాడు.

వేసవి సెలవులు కావడంతో భూపతి భార్య ఇద్దరు పిల్లలను తీసుకొని పుట్టింటికి వెళ్లింది.

భూపతికి రావల్సిన అయిదు లక్షలు తీసుకొని వచ్చాడు రమణ. అప్పుడు రాత్రి తొమ్మిది దాటింది. భూపతి చేతిలో అయిదు లక్షలు పెట్టాడు రమణ. ఆ తరువాత దగ్గరిలోని గదిలోకి వెళ్లి ఫ్రిజ్‌లో నుంచి బాటిల్ తీసి గడగడమని తాగి బయటికి వచ్చాడు.

''అదేమిటి అంకుల్. డబ్బు అలా టేబుల్ మీద పెట్టారు. ఎక్కడైనా పెట్టండి'' అన్నాడు రమణ.

''ఈ డబ్బు ఆ బీరువాలో పెట్టి తాళంచెవులు నా దిండు కింద పెట్టు'' అని పడుకోవడానికి సిద్ధమయ్యాడు భూపతిరాజా. రమణ అలాగే చేశాడు. భూపతి నిద్ర పోయాడంటే... చుట్టు పక్కల వంద ఏనుగులు ఘీంకరించినా లేవడు. అందుకే అతని నిద్రకు 'శవనిద్ర' అని పేరు!

•••

పొద్దున పాలవాడు వచ్చి ఎంత గట్టిగా తలుపులు బాదినా అవతలి నుంచి స్పందన లేదు. దీంతో ఇరుగు పొరుగు వాళ్లు వచ్చి తలుపులు పగల కొట్టారు. అందరూ కలిసి లోనికి వెళ్లారు. లోపల... రమణ కాళ్లు చేతులు కట్టివేయబడి ఉన్నాడు. మూతికి రుమాలు కట్టి ఉంది. లోపల ఇంకా దారుణం... భూపతిరాజా నోరు పెద్దగా తెరుచుకొని ఉంది. గుండెల్లో నుంచి రక్తం బయటికి వచ్చి మడుగైపోయింది.

''భూపతిని ఎవరు చంపారు?'' రమణ కట్లు విప్పుతూ అడిగారు అక్కడి ఉన్నవాళ్లు.

''రాత్రి పదకొండున్నరకు తలుపు చప్పుడైంది. అంకుల్‌ని డిస్టర్బ్ చేయడం ఎందుకని నేనే వెళ్లి తీశాను. ఇలా తీశానో లేదో అలా నా మీద పడ్డారు నలుగురు. నా కాళ్లుచేతులు కట్టేసి నోటికి అడ్డంగా రుమాలు కట్టారు. ఆ తరువాత లోపల పెద్దగా అరుపు వినిపించింది. లోపలి నుంచి తలుపులేసి ఆ కిటికీ నుంచి బయటికి పారిపోయారు'' అని చెప్పుకుంటూ పోతున్నాడు రమణ.

•••

ఇన్‌స్పెక్టర్ నరసింహ, రమణ గురించి ఆరా తీశాడు. రమణకు కరాటేతో పాటు మిమిక్రీ, మ్యాజిక్...ఇలా ఎన్నో విద్యలు వచ్చు అనే విషయం ఇన్‌స్పెక్టర్‌కు తెలిసింది. 'మ్యాజిక్' అనే మాట వినిపించినప్పుడు ఒక సంఘటన అతనికి వెంటనే గుర్తుకు వచ్చింది. ఒక స్కూలు వార్షికోత్సవానికి ముఖ్య అతిథిగా హాజరయ్యాడు ఇన్‌స్పెక్టర్. ఆరోజు జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో  మెజీషియన్ ఒక బిట్ ప్రదర్శించాడు. ''ఇప్పుడు నన్ను నేను తాళ్లతో బంధించుకుంటాను. ఆ తరువాత...హెల్ప్ హెల్ప్ అని అరుస్తాను. మీరు వచ్చి నా కట్లు విప్పితే రుణపడి ఉంటాను'' అన్నాడు. కానీ అతడి కట్లను ఏ ఒక్కరూ విప్పలేకపోయారు.

అప్పుడు ఆ మెజీషియన్... 'అబ్రకదబ్ర' అన్నాడో లేదో ఒంటి మీద ఉన్న కట్లన్నీ ఎవరో విప్పేసినట్లు మాయమైపోయాయి. ఈ సంఘటన గుర్తుకు రాగానే...ఇన్‌స్పెక్టర్‌కు రమణ మీద అనుమానం మొదలైంది.

అతడి అనుమానం నిజమైంది. తానే హంతకుడినని విచారణలో ఒప్పుకున్నాడు రమణ. అయిదు లక్షలు కాజేయడానికే భూపతిని హత్య చేసినట్లు చెప్పాడు.

''అది సరే... నువ్వు హత్యకు ఉపయోగించిన కత్తి ఏది? ఎక్కడ దాచావు?'' అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''కత్తి ఉపయోగించలేదు'' అన్నాడు రమణ.

''మరి ఏం ఉపయోగించావు?'' ఆశ్చర్యంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''నీళ్లు'' అని ఫ్రిజ్ వైపు చూపించాడు రమణ.

ఇంతకీ... రమణ భూపతిరాజాను ఎలా చంపాడు?

అద్దంలో ఆన్సర్

కుడివైపు నుంచి అద్దం పెట్టుకుని చదవండి

# TRANSPORT

## ఇంగ్లిష్ నేర్చుకుందాం

ఈ 'ట్రాన్స్‌పోర్ట్'లో హెలికాప్టర్ మొదలు సైకిల్ వరకు ఎన్నో వాహనాలు ఉన్నాయి. అంకెల దగ్గర ఉన్న వాహనాల పేర్లను అడ్డం, నిలువు గడులలో ఇంగ్లిష్‌లో రాయండి.

## కనిపెట్టండి

ఇక్కడ అయిదు వరుసల్లో నాలుగు బొమ్మలు ఉన్నాయి. అయితే ప్రతి వరుసలోనూ... ఒకేలా ఉన్న రెండు బొమ్మలు ఉన్నాయి. అవేమిటో కనిపెట్టండి.



## బొమ్మల సుడోకు

అడ్డం, నిలువు వరుసల్లో ఒకసారి వచ్చిన బొమ్మ మరోసారి రాకుండా పూరించండి.



## ఆ తరువాత?

ఇక్కడ ఇచ్చిన అయిదు వరుసల్లో రకరకాల బొమ్మలు ఉన్నాయి కదా. అయితే... బొమ్మల వరుస క్రమాన్ని గమనించి క్వశ్చన్‌మార్క్ దగ్గర ఏ బొమ్మ రావాలో రాయండి.





### జవాబులు

**ఇంగ్లిష్ నేర్చుకుందాం:** అడ్డం: 1.SHIP 4.BUS 6. BALLOON 7.EXCAVATOR 8.HELICOPTER 9.CRANE 11.ROCKET నిలువు: 1.SUBMARINE 2.WAGON 3.TAXI 5.AIRPLANE 6.BICYCLE 10.TRUCK

**కనిపెట్టండి:** 2-3, 6-8, 9-11, 14-16, 19-20

**బొమ్మల సుడోకు**

**ఆ తరువాత:** A-9, B-1, C-5, D-4, E-11



# బొమ్మాండం

స్నూపీ
పెద్దరికం.
పింక్ పాంథర్
కొంటెతనం.
బార్ట్ సిమ్సన్ రాజసం.
మిక్కీ మౌస్ గౌరవవందనం.
పికాచు దరహాసం. స్పైడర్‌మెన్ సాహసం.
కెర్మిట్ ది ఫ్రాగ్  అభయహస్తం.

థ్యాంక్స్ గివింగ్ డే పరేడ్ కావచ్చు... మరేదైనా సందర్భం కావచ్చు. వీధుల్లోకి బొమ్మలు నడిచొస్తే ఆ సంబరమే వేరు. కొత్త క్యారెక్టర్లు పుట్టుకొస్తున్నకొద్దీ పెరేడ్‌కు కొత్తకళ పెరుగుతుంది. పుస్తక పుటల్లో ఇష్టంగా చదివిన క్యారెక్టర్లు. వెండితెర మీద చల్లగా మురిపించిన క్యారెక్టర్లు....

ఇండియా కావచ్చు
ఇంగ్లాండ్ కావచ్చు.
దేశమేదైనా...
ప్రదేశమేదైనా...
మనం ఇష్టపడే బొమ్మలు
వీధుల్లోకి నడిచొస్తే
ఆ  సంబరమే వేరప్పా!

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

**mohan** PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్‌కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్



పంచాంగకర్త:

శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర పుష్యమాస శుక్ల తదియ ఆదివారం నుంచి మాఘమాస శుక్ల చవితి మంగళవారం వరకు

# 2017 JANUARY జనవరి

జనవరి 27 శుక్రవారం మౌని అమావాస్య సూర్యోదయం నాటికి ధనూరాశిలో శనిగ్రహం అతిచార సంచారంతో రానున్నది. దీని ప్రభావం ద్వాదశరాశులపై ఉంటుంది. వివరాల కోసం ఈ నెల పండుగల దిగువన చూడండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము:సా4.14-4.58<br>రా.కా: సా4.30-6.00 | 1<br>పుష్య శు.తదియ మ3.33<br>శ్రవణం సా4.01<br>వ.రా8.10-9.49 | 8<br>శు.దశమి ఉ7.52<br>శు.ఏకాదశి తె5.03<br>భరణి మ12.27<br>వ.రా11.22-12.49 | 15<br>బ.తదియ మ11.39<br>మఘ రా10.44<br>వ.ఉ10.49-12.25 | 22<br>బ.దశమి రా9.59<br>విశాఖ మ11.03<br>వ.మ3.32-5.20 | 29<br>శు.విదియ తె5.25<br>ధనిష్ఠ రా11.03<br>వ.తె6.16లగాయితు |
| MON సోమ<br>దుర్ము:మ12.33-1.17<br>మ2.46-3.30<br>రా.కా:ఉ7.30-9.00 | 2<br>శు.చవితి మ3.50<br>ధనిష్ఠ సా4.52<br>వ.రా12.11-1.49 | 9<br>శు.ద్వాదశి రా2.00<br>కృత్తిక ఉ10.17<br>వ.రా12.43-2.09 | 16<br>బ.చవితి మ11.15<br>పుబ్బ రా11.18<br>వ.ఉ6.55-8.33 | 23<br>బ.ఏకాదశి రా12.21<br>అనూరాధ మ1.57<br>వ.రా8.09-9.56 | 30<br>శు.తదియ తె4.43<br>శతభిషం రా11.05<br>శేషవర్జ్యఉ7.52వరకు<br>వ.తె5.23లగాయితు |
| TUE మంగళ<br>దుర్ము:ఉ8.53-9.37<br>రా10.54-11.46<br>రా.కా: మ3.00-4.30 | 3<br>శు.పంచమి మ3.42<br>శతభిషం సా5.17<br>వ.రా11.41-1.16 | 10<br>శు.త్రయోదశి రా10.54<br>రోహిణి ఉ7.56<br>మృగశిర తె5.33<br>వ.మ12.58-2.25 | 17<br>బ.పంచమి మ11.39<br>ఉత్తర రా12.38<br>వ.ఉ6.54-8.35 | 24<br>బ.ద్వాదశి రా2.22<br>జ్యేష్ఠ సా4.33<br>వ.రా1.18-3.03 | 31<br>శు.చవితి రా3.41<br>పూర్వాభాద్ర రా10.45<br>శేషవర్జ్య ఉ6.58వరకు |
| WED బుధ<br>దుర్ము:మ11.50-12.34<br>రా.కా:<br>మ12.00-1.30 | 4<br>శు.షష్ఠి మ3.06<br>పూర్వాభాద్ర సా5.15<br>వ.రా2.39-4.13 | 11<br>శు.చతుర్దశి రా7.51<br>ఆర్ద్ర రా3.17<br>వ.మ1.09-2.36 | 18<br>బ.షష్ఠి మ12.48<br>హస్త రా2.38<br>వ.ఉ9.44-11.28 | 25<br>బ.త్రయోదశి రా3.56<br>మూల సా6.47<br>వ.సా5.02-6.47<br>వ.తె5.05-6.48 | |
| THU గురు<br>దుర్ము:ఉ10.22-11.06<br>మ2.47-3.32<br>రా.కా:మ1.30-3.00 | 5<br>శు.సప్తమి మ2.00<br>ఉత్తరాభాద్ర సా4.45<br>వ.తె4.15-5.47 | ○ 12<br>పూర్ణిమ సా5.03<br>పునర్వసు రా1.20<br>వ.మ2.19-3.47 | 19<br>బ.సప్తమి మ2.37<br>చిత్ర తె5.11<br>వ.మ11.28-1.15 | 26<br>బ.చతుర్దశి తె5.01<br>పూర్వాషాఢ రా8.32<br>వ.తె4.58-6.39 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.54-9.38<br>మ12.35-1.19<br>రా.కా:ఉ10.30-12.00 | 6<br>శు.అష్టమి మ12.25<br>రేవతి మ3.45<br>వర్జ్యం లేదు | 13<br>బ.పాడ్యమి మ2.40<br>పుష్యమి రా11.50<br>వ.ఉ8.50-10.20 | 20<br>బ.అష్టమి సా4.54<br>స్వాతి పూర్తిగా<br>వ.మ11.27-1.15 | ● 27<br>పుష్యఅమావాస్య తె5.36<br>ఉత్తరాషాఢ రా9.50<br>వ.రా1.58-3.37 | |
| SAT శని<br>దుర్ము:ఉ6.41-8.10<br>రా.కా:ఉ9.00-10.30 | 7<br>శు.నవమి ఉ10.21<br>అశ్విని మ2.18<br>వ.ఉ10.33-12.03<br>వ.రా11.10-12.38 | 14<br>బ.విదియ మ12.49<br>ఆశ్లేష రా10.55<br>వ.మ12.09-1.41 | 21<br>బ.నవమి రా7.26<br>స్వాతి ఉ8.04<br>వ.మ2.22-4.10 | 28<br>మాఘశు.పాడ్యమి తె5.43<br>శ్రవణం రా10.39<br>వ.రా2.43-4.21 | |

### పండుగలు

1. ఆంగ్లసంవత్సరాది
8. పుత్రదా(ముక్కోటి) ఏకాదశి రైవతమన్వాది
13. భోగిపండుగ
15. మకరసంక్రాంతి, ఉత్తరాయణప్రారంభం
16. కనుమ, పక్షిపూజ సంకష్టహరచతుర్థి
23. షట్‌తిలైకాదశి
26. రిపబ్లిక్‌డే మాసశివరాత్రి
27. మౌనిఅమావాస్య
29. మాఘచంద్రోదయం
30. జమాదీలవ్వల్ నెలారంభం
31. తిలచతుర్థి

మౌని అమావాస్య నాడు ధనూరాశిలో శని అతిచార ప్రవేశం వలన మానవాళి మనసులపైదాని ప్రభావం అధికంగా ఉంటుంది. అందుచేత ఏయే సమయాలలోమౌనం పాటిస్తూ, ఎలాఉండాలనే వివరాలకై..

www.gargeyam.com

### జనవరి శుభసమయములు

శ్రీ దుర్ముఖి పుష్యమాసము

01 ఆది శు.తదియ శ్రవణంఉ7.41-9.32
02 సోమ శు.చవితి ధనిష్ఠ ఉ7.37-9.28
02 సోమ శు.పంచమి శతభిషంసా4.53-6.40
04 బుధ శు.సప్తమిఉత్తరాభాద్ర సా5.16-6.32
05 గురు శు.సప్తమి ఉత్తరాభాద్ర ఉ7.25-9.16
05 గురు శు.సప్తమిఉత్తరాభాద్ర మ11.07-2.15
06 శుక్ర శు.అష్టమి రేవతి ఉ10.52-12.34
06 శుక్ర శు.నవమి అశ్విని సా4.13-6.24
07 శని శు.నవమి అశ్విని ఉ7.17-9.08
07 శని శు.దశమి అశ్విని మ12.04-2.07
09 సోమ శు.ద్వాదశి రోహిణి ఉ10.40-12.35
12 గురు పూర్ణిమ పునర్వసు ఉ6.57-8.48
12 గురు పూర్ణిమ పునర్వసుమ11.10-1.47
13 శుక్ర బ.పాడ్యమి పుష్యమిఉ6.53-8.44
13 శుక్ర బ.పాడ్యమి పుష్యమి ఉ10.24-12.37
13 శుక్ర బ.విదియ పుష్యమి మ3.45-5.56
15 ఆది బ.తదియ మఘ ఉ10.16-10.48
18 బుధ బ.షష్ఠి హస్త మ12.41-1.23
19 గురు బ.సప్తమి చిత్ర ఉ9.59-10.25
20 శుక్ర బ.నవమి స్వాతి రా9.46-11.51
22 ఆది బ.దశమి అనూరాధ సా5.21-7.32

శ్రీ దుర్ముఖి మాఘమాసము

29 ఆది శు.విదియ ధనిష్ఠ ఉ10.55-2.41
29 ఆది శు.విదియ ధనిష్ఠ రా9.12-11.16
30 సోమ శు.తదియ శతభిషంఉ10.51-12.42
30 సోమ శు.తదియ శతభిషం రా9.08-11.12

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## మౌని అమావాస్య సూర్యోదయాన ధనూరాశిలో శనిగ్రహం - ఆచరించాల్సిన ప్రత్యేక పరిహారం

2017 జనవరి 27 శుక్రవారం పుష్య అమావాస్య. దీనినే మౌనిఅమావాస్య అని కూడా పిలుస్తారు. సూర్యుడు, చంద్రుడు ఒకే బిందువులో కలిసినచో ఏర్పడే తిథినే అమావాస్య అంటారు. ప్రతి సంవత్సరం ఉత్తరాయణం ప్రారంభమైన తదుపరి ఈ మౌని అమావాస్య వస్తుంది. అంటే ఉత్తరాషాఢ నక్షత్ర 2వపాదమైన మకరరాశి లోనికి సూర్యుడు ప్రవేశించటాన్ని ఉత్తరాయణ పుణ్యకాలం అంటారు. అదే మకరరాశిలోకి తదుపరి చంద్రుడు వచ్చి సూర్యునితో కలిస్తే వచ్చే తిథి మౌని అమావాస్య.

మనసుకు కారకుడు చంద్రుడు. శనిగ్రహానికి అంతర్గత శత్రువు కూడా చంద్రుడే. మకర రాశికి అధిపతి శనిగ్రహం. జ్యోతిషపరంగా రవి మరియు శనిగ్రహాలు పరస్పర శత్రువులు. ముఖ్యంగా మౌని అమావాస్య పర్వదినాన పుణ్యనదులలోను, సముద్రాలలోను స్నానమాచరించటమే కాక పితరులకు తర్పణ, పిండప్రదానాదులు కూడా ఆచరిస్తుంటారు. కానీ అసలైన అంతర్గత రహస్యం మరొకటి ఉంది. కేవలం స్నానాలు ఆచరించి పిండప్రదానాలు మాత్రమే చేస్తుంటారు తప్ప, రహస్యం తెలుసుకోవటానికి ఎవరూ ప్రయత్నించరు.

ఈ రహస్యం తెలుసుకుని తగిన రీతిలో మౌని అమావాస్య పర్వదినాన ప్రతివారు విధి విధానాలతో ఆచరిస్తుంటే... ప్రతి సంవత్సరం వారి వారి జీవనస్థితిగతులలో కొన్ని అనుకూల మార్పులు వస్తాయని పురాతన గ్రంథాలు తెలియజేస్తున్నాయి. ప్రతి సంవత్సరం వచ్చే మౌని అమావాస్యకు ఈసారి వచ్చే మౌని అమావాస్యకు చాలా వ్యత్యాసం ఉంది. ప్రస్తుతం శనిగ్రహం వృశ్చికరాశిలో సంచారం సాగిస్తూ, ఏదో ఒకరోజున ధనస్సు రాశిలోకి ప్రవేశిస్తాడు. ఈ ప్రవేశం అనేది అతిచారంతో ఉండవచ్చు, సహజగమనంతో ఉండచ్చు.

చారమంటే నడక, గమనమన్నా నడకే. సహజధోరణిలో మనం అతిగా మాట్లాడవద్దు అని సంబోధిస్తుంటాం. అంటే మాట్లాడవలసిన స్థాయికన్నా అధికంగా మాట్లాడటాన్ని అతి అంటారు. మరొక అర్థంలో ఎక్కువ అని కూడా అర్థము. అతిగా తినటము... అతిగా మాట్లాడము, అతిగా నిద్రపోవటము.. ఈ విధంగా సాధారణ స్థితి కంటే ఎక్కువ చేసే దానిని అతి అంటారు. ఈ విధమైన అతి వలన సమస్యలు కూడా అధికంగా ఉంటాయనే విషయాన్ని సర్వులు గమనించాలి. ఈ అమావాస్యకు శని అతిచార గమనము తోడవుతుంది. (మిగిలినది వెనుక పేజీలో)



# మేషరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:1, అవమానం: 7

శ్రీ హేమలంబ : ఆదాయం:8, వ్యయం:14, రాజ్యపూజ్యం:4, అవమానం: 3

**జనవరి:** వస్త్ర భూషణ లాభాదులుండును. వైద్యపరంగా ధనవ్యయమున్నది. కీలక బాధ్యతలను జాగ్రత్తగా నిర్వహిస్తారు. దీర్ఘకాల సమస్యలపై దృష్టి సారిస్తారు. సంతాన విషయంలో అధికశ్రద్ధ తీసుకుంటారు. వాహనకొనుగోలు వాయిదా. మాసం మధ్య నుంచి నిత్య దినచర్యలో తరచూ మార్పులు. సహచరులతో విభేదాలు ఉండవు. మాసాంతంలో శరీర శ్రమ అధికం. సామర్థ్యం గుర్తించి విజయాన్ని పొందుతారు. 3వ వారంలో సంయమనం అవసరం. జనవరి 21 తె4.18 నుంచి 24 సాయంత్రం 4.33 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**ఫిబ్రవరి :** హామీలు, పూచీలతో ఋణయత్నాలు సఫలం. ప్రతిభకు తగిన గుర్తింపు లభించును. అకాలభోజనాలచే అనారోగ్యం. ధర్మకార్యాలపై ఆసక్తి చూపిస్తారు. భార్యాభర్తల మధ్య ప్రతిబంధక సమస్యలుండును. 2వ వారంలో శరీరానికి వైద్యసేవలవసరం. ముఖ్యకార్యాలను వాయిదా వేస్తారు. స్నేహిత బాధ్యతను స్వీకరించలేరు. కపటస్వభావుల ఆంతర్యం తెలియును. దీర్ఘాలోచనలతో ఓ సమస్య పరిష్కారం. ఫిబ్రవరి 18 మధ్యాహ్నం 12.27 నుంచి 20 రాత్రి 12.53 వరకు ప్రతికూలం.

**మార్చి :** పితృవిషయాలపై దృష్టి సారిస్తారు. ధైర్య సాహసాలతో ఆర్థికాభివృద్ధి. రెండవపక్షంలో ఇష్టకార్యసిద్ధి. భార్య, మిత్రాదుల నుంచి శుభకర వార్తలు. కళారంగవాసులకు మాసాంతంలో వెసులుబాటు. ఆరోపణలు, విమర్శలు పట్టించుకోరు. చేదు అనుభవాలుండవు. శతృభయం తగ్గును. కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. 3వ వారంలో రాజీధోరణికి ప్రాధాన్యత ఇవ్వాలి. అనవసర హామీలు పెరుగును. మంగళకార్యములకు సిద్ధం కావాలి. మార్చి 17 రాత్రి 8.38 నుంచి 20 ఉదయం 9.10 వరకు ప్రతికూలం.

**ఏప్రిల్ :** సంతాన సౌఖ్యములు పెరుగును. వాగ్ధోరణిలో మార్పు లేర్పడును. హడావుడి నిర్ణయాలతో ధననష్టం. స్వయంవృత్తులవారికి ఆశాజనకం. ఆరోగ్య విషయంలో తాత్సారం వద్దు. స్పెక్యులేషన్‌చే నష్టం. బంధుప్రీతి మెండు. 2వ పక్షంలో స్థిరనిర్ణయాలు. ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా పడును. నరాల, భుజాల తీపు అధికము. మాసం చివరలో విజయపంథాలో లాభార్జన. సాహసప్రయత్నాలు ఫలించును. ఏప్రిల్ 13 రా.తె 4.06 నుంచి 16 సాయంత్రం 4.39 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** జాయింట్ వ్యాపారాలలో నమ్మకద్రోహ సూచన కలదు. స్థిరనిర్ణయాలు వాయిదా. బంధుప్రేరణకు ప్రాధాన్యత ఇవ్వరు. ఆర్థికమాంద్యం తగ్గును. విమర్శలు, నిందలు అధికమగును. పుకార్లు నమ్మి ధనవ్యయం. అన్యసహాయం కోసం కాలయాపన. న్యాయస్థాన లావాదేవీలు ఉపశమనం. స్థానచలనంలో లబ్ధి. భయాందోళనలు తగ్గును. ఎదుటివారిపై ఆగ్రహం వద్దు. మే 11 ఉదయం 10.38 నుంచి 13 రాత్రి 11.11 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**జూన్ :** గృహవాతావరణం ఆశాజనకం. వృత్తి వ్యాపారాదులలో లోపాలు సరిచేసుకుంటారు. శరీరతేజస్సు తగ్గును. అవివాహితులకు అనుకూలం. మాసం మధ్యలో చిక్కుముడి నుంచి విముక్తి. మాసాంతంలో కోపం అధికం. నిద్రాసౌఖ్యం ఉండదు. అనవసరఖర్చులు తగ్గిస్తారు. దూరప్రయాణాలు లాభిస్తాయి. జీవనస్థితిపై మెరుగైన ఆలోచనలు. జూన్ 7 సాయంత్రం 4.36 నుంచి 9 రా.తె5.12 వరకు ప్రతికూలసమయం.

**జూలై :** స్వవృత్తుల వారికి ఊరట లభించును. నరముల, భుజముల తీపు పెరుగును. హామీ సంతకాలు పెట్టవద్దు. కీలకనిర్ణయాలలో ముఖ్యవ్యక్తిగా ఉండకండి. రహస్య సమాచారాన్ని బహిర్గతం చేయాలనే సంకల్పం విడనాడాలి. శత్రుసమస్యలను పరిశీలిస్తారు. కుటుంబ మనస్పర్ధలు స్వల్పంగా పెరుగును. సంజాయిషీ, క్షమాపణలు సిద్ధంగా ఉంటాయి. ఋణదాతలపై ఆగ్రహం వద్దు. స్థిర నిర్ణయాలు వాయిదా పడును. జూలై 4 రాత్రి 10.44 నుంచి 7 మధ్యాహ్నం 11.21 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**ఆగస్టు :** జాయింట్ వ్యాపారాలలో లోపాలు తగ్గును. సాహసప్రయత్నాలు ఫలిస్తాయి. శరీరఆరోగ్యంపై శ్రద్ధ ఉంచాలి. ఋణదాతల వత్తిడి అధికం. అసత్య ఆరోపణలు తగ్గించండి. న్యాయపోరాటం చేయాలని తలచవద్దు. ఊహాగానాలతో పయనిస్తారు. మాసాంతంలో శరీర శ్రమ అధికం. శుభకార్య నిర్వహణకు మార్గం కుదురును. అధికారుల బెడద అధికం. ఆగస్టు 1 ఉదయం 5.40 నుంచి 3 సాయంత్రం 6.13 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 1.33 నుంచి 30 రాత్రి 1.54 వరకు సమయాలు అనుకూలం కాదని గమనించాలి.

**సెప్టెంబరు :** గౌరవమర్యాదలు కాపాడుకుందురు. శరీర తేజస్సు పెరుగును. శుభ కార్య నిర్వహణకు మార్గం సిద్ధం. ఆత్మవిశ్వాసం సన్నగిల్లును. ఋణబాధలు తగ్గును. న్యాయ అంశాలతో మనశ్శాంతి. స్నేహసంబంధాలు పెరుగును. ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు పెడుదురు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. వివాదాలలో తలదూర్చవద్దు. సెప్టెంబరు 24 రాత్రి 9.53 నుంచి 27 ఉదయం 9.58 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**అక్టోబరు :** అవివాహితులకు స్వల్ప ఊరట. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి. అంతర్గత కలహాలను తగ్గించండి. బంధుప్రీతిలో లోపం గ్రహిస్తారు. అనారోగ్య బాధలు పెరుగును. వాగ్దాన భంగములుండవు. మనోవ్యాకులత్వం తగ్గును. స్థానచలన అవకాశములుండవు. వ్యక్తిగత విమర్శలు తగ్గిస్తారు. స్పెక్యులేషన్ వద్దు. అక్టోబరు 22 ఉదయం 5.51 నుంచి 24 సాయంత్రం 5.45 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**నవంబరు :** బంధుప్రీతిని స్వాగతిస్తారు. అకాలభోజనాలుండవు. దీర్ఘాలోచన చేసి చేదు అనుభవాలను పట్టించుకోరు. ప్రయత్న పూర్వక కార్యసిద్ధులు. తోబుట్టువుల మధ్య అంగీకారం కుదురును. ఆత్మవిశ్వాసంతో ముందుకు వెళుదురు. అన్యులద్వారా సహాయం అందును. నవంబరు 18 మధ్యాహ్నం 12.51 నుంచి 20 రాత్రి 12.48 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు :** కార్యదీక్షా బాధ్యతను తీసుకుంటారు. గృహవాతావరణం ఆశాజనకం. విచార సంఘటనలను పదేపదే తలచవద్దు. సమయస్ఫూర్తిని పాటించండి. మనోవాంఛలు నెరవేరును. వాదనాపటిమ పెరుగును. శతృసమస్యలను ఛేదిస్తారు. స్పెక్యులేషన్‌లో స్వల్పంగా లబ్ధి. అంతర్గత కలహాలు ఉండవు. ఋణభారం స్వల్పంగా పెరుగుదల. డిశంబరు 15 సాయంత్రం 6.54 నుంచి 18 ఉదయం 7.07 వరకు ప్రతికూల సమయం.

## మౌని అమావాస్య సూర్యోదయాన ధనూరాశిలో శనిగ్రహం - ఆచరించాల్సిన ప్రత్యేక పరిహారం

ప్రస్తుతం వృశ్చికరాశిలో సంచారం చేస్తున్న శనిగ్రహం సహజ గమనంతో ధనస్సు రాశిలోనికి 2017 అక్టోబరు 26న ప్రవేశించవలసి ఉన్నది. కానీ ఈలోపలే అతి గమనంతో హడావుడిగా 2017 జనవరి 26 రాత్రి 7గంటల 31నిముషానికి ధనస్సురాశి లోనికి ప్రవేశిస్తాడు. ఇలా ప్రవేశించిన శని తిరిగి వృశ్చికరాశిలోనికి జూన్ 21వతేదికి చేరు కుంటాడు. వృశ్చికరాశిలో కొంతకాలం పాటు ఉండి సహజగమనంతో అక్టోబరు 26న ధనస్సురాశిలోకి తిరిగి ప్రవేశిస్తాడు.

అయితే 2017 అక్టోబరు 26 అతిచార ప్రవేశం తదుపరి కొద్ది గంటలకే మౌని అమావాస్య ప్రారంభం. ధనూరాశి ప్రవేశం ప్రతి 30 సంవత్సరాలకు ఒకసారి జరుగుతుంది. అయితే ధనస్సురాశిలో శని ఉన్న రెండున్నర సంవత్సరాల కాలంలో 2 లేక 3సార్లు మౌని అమావాస్య వస్తుంటుంది. కానీ అతిచార గమనంతో ధనూరాశిలో ప్రవేశ సమయంలో వచ్చే మౌని అమావాస్య మాత్రం అత్యంత అరుదైనది.

మౌని అమావాస్య పర్వదినాన స్నానాలు, తర్పణాలు, పిండప్రదానాదులు ఆచరించటం ఆనవాయితీ. ఇక అసలైన రహస్య విషయానికి వస్తే...పురాణగాధలు అనేకం ఉన్నప్పటికీ మౌని అమావాస్య రోజున జ్యోతిషపరంగా ముఖ్యంగా మౌనం వహించటం ప్రధానమైన అంశం. మౌనం ఎందుకు వహించాలి అనే విషయం తెలుసుకోవాలి. మనసునకు కారకుడు చంద్రుడు. అమావాస్య రోజున చంద్రుడు రవితో కలిసి ఉన్నందున, ప్రకాశాన్ని కోల్పోయి ఉంటాడు. అంతేకాక రవి, చంద్రుల కలయిక శని క్షేత్రంలో జరుగుతుంది.

జ్యోతిషపరంగా శని ఆయుష్కారకుడు. ఆయుష్షు అంటే.. కేవలం ఒకవ్యక్తి ప్రాణంతో అధికకాలం జీవించటాన్ని మాత్రమే ఆయుష్షు అనటం కాదు. ఈ ఒక్క జీవించే అంశమే కాకుండా బంధుత్వాలకి, బాంధవ్యాలకి, మిత్రత్వాలకి, వస్తువులకి, వ్యవహారాలకి, వ్యాపకాలకి కూడా ఆయుష్షు అనే మాట వర్తిస్తుంది.

ఎలాగంటే ఒక వ్యక్తి మరొక వ్యక్తితో స్నేహితంగా ఉంటున్నాడు. వీరిద్దరి మధ్య ఉన్న స్నేహబంధం ఒకే ఒకమాటతోనే చెదిరిపోయింది. జీవితంలో తిరిగి వీరివురు కలిసి మాట్లాడుకోవటం జరగలేదు. వారిద్దరి బంధాన్ని చెదరగొట్టినది కేవలం ఒక వాక్కు మాత్రమే. ఈ వాక్కుకు వెనక సూత్రధారి, పాత్రధారిగా ఉండే గ్రహం చంద్రుడు. పొరపాటున కావచ్చు, కావాలని కావచ్చు, నోటిద్వారా అన్న మాట ఆ ఇరువురి స్నేహిత బంధం అనే ఆయుష్షుకు గండిపడింది.

ఇలాగే బంధుత్వాలకి, కుటుంబంలో ఒకరినొకరికి, సంఘంలో పలకరించే సన్నిహితులకి... ఈవిధంగా చెప్పుకుంటూ పోతుంటే ఉద్యోగ, వ్యాపార, వ్యవహారాలలో తారసపడే ఎంతోమంది వ్యక్తులతో సంబంధ బాంధవ్యాలు ఉంటూ ఉంటాయి.

పైవిధంగా అనివార్య కారణాల వలన ఆయుష్షునే బంధం చెదిరిపోవటానికి వాక్కు తోడ్పడుతుంది. ఇతరులని మంచితనంతో రంజింప చేయాలన్నా, ఇతరులను బాధించే విధంగా తప్పు మాటలు చెప్పినా... కేవలం వాక్కు వలన మాత్రమే సాధ్యం.

ఓ ఖరీదైన కారుని ఓ వ్యక్తి కొన్నాడనుకుందాం. ఆ కారు అనేది ఇనుప వస్తువు. ఈ ఇనుముని శనిగా భావిస్తాం. అంత ఖరీదైన కారు... తనంతట తానుగా వెళ్లి ప్రమాదానికి గురి కాదు. దానిని ఒక సక్రమంగా నడపక పోతే ప్రమాదం వాటిల్లి, కారు రూపమే చెదిరిపోవును. అంటే వ్యక్తి ఏదో ఆలోచనతో ఉన్నందువలన లేక నిద్ర వలన లేక ఎదురుగా అనాలోచనతో వచ్చిన మరో డ్యాష్ ఇచ్చిన కారణంగా ఈ వాహనం దెబ్బతిన్నది. అందుకే శనికి అంతర్గత శత్రువు చంద్రుడయ్యాడు.

కనుక ఉద్యోగ, వ్యాపార, వ్యవహార, వాహన, జీవన, స్నేహిత అనే అనేక రంగాలలో అత్యధిక కాలం ఉండకుండా మధ్యలోనే చెడిపోవటమో, చెదిరిపోవటమో లేక నాశనమవ్వటమో, లేక మరణించటమో జరిగితే... ఆయుష్షు పోయింది అంటారు. ఇట్టి ఆయుష్షు కారకుడైన శనిని ముప్పు తిప్పలు పెట్టేవాడే చంద్రుడు.

జ్యోతిషపరంగా ఆయుష్షుకారకుడైన శనియొక్క క్షేత్రంలో... అంతర్గత శత్రువైన చంద్రుడు, శనికి బద్ధశత్రువైన శనితో కలిసిన మహా పర్వదినమైన మౌని అమావాస్య రోజున ప్రతి ఒక్కరూ సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు మౌనం వహించినచో ఆ సంవత్సరానికి కొంతమేర సమస్యలు సన్నగిల్లి...మానవాళి మంచి అంశాలతో ముందుకు వెళ్లటానికి అవకాశాలు ఉంటాయనేదే మౌని అమావాస్య ప్రధాన ఉద్దేశ్యం.

అయితే ఈ 2017 జనవరి నెలలో వచ్చే మౌని అమావాస్య పర్వదినానే అతిచారంతో వచ్చిన శనిగ్రహం ఉంది గనుక అత్యంత విశ్వాసంతో పగటి సమయమంతా కంపల్సరీగా మౌనం పాటించినవారందరికీ పరోక్ష శుభాలు ఉంటాయి.

అయితే ఈ మౌనం ఈ సంవత్సర గ్రహసంచార స్థితిగతుల ప్రకారం మూడు రకాలుగా ఉన్నాయి. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు 1వ పద్ధతి, అలాకాక ఉదయం 10 గంటల నుంచి మధ్యాహ్నం 1గంట వరకు, తిరిగి మధ్యాహ్నం 2.30 నుంచి 5.30 వరకు మౌనం పాటింపు రెండవ పద్ధతి. ఇలాకాక కేవలం మధ్యాహ్నం 2.30 నుంచి 5.30 వరకు మౌనం పాటింపు మూడవ పద్ధతి. పై మూడు పద్ధతులలో 1వ పద్ధతి ఉత్తమోత్తమం, 2వ పద్ధతి ఉత్తమం, 3వ పద్ధతి మధ్యమం. అసలు మౌనం పాటించకుండా ఉండటం అధమం. తర్పణ పిండప్రదానాదులు మౌనంతోనే ఆచరిస్తూ... తమకున్న దినచర్యలలో ఆపుకొనకుండా ఆచరించవచ్చు. మరిన్ని వివరాల కోసంగా జనవరిలో పోస్టింగ్ చేసే వ్యాసాలకై www.gargeyam.com వీక్షించండి.

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan
PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్‌కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

పంచాంగకర్త:
శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర మాఘమాస శుక్ల పంచమి బుధవారం నుంచి ఫాల్గుణమాస శుక్ల విదియ మంగళవారం వరకు

# 2017
## FEBRUARY ఫిబ్రవరి

26 ఫిబ్రవరి మాఘ అమావాస్య రోజున కంకణ సూర్యగ్రహణం ఖగోళంలో సంభవించనుంది. ఈ గ్రహణం భారతదేశంలో కనపడదు. ఇతర వివరాల కోసం 28వ తేది దిగువన పరిశీలించండి.

### పండుగలు

1. వసంతపంచమి
2. వరుణషష్ఠి
3. రథసప్తమి
వైవస్వతమన్వంతరాది
4. భీష్మాష్టమి
5. మధ్వనవమి, భానుకృత్తిక
7. భీష్మఏకాదశి (జయ)
9. విశ్వకర్మజయంతి
10. మాఘపూర్ణిమ
13. కుంభసంక్రాంతి
14. సంకష్టహరచతుర్ధి
22. విజయేకాదశి
24. మహాశివరాత్రి
26. ద్వాపరయుగాది
28. ఫాల్గుణచంద్రోదయం

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము:సా4.31-5.16<br>రా.కా: సా4.30-6.00 | | **5**<br>శు.నవమి సా6.29<br>కృత్తిక సా5.07<br>శేషవర్జ్యం ఉ7.23వరకు | **12**<br>బ.విదియ తె4.41<br>మఘ ఉ8.40<br>వ.సా4.46-6.24 | **19**<br>బ.అష్టమి మ2.17<br>అనూరాధ రా10.07<br>వ.తె4.22-6.09 | **●26**<br>మాఘఅమావాస్యరా8.28<br>ధనిష్ఠ ఉ7.16<br>వ.మ2.20-3.55 |
| **MON సోమ**<br>దుర్ము:మ12.44-1.29<br>మ3.00-3.46<br>రా.కా:ఉ7.30-9.00 | | **6**<br>శు.దశమి సా4.09<br>రోహిణి మ3.29<br>వ.ఉ8.02-9.31<br>వ.రా8.42-10.11 | **13**<br>బ.తదియ తె4.56<br>పుబ్బ ఉ8.59<br>వ.సా4.29-6.08 | **20**<br>బ.నవమి సా4.41<br>జ్యేష్ఠ రా12.53<br>వర్జ్యం లేదు | **27**<br>ఫాల్గుణశు.పాడ్యమిరా7.06<br>శతభిషం ఉ6.50<br>పూర్వాభాద్ర తె5.57<br>వ.మ1.00-2.37 |
| **TUE మంగళ**<br>దుర్ము:ఉ8.56-9.42<br>రా11.05-11.56<br>రా.కా: మ3.00-4.30 | | **7**<br>శు.ఏకాదశి మ1.47<br>మృగశిర మ1.49<br>వ.రా9.40-11.09 | **14**<br>బ.చవితి తె5.51<br>ఉత్తర ఉ9.57<br>వ.సా6.54-8.36 | **21**<br>బ.దశమి సా6.45<br>మూల రా3.18<br>వ.ఉ9.41-11.27<br>వ.రా1.32-3.18 | **28**<br>శు.విదియ సా5.20<br>ఉత్తరాభాద్ర తె4.44<br>వ.మ3.04-4.35 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.58-12.43<br>రా.కా: మ12.00-1.30 | **1**<br>శు.పంచమి రా2.20<br>ఉత్తరాభాద్ర రా10.07<br>వ.ఉ8.06-9.39 | **8**<br>శు.ద్వాదశి మ11.29<br>ఆర్ద్ర మ12.14<br>వ.రా11.31-1.01 | **15**<br>బ.పంచమి పూర్తిగా<br>హస్త మ11.32<br>వ.రా8.15-10.00 | **22**<br>బ.ఏకాదశి రా8.19<br>పూర్వాషాఢ తె5.12<br>వ.మ1.39-3.23 | |
| **THU గురు**<br>దుర్ము:ఉ10.28-11.13<br>మ2.59-3.45<br>రా.కా:మ1.30-3.00 | **2**<br>శు.షష్ఠి రా12.42<br>రేవతి రా9.12<br>వ.ఉ9.39-11.11 | **9**<br>శు.త్రయోదశి ఉ9.21<br>పునర్వసు ఉ10.48<br>వ.సా5.25-7.57 | **16**<br>బ.పంచమి ఉ7.23<br>చిత్ర మ1.41<br>వ.రా7.54-9.40 | **23**<br>బ.ద్వాదశి రా9.18<br>ఉత్తరాషాఢ తె6.30<br>వ.మ1.38-3.19 | |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.57-9.42<br>మ12.44-1.29<br>రా.కా:ఉ10.30-12.00 | **3**<br>శు.సప్తమి రా10.49<br>అశ్వని రా8.02<br>వ.సా4.13-5.45<br>వ.తె5.05-6.35 | **10○**<br>శు.చతుర్దశి ఉ7.30<br>పూర్ణిమ తె6.02<br>పుష్యమి ఉ9.40<br>వ.రా10.04-11.37 | **17**<br>బ.షష్ఠి ఉ9.25<br>స్వాతి సా4.18<br>వ.రా10.34-12.22 | **24**<br>బ.త్రయోదశి రా9.38<br>శ్రవణం పూర్తిగా<br>వ.ఉ10.37-12.15 | |
| **SAT శని**<br>దుర్ము:ఉ6.41-8.12<br>రా.కా:ఉ9.00-10.30 | **4**<br>శు.అష్టమి రా8.44<br>భరణి సా6.39<br>వ.తె5.53లగాయితు | **11**<br>బ.పాడ్యమి తె5.04<br>ఆశ్లేష ఉ8.55<br>వ.రా8.47-10.22 | **18**<br>బ.సప్తమి మ11.48<br>విశాఖ రా7.11<br>వ.రా11.40-1.28 | **25**<br>బ.చతుర్దశి రా9.20<br>శ్రవణం ఉ7.11<br>వ.మ11.12-12.48 | |

2016 జనవరి 29న రాహువు సింహరాశిలోనికి ప్రవేశించి గురుగ్రహానికి గురుచండాలయోగం కల్గించాడు. అయితే ఈ చండాల యోగం శతాబ్దాల తర్వాత అరుదుగా వచ్చేది. ఈ చండాలయోగం సింహ రాశిలో జరగటం, అధిపతి సూర్యగ్రహానికి 2016 మార్చి 9, సెప్టెంబరు 1, 2017 ఫిబ్రవరి 26న సంపూర్ణ సూర్యగ్రహణాలు ఉన్నవి. ఈ నాగబంధన ప్రభావం సమయంలోనే కుజ,శనుల సంఘర్షణ.. ఇతర వ్యతిరేక స్థితిగతులు ఉ ండబట్టే దీని ప్రభావం, ఆర్థికసంక్షోభంపై ఉందునని 2016 జూన్ 25నే తెలియజేయటమైనది. దీని ప్రభావంఇంకెతకాలమనే వివరాలకే www.gargeyam.com

### ఫిబ్రవరి శుభసమయములు

శ్రీ దుర్ముఖి మాఘమాసము

01 బుధ శు.పంచమి ఉత్తరాభాద్ర ఉ10.43-11.57
01 బుధ శు.పంచమి ఉత్తరాభాద్ర సా4.42-6.53
03 శుక్ర శు.సప్తమి అశ్వని ఉ10.35-12.43
03 శుక్ర శు.సప్తమి అశ్వని సా5.46-6.45
05 ఆది శు.నవమి రోహిణి సా5.17-6.29
05 ఆది శు.దశమి రోహిణి రా8.44-10.48
06 సోమ శు.దశమి రోహిణి ఉ10.23-12.43
06 సోమ శు.ఏకాదశి మృగశిర సా4.22-6.33
08 బుధ శు.త్రయోదశి పునర్వసు రా8.32-10.36
09 గురు శు.చతుర్దశి పుష్యమి రా8.28-10.32
11 శని బ.పాడ్యమి మఘ ఉ10.03-మ1.49
11 శని బ.పాడ్యమి మఘ రా8.20-8.46
13 సోమ బ.తదియ ఉత్తర ఉ9.55-మ12.43
13 సోమ బ.తదియ ఉత్తర రా8.12-10.16
15 బుధ బ.పంచమి హస్త ఉ9.47-11.57
17 శుక్ర బ.సప్తమి స్వాతి ఉ9.41-మ12.43
18 శని బ.అష్టమి అనూరాధ రా7.52-9.56
19 ఆది బ.అష్టమి అనూరాధ మ11.17-1.17
19 ఆది బ.నవమి అనూరాధ రా7.48-9.52

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## మాఘ అమావాస్యకు కుంభరాశిలో కంకణ సూర్యగ్రహణం

**శ్రీ దుర్ముఖి సంవత్సర మాఘ అమావాస్య** 26 ఫిబ్రవరి 2017 ఆదివారం కుంభరాశిలో రాహు నక్షత్రమైన శతభిషా నక్షత్ర ద్వితీయ మరియు తృతీయ పాదములలో కేతుగ్రస్తంగా కంకణ సూర్యగ్రహణం సంభవించును. ఈ కంకణ సూర్యగ్రహణం అనగా సూర్యునికి సంపూర్ణ గ్రహణము సంభవించును. అనగా నల్లని సూర్యబింబము ఉండును. వజ్రపుటుంగరాన్ని పోలిన విధంగా ఈ నల్లని బింబమునకు, చుట్టూ కంకణములా ప్రకాశవంతమైన వెలుగు ఉండును.

ఒకే డిగ్రీలో సూర్య చంద్రులు కలిసిపోవటాన్నే అమావాస్య అంటారు. సూర్యబింబము కంటే చంద్రబింబము సైజులో తక్కువగా ఉన్నచో, మిగిలిన భాగము కంకణముగా కనపడును. కనుకనే దీనిని కంకణ సూర్యగ్రహణము అంటారు.

సింహరాశిలో గురు,రాహు నాగబంధనం 2016 జూన్ 24 ఏర్పడింది. సింహరాశికి అధిపతి అయిన సూర్యగ్రహానికి 2016 మార్చి 9 సంపూర్ణ గ్రహణము, సెప్టెంబరు 1 కంకణ సూర్యగ్రహణం ఏర్పడటము, తిరిగి 2017 ఫిబ్రవరి మరో కంకణ సూర్యగ్రహణం ఏర్పడటం జరిగింది. ఈ మూడు గ్రహణాల ప్రభావము మరియు నాగబంధన ప్రభావము చేతనే... ఆర్థిక సంక్షోభము ఏర్పడి భారతీయ రిజర్వ్ బ్యాంక్‌పై దాని ప్రభావం ఉండునని 2016 జూన్ 24నే తెలియజేయటమైనది. ఈ వివరము Sreenivasa Gargeya Ponnaluri అను నా ఫేస్‌బుక్ పేజీలో ఇవ్వటం జరిగినది. అయితే నాగబంధన ప్రభావమే కాక ఇతర వ్యతిరేక గ్రహస్థితుల ప్రభావం కూడా 2018 జూన్ వరకు కొంత వ్యతిరేకంగానే ఉండును. ఈ కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. ఆఫ్రికా, అట్లాంటిక్, అంటార్కిటికా ఖండాలతోపాటు దక్షిణ అమెరికాలో కూడా కనపడును. భారతకాలమాన ప్రకారం సాయంత్రం 6గం॥45ని॥లకు గ్రహణం ప్రారంభమై, రాత్రి 10గం॥01ని॥తో గ్రహణం ముగియును. సూర్యగ్రహణ స్పర్శ సమయానికి భారతదేశంలో సూర్యుడు అస్తమించును. కనుక కనపడదు. దక్షిణ అమెరికాలోని వెనుజులా, కొలంబియా నగరాలలో మాత్రం గ్రహణం గోచరించదు. ఫసిఫిక్ మహాసముద్రంపై సంపూర్ణ గ్రహణము మరియు కంకణము గోచరించును.

ఈ దిగువ తెల్పిన నగరాలలో మాత్రం పాక్షికంగానే గ్రహణం కనపడును. అర్జెంటినాలో స్పర్శ ఉ9.29, ముగింపు మ12.17. బ్రెజిల్‌లో స్పర్శ ఉ10.03, ముగింపు మ12.58. చిలీలో స్పర్శ ఉ8.19, ముగింపు ఉ10.52. పెరులో స్పర్శ ఉ7.50, ముగింపు ఉ9.11. ఈ గ్రహణము యొక్క పూర్వాపరాలను www.gargeyam.com లో వీక్షించండి.



# వృషభరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:4, రాజ్యపూజ్యం:4, అవమానం:7

శ్రీ హేమలంబ : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:7, అవమానం:3

**జనవరి :** స్థిరమైన ఆదాయం ఉండేలా ఆలోచనను స్థిరం చేస్తారు. ఆంతరంగికుల సలహాలను స్వీకరిస్తారు. ఉద్యోగస్థులకు అధికారుల అండదండలుండును. చర్మసంబంధ రుగ్మత రాగల సూచన కలదు. న్యాయస్థాన విషయాలు వాయిదా పడతాయి. ముఖ్య కార్యాలలో విజయం సాధిస్తారు. మాసాంతానికి స్వల్ప మనస్తాపం. శత్రువులపై కాలుదువ్వవద్దు. దైవకార్యాలపై శ్రద్ధ ఎక్కువ. ఆర్భాటాలకు, ఆడంబరాలకు దూరం. జనవరి 24 సాయంత్రం 4.33 నుంచి 26 రాత్రి 2.51 వరకు వ్యతిరేకసమయం.

**ఫిబ్రవరి :** సంతానంపై మనోవ్యాకులత్వమేర్పడును. జాయింటు దారులతో సామరస్యంగా మాట్లాడలేరు. బంధుమిత్ర సంబంధాలకు ఎదురు దెబ్బ తగిలే అవకాశం. 2వవారంలో ఇష్టార్థసిద్ధి కల్గును. పుణ్యకార్యాచరణము కష్టంతో చేయుదురు. కీలక అంశాలపై దృష్టి ఉంచ లేరు. మేనమామ సహాయంతో కార్యసిద్ధి. కృతనిశ్చయం బలంగా ఉంటుంది. విధాన నిర్ణయాలలో లోపాలు తగ్గును. న్యాయలావాదేవీలు అనుకూలము. ఫిబ్రవరి 20 రాత్రి 12.53 నుంచి 23 మ11.31 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**మార్చి :** ఆర్థికస్థితి మెరుగుపడును. స్పెక్యులేషన్‌లో స్వల్ప రాణింపు. భోజనసౌఖ్యముతో ఆనందం. దూరప్రాంత ప్రయాణాలతో అలసట, అనవసర ధనవ్యయం. తొౖరపాటు నిర్ణయాలకు స్వస్తి చెబుతారు. శరీర తేజస్సు పెరుగును. వివాద అంశాలు సమసిపోవును. మనో వాంఛలు నెరవేరును. ఈర్ష్యా ద్వేషాలు తగ్గును. 2వవారంలో సోదరవర్గంపై ఆగ్రహాలు వద్దు. వ్యవహారశైలిలో మార్పులు చేయుదురు. స్థానచలన అవకాశాలు ఉండవు. మార్చి 20 ఉ9.10 నుంచి 22 రాత్రి 8.32 వరకు ప్రతికూల సమయము.

**ఏప్రిల్ :** సంయమనం పాటించాలి. ఋణదాతల వత్తిడి అధికం. అసత్యాలతో అపజయాలు ఎదురగును. శుభకార్య నిర్వహణ చర్చలు విజయవంతం. స్పెక్యులేషన్ యోగం కాదు. అవివాహితులకు శుభవార్తలు. స్వయంరంగాల వారికి బాగా అనుకూలం. మాసాంతంలో మనోవాంఛలు సిద్ధించును. సంతాన అంశాలు సజావుగా సాగును. ఏప్రిల్ 16 సాయంత్రం 4.39 నుంచి 18 రా.తె 4.43 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** కుటుంబ వ్యవహారాలలో పెద్దల జోక్యం ఉండును. శరీర, మానసిక వత్తిడులు మాసాంతంలో తగ్గును. సోదరసంఘీ భావం పెరుగును. లౌకిక విషయాలపై శ్రద్ధ ఉంచు తారు. కార్యదీక్షాబాధ్యతను నెరవేర్చుదురు. శుభకార్యాచరణకు అవకాశాలు అధికము. ఆరోపణలు, విమర్శలు తగ్గును. బంధుసమాగమం కలదు. మానసికి దౌర్బల్యాన్ని తగ్గిస్తారు. మే 13 రాత్రి 11.11 నుంచి 16 మధ్యాహ్నం 11.34 వరకు ప్రతికూల సమయం.

**జూన్ :** మిత్రత్వ సంభాషణలచే లబ్ధి. పూచీకత్తుకై సంతకాలు వద్దు. గౌరవమర్యాదలకు భంగం వాటిల్లు అవకాశం ఉంది. మనోసంకటాలు పెరుగును. అనవసర రాద్ధాంతాలకు వెళ్లకండి. విసుగు, విమర్శలు పెరుగును. వివాదాంశాలపై సాహసాలు చేయవద్దు. ధనక్షయం జరుగును. మాసం మధ్య నుంచి ప్రతిష్ఠాత్మక నిర్ణయాలు విజయవంతం. శుభ చర్చలను స్వాగతిస్తారు. స్పెక్యులేషన్ లాభించును. జూన్ 9 రా.తె 5.12 నుంచి 12 సాయంత్రం 5.28 వరకు వ్యతిరేక సమయంగా గ్రహించాలి.

**జూలై :** కీలక నిర్ణయాలు అధికంగా ఉండును. శుభచర్యలలో పాల్గొని పితృవర్గం వారిని సంతోషపెడుదురు. స్థిరాస్తి అంశాలలో మాసాంతంలో నిర్ణయాలు తీసుకుంటారు. బంధువులతో శతృత్వాలు వద్దు. రాజీ ధోరణితో ముందుకు వెళుదురు. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. స్వయంవృత్తుల వారికి ఆశాజనకం. జూలై 7 సాయంత్రం 6.03 నుంచి 9 రాత్రి 11.23 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**ఆగస్టు :** ఆదాయానికి మించిన ఖర్చులు. నూతన ఒప్పందాలు రాణిస్తాయి. సంతానంచే అమితోత్సాహం. ప్రతిబంధక అంశాలపై నిర్ణయం వద్దు. మాసాంతంలో ఇష్టార్థసిద్ధి కల్గును. జ్ఞాపకశక్తిని పెంచండి. ముంజేతి సమస్య తీరును. భూ, గృహ,ధన విషయాలలో లబ్ధి అధికము. ఆగస్టు 3 సాయంత్రం 6.13 నుంచి 6 ఉదయం 6.08 వరకు తిరిగి 30 రాత్రి 1.54 నుంచి సెప్టెంబరు 2 మధ్యాహ్నం 1.58 వరకు ప్రతికూల సమయాలుగా గ్రహించాలి.

**సెప్టెంబరు :** ఉదరలోపం పెరుగును. మానసిక సుఖం సన్నగిల్లును. శతృవర్గీయులను తక్కువ అంచనా వేయవద్దు. స్పెక్యులేషన్‌లో దూకుడు తగ్గించండి. సోదరలబ్ధి కలదు. శుభకార్య చర్చలు వాయిదా. పాతమిత్రత్వం కోరుకోవద్దు. ముఖ్యవ్యవహారాలు తల్లక్రిందులవుతాయనే భయం వద్దు. రహస్య చర్చలు మానుదురు. ఆరోపణలు, విమర్శలు ఎక్కువ. సెప్టెంబరు 27 ఉ9.58 నుంచి 29 రాత్రి 10.25 వరకు వ్యతిరేక సమయంగా గ్రహించాలి.

**అక్టోబరు :** ఆర్థికపరిపుష్టి అధికము. సునాయాస ప్రయత్నాలు కఠినము. కల్పనాశక్తి పెరగటంతో ఆర్థికలబ్ధి. దైవకార్యాచరణపై ఆసక్తి మెండు. భూ, గృహ, ధన విషయములలో లబ్ధిని సాధిస్తారు. సమయస్ఫూర్తితో విజయాలను స్వాగతిస్తారు. భాగస్వామ్య నిర్ణయాలలో లోపాలుండును. ఆరోగ్య రీత్యా వైద్యసేవలవసరము. అక్టోబరు 24 సాయంత్రం 5.45 నుంచి 27 ఉదయం 6.34 వరకు అనుకూల సమయం కాదు.

**నవంబరు :** ఆచితూచి సంభాషిస్తారు. ప్రణాళికాబద్ధంగా రూపకల్పన చేయుదురు. శతృపీడ తగ్గును. సంతానంచే విజయప్రాప్తి. వృత్తిరీత్యా ఉన్నతులుండుదురు. గౌరవ ప్రతిష్ఠలకు భంగం రాదు. జీవనసమస్యలకు ఎదురీదుతారు. స్త్రీ మూలకంగా లబ్ధి కల్గును. ప్రత్యేక ప్రతిపత్తిని సఫలం చేసుకుందురు. దూరప్రయాణాలతో అలసట. నవంబరు 20 రాత్రి 12.48 నుంచి 23 మధ్యాహ్నం 1.45 వరకు ప్రతికూల సమయం.

**డిశంబరు :** స్థిరాదాయం తగ్గును. ఖర్చులు పెరుగును. ఋణదాతల వత్తిడి కూడా అధికము. సంతానం వలన శుభవార్తలు. అన్యోన్యతానురాగాలతో కుటుంబంలో మనశ్శాంతి. ఎంతటి కార్యభారమైననూ సాధిస్తామనే ధైర్యం. మాసం మధ్య నుంచి స్వవృత్తులవారికి ఆశాభంగములుండవు. సహాయ సహకారాలపై ఆలోచనలధికం. అవివాహితులకు వివాహయోగం. ఉద్యోగస్తులపై అధికారుల దయ పెరుగును. న్యాయ అంశాలు వాయిదా. దైవకార్యాలతో సమయం గడుపుతారు. డిశంబరు 18 ఉదయం 7.07 నుంచి 20 రాత్రి 8.01 వరకు అనుకూల సమయం కాదు.

## 2016లోని నాగబంధన ప్రభావం ఇంకెంతకాలం ఉంటుంది?

శుభగ్రహమైన గురువు రాహువుతో కలవటాన్నే నాగబంధనం అంటారు. ఈ నాగబంధన ప్రభావం సంతాన అంశాలపై చూపిస్తుంటుంది. సంతానం అంటే ఎవరు? మనం ఒకరికి సంతానం. మనకు తిరిగి సంతానముంటుంది. అంటే ప్రస్తుతం జీవించి ఉన్న వారందరిపైన నాగబంధన ప్రభావం ఉన్నదని అర్థము.

ఇక వివరాలలోకి వెళ్తే ప్రతి 6 సంవత్సరాలకి ఓసారి గురువు, రాహువు ఏదో ఒకరాశిలో కలుస్తుంటారు. కానీ శతాబ్దాల తర్వాత అరుదుగా వచ్చిన నాగబంధనమే గత 2016లో ఏర్పడింది. గురువు 2016 జనవరి నాటికి సింహరాశిలో సంచారం చేస్తున్నాడు. 29 జనవరిన రాహువు సింహరాశిలోకి ప్రవేశించాడు. ఒకేరాశిలో గురువు, రాహువు సంచారాన్ని గురుచండాలయోగమని పిలుస్తారు. 24 జూన్ ఇదే సింహరాశిలో గురువు, రాహువు ఒకే బిందువు వద్ద కలిసిపోయారు. ఈ కలిసిపోవటాన్నే నాగబంధనం అంటారు.

సింహరాశిలో జరిగిన ఈ నాగబంధనానికి ప్రారంభంలో సింహరాశి అధిపతి అయిన రవికి ఓ సంపూర్ణ సూర్యగ్రహణం జరగటము, తిరిగి సింహరాశిలోకి రాగానే మరో కంకణ సూర్యగ్రహణం జరగటము, ఈ రెండు గ్రహణాల మధ్య శని,కుజులు ఏక బిందువులో కలిసిపోవటమనే వ్యతిరేక గ్రహస్థితులు ఏర్పడ్డాయి.

పైన ఏర్పడిన నాగబంధన ప్రభావం ప్రపంచవ్యాప్తంగా ఆర్థిక, సామాజిక, వైమానిక, భూకంప, సరిహద్దు అంశాలపైన మాత్రమే కాక... రెండు దేశాల మధ్య యుద్ధభయ వాతావరణం వంటిది ఏర్పడుతుందని 2016 మార్చి 2 నాటి ఆంధ్రప్రదేశ్ దినపత్రికలలో ముందుగా తెలియజేయటం జరిగింది.

అయితే నాగబంధనం ఏర్పడిన 2016 జూన్ 24 నాడే ఐరోపా సమాఖ్య కుప్పకూలి పోవటము, ఈ సమాఖ్య నుంచి యునైటెడ్ కింగ్డమ్ వైదొలగటంతో ఆర్థిక సంక్షోభానికి తెరతీయటం జరిగింది. ఆరోజే భారతీయ జనతాపార్టీ అధ్యక్షుడు అమిత్‌షా గారు ఏమన్నారంటే... ఎలాంటి ఆర్థిక సంక్షోభాలు వచ్చిననూ ఎదుర్కోవటానికి భారతదేశం సిద్ధంగా ఉన్నదని మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శించారు. దీనిని పురస్కరించుకొని 2016 జూన్ 24, 25 తేదీలలోని sreenivasa gargeya ponnaluri అనబడే నా ఫేస్‌బుక్‌లోను మరియు దిన పత్రికలలోను స్పష్టంగా మరికొన్ని వివరాలు ఇవ్వటం జరిగింది.

ఏమనగా, ఐరోపా సమాఖ్య కుప్పకూలిన దానికి వచ్చిన సంక్షోభం కంటే... రాబోయే నాల్గు మాసాలలో భారతదేశం పూర్తిగా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుంటుందని, అంతేకాక రిజర్వ్ బ్యాంక్ గవర్నర్‌గా ఉన్న రఘురామ్‌రాజన్ గారు కూడా నిష్క్రమించినందున, అనేక సమస్యలు భారతదేశం ఎదుర్కొనవలసి వస్తుందని... కాలమే నిర్ణయిస్తుంది అని 26,27 తేదీలలో నరేంద్రమోదీ గారి జాతక విశ్లేషణను అందిస్తూ నర్మగర్భంగా తెలియజేశాను. ఆ తర్వాత పరిస్థితి అందరికీ తెలిసినదే. అయితే ఇది ఇలా ఉండగా విపరీతంగా భూకంపాలు వంటివి రావటాలు, తరచుగా విమాన ప్రమాదాలు చోటుచేసుకోవటాలు కూడా ఈ నాగబంధనం వలనే అన్న విషయాన్ని మరువకూడదు.

జూన్ 24 జరిగిన నాగబంధనం ప్రభావం 2018 జూన్ వరకు పరోక్షంగా కొనసాగుతూనే ఉంటుంది. అంతేకాక గురువు సింహరాశి నుంచి కన్యకి వచ్చిన తర్వాత వక్రశని, వక్రగురువులు ఒకే సమయంలో ఉంటూ, గురు స్థానం నుంచే వక్ర శని.. వక్ర గురువుని అధికకాలం వీక్షించటం జరిగింది. ఇవే కాకుండా అనేక ఇతర వ్యతిరేక గ్రహ సంచార స్థితిగతులు కూడా ఈ 2017 ప్రారంభం నుంచే మొదలయ్యాయి.

ఆర్థిక, సామాజిక, రాజకీయ, వైద్య, విద్య, కార్మిక, కర్షక, మహిళ, సినిమా, సంగీత, సాహిత్య, కంప్యూటర్ రంగాలతో పాటు బంగారు రంగంపై కూడా దీని ప్రభావం అధికం. ముఖ్యంగా ఈ ఫిబ్రవరి 3,4 వారాలు, మార్చి మొదటివారంలో నాగబంధన ప్రభావం పాతాళలోకం దగ్గర నుంచి ప్రభావాన్ని చూపించనుంది. దీని వలన చిలీ, పెరూ, అర్జెంటీనా, బ్రెజిల్ ప్రాంతాలలో భూకంప రూపంలో నాగబంధనం ప్రభావాన్ని చూపు సూచన కలదు. కనుక ద్వాదశరాశుల వారు తమ తమ ఆలోచనా విధి విధానాలను తప్పుగా తీసుకోకుండా మన దేశానికి మాత్రమే కాకుండా, ప్రపంచానికి కూడా సమస్యలు ఉండకూడదని భక్తి, విశ్వాసాలతో భగవతిని ప్రార్థించటం సర్వదా శ్రేయోదాయకం.

కనుకనే శ్రీచక్రంలోని 8వ ఆవరణగా ఉండే సర్వసిద్ధిప్రదచక్రంలో వేంచేసి ఉన్న 15 మంది దేవతలను ఆయా తిథులలో సాయంత్ర సమయంలో ప్రార్థిస్తూ... లలితా సహస్రనామంలో ఉన్న 240 అతిరహస్య అష్టాక్షరీ నామాలను సాయంత్ర సమయాలలో పారాయణం చేయటం వలన... పరోక్షంగా ప్రతివారికి లబ్ధి కల్గగలదు.

శుక్ల పాడ్యమి నుంచి దేవీకళ మొదలై... కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావజ్రేశ్వరీ, శివదూతీ, త్వరితా, కులసుందరీ, నిత్యా, నీలపతాకా, విజయా, సర్వమంగళా, జ్వాలామాలినీ, చిత్రా అనే నిత్యతిథి దేవతలు ఉంటారు. తిరిగి కృష్ణపక్షంలో ఈ దేవతలే వెనుక నుంచి వరుసగా విచిత్రా, జ్వాలామాలినీ, సర్వమంగళా, విజయా, నీలపతాకా, నిత్యా, కులసుందరీ, త్వరితా, శివదూతీ, మహావజ్రేశ్వరీ, వహ్నివాసినీ, భేరుండా, నిత్యక్లిన్నా, భగమాలినీ, కామేశ్వరీ నిత్య తిథి దేవతలుగా చంద్రకళలు ఉంటాయి. ప్రక్క పేజీలలో ఒక్కో దేవతకు సంబంధించిన 16 నామాలను ఇవ్వటం జరిగింది. కనుక ద్వాదశ రాశులవారు ఈ నామాలను పారాయణం చేసేది.

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

MOHAN PUBLICATIONS
www.granthanidhi blogspot in.
వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్‌కై వీక్షించండి..
www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిమిడీస్ కేలండర్



పంచాంగకర్త:
శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ఫాల్గుణమాస శుక్ల తదియ బుధవారం నుంచి శ్రీ హేమలంబ సంవత్సర చైత్ర శుక్ల చవితి శుక్రవారం వరకు

# 2017 MARCH మార్చి

భారత ప్రభుత్వ ఆమోదితమైన, ఖచ్చితమైన, ప్రత్యక్ష ప్రామాణికం గల పంచాంగమే దృగ్గణిత పంచాంగము. దృగ్గణిత పంచాంగ రీత్యా సాధించిన తిథి నక్షత్రాదులలో ఆచరించే శుభ కార్యములు సత్ఫలితాలను అందించును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము:సా4.37-5.24<br>రా.కా: సా4.30-6.00 | | **5**<br>శు.అష్టమి రా3.59<br>రోహిణి రా9.01<br>వ.మ1.30-3.00<br>వ.రా2.19-3.49 | **○12**<br>ఫాల్గుణపూర్ణిమరా8.23<br>పుబ్బ సా5.41<br>వ.రా1.12-2.52 | **19**<br>బ.సప్తమి పూర్తిగా<br>జ్యేష్ఠ పూర్తిగా<br>వ.మ12.31-2.19 | **26**<br>బ.త్రయోదశిమ12.29<br>శతభిషం సా4.29<br>వ.రా10.34-12.06 |
| **MON సోమ**<br>దుర్ము:మ12.42-1.29<br>మ3.03-3.50<br>రా.కా:ఉ7.30-9.00 | | **6**<br>శు.నవమి రా2.01<br>మృగశిర రా7.42<br>వ.రా3.43-5.15 | **13**<br>బ.పాడ్యమి రా8.51<br>ఉత్తర సా6.42<br>వ.రా3.38-5.20 | **20**<br>బ.సప్తమి ఉ8.19<br>జ్యేష్ఠ ఉ9.10<br>వ.సా6.03-7.50 | **27**<br>బ.చతుర్దశి ఉ10.45<br>పూర్వాభాద్రమ3.20<br>వ.రా12.17-1.46 |
| **TUE మంగళ**<br>దుర్ము:ఉ8.46-9.33<br>రా11.05-11.53<br>రా.కా: మ3.00-4.30 | | **7**<br>శు.దశమి రా12.17<br>ఆర్ద్ర సా6.37<br>వ.తె6.11లగాయితు | **14**<br>బ.విదియ రా9.49<br>హస్త రా8.12<br>వ.తె4.52లగాయితు | **21**<br>బ.అష్టమి ఉ10.31<br>మూల మ11.51<br>వ.ఉ10.04-11.51<br>వ.రా10.22-12.07 | **●28**<br>ఫాల్గుణఅమావాస్య ఉ8.26<br>చైత్ర శు.పాడ్యమి తె5.44<br>ఉత్తరాభాద్ర మ1.41<br>వ.రా12.40-2.08 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.56-12.43<br>రా.కా:<br>మ12.00-1.30 | **1**<br>శు.తదియ మ3.17<br>రేవతి రా3.16<br>వ.సా4.00-5.30 | **8**<br>శు.ఏకాదశి రా10.49<br>పునర్వసు సా5.46<br>శేషవర్జ్యం ఉ7.44వరకు<br>వ.రా1.35-3.08 | **15**<br>బ.తదియ రా11.17<br>చిత్ర రా10.11<br>శేషవర్జ్యం ఉ6.36వరకు<br>వ.తె4.20-6.06 | **22**<br>బ.నవమి మ12.18<br>పూర్వాషాఢ మ2.07<br>వ.రా10.41-12.23 | **29**<br>శు.విదియ రా2.46<br>రేవతి మ11.39<br>వ.తె5.47లగాయితు |
| **THU గురు**<br>దుర్ము:ఉ10.22-11.09<br>మ3.03-3.50<br>రా.కా:మ1.30-3.00 | **2**<br>శు.చవితి మ1.03<br>అశ్వని రా1.41<br>వ.రా9.57-11.27 | **9**<br>శు.ద్వాదశి రా9.39<br>పుష్యమి సా5.12<br>వ.తె5.53లగాయితు | **16**<br>బ.చవితి రా1.11<br>స్వాతి రా12.35<br>వర్జ్యం లేదు | **23**<br>బ.దశమి మ1.27<br>ఉత్తరాషాఢ మ3.47<br>వ.రా7.57-9.37 | **30**<br>శు.తదియ రా11.42<br>అశ్వని ఉ9.24<br>శేషవర్జ్యంఉ7.14వరకు<br>వ.సా6.05-7.32 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.48-9.35<br>మ12.42-1.29<br>రా.కా:ఉ10.30-12.00 | **3**<br>శు.పంచమి ఉ10.43<br>భరణి రా12.04<br>వ.ఉ10.38-12.08 | **10**<br>శు.త్రయోదశి రా8.49<br>ఆశ్లేష సా4.59<br>వ.తె5.03-6.40 | **17**<br>బ.పంచమి రా3.26<br>విశాఖ రా3.19<br>వ.ఉ6.49-8.36 | **24**<br>బ.ఏకాదశి మ1.53<br>శ్రవణం సా4.45<br>వ.రా8.47-10.24 | **31**<br>శు.చవితి రా8.40<br>భరణి ఉ7.06<br>కృత్తిక తె4.53<br>వ.సా5.59-7.27 |
| **SAT శని**<br>దుర్ము:ఉ6.26-8.00<br>రా.కా:ఉ9.00-10.30 | **4**<br>శు.షష్ఠి ఉ8.23<br>శు.సప్తమి తె6.07<br>కృత్తిక రా10.29<br>వ.మ11.17-12.46 | **11**<br>శు.చతుర్దశి రా8.23<br>మఘ సా5.07<br>వ.రా1.19-2.57 | **18**<br>బ.షష్ఠి తె5.52<br>అనూరాధ తె6.15<br>వ.ఉ7.48-9.36 | **25**<br>బ.ద్వాదశి మ1.33<br>ధనిష్ఠ సా4.59<br>వ.రా12.02-1.36 | మార్చి 28నే సశాస్త్రీయ శ్రీ హేమలంబ ఉగాది |

### పండుగలు

1. జమాదీసానినెలారంభం
2. పుత్రగణపతి వ్రతం
3. శ్రీకంఠజయంతి
8. అమలకి ఏకాదశి
9. శ్రీనృసింహద్వాదశి
12. కామదహనం, హోళీ,మదనపూర్ణిమ బ్రహ్మసావర్ణికమన్వాది
13. శ్రీమహాలక్ష్మి జన్మదినం వసంతోత్సవం
16. సంకష్టహరచతుర్థి
20. శుక్రమౌఢ్యారంభం
24. పాపమోచన ఏకాదశి
26. మాసశివరాత్రి
28. శ్రీ హేమలంబ ఉగాది వసంతనవరాత్రారంభం
29. చైత్రమాసచంద్రోదయం
30. రజ్జబ్ నెల ప్రారంభం శుక్రమౌఢ్యత్యాగం
31. గణేశదమనపూజ

### మార్చి శుభసమయములు

శ్రీ దుర్ముఖి ఫాల్గుణమాసము

| | | |
|---|---|---|
| 01 | బుధ శు.తదియ రేవతి | ఉ8.51-మ11.55 |
| 02 | గురు శు.చవితి అశ్వని | ఉ7.13-8.46 |
| 05 | ఆది శు.అష్టమి రోహిణి | ఉ7.01-8.34 |
| 06 | సోమ శు.నవమి మృగశిర | ఉ6.57-8.30 |
| 06 | సోమ శు.నవమి మృగశిర | ఉ10.17-2.29 |
| 08 | బుధ శు.ఏకాదశి పునర్వసు | ఉ6.49-8.22 |
| 08 | బుధ శు.ఏకాదశి పునర్వసు | ఉ10.09-11.53 |
| 08 | బుధ శు.ఏకాదశి పుష్యమి | రా8.45-10.54 |
| 09 | గురు శు.ద్వాదశి పుష్యమి | ఉ6.45-8.18 |
| 10 | శుక్ర శు.చతుర్దశి మఘ | రా8.50-10.46 |
| 11 | శని శు.చతుర్దశి మఘ | ఉ7.57-8.10 |
| 11 | శని శు.చతుర్దశి మఘ | ఉ9.57-మ2.09 |
| 12 | ఆది బ.పాడ్యమి ఉత్తర | రా8.29-10.38 |
| 13 | సోమ బ.పాడ్యమి ఉత్తర | ఉ6.29-8.02 |
| 13 | సోమ బ.పాడ్యమి ఉత్తర | ఉ9.49-మ12.39 |
| 13 | సోమ బ.విదియ హస్త | రా8.52-10.34 |
| 15 | బుధ బ.తదియ చిత్ర | ఉ9.41-మ11.51 |
| 15 | బుధ బ.తదియ చిత్ర | రా8.17-10.26 |
| 18 | శని బ.షష్ఠి అనూరాధ | ఉ9.37-మ1.41 |
| 22 | శుక్ర బ.దశమి ఉత్తరాషాఢ | రా7.49-9.58 |
| 23 | శని బ.దశమి ఉత్తరాషాఢ | ఉ9.09-10.12 |
| 24 | ఆది బ.ఏకాదశి శ్రవణం | ఉ9.26-11.05 |

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## మార్చి 28 నే శ్రీ హేమలంబ ఉగాది పర్వదినం

శ్రీ హేమలంబ ఉగాది పర్వదినము 2017 మార్చి 28 మంగళవారం ఆచరించాలి. నిర్ణయసింధు, నారదసంహిత, దైవజ్ఞకర్ణామృతం, దైవజ్ఞ రంజనమ్, జ్యోతిర్విద్యాభరణం, అగ్నిపురాణం, బృహత్సంహిత, చతుర్వర్గచింతామణి, శాంతి కమలాకరమ్, వీరమిత్రోదయం, పంచాంగసరళి, పంచాంగ పీఠిక మున్నగు గ్రంథముల నిర్ణయానుసారంగా 2017 మార్చి 28న ప్రారంభమయ్యే తెలుగు సంవత్సరాది పేరు 'శ్రీ హేమలంబ'.

భారత ప్రభుత్వ ఆమోదిత గణితమైన దృక్సిద్ధాంత పంచాంగరీత్యా మార్చి 28నే ఉగాది పర్వదినాన్ని ఆచరించాలి. శాస్త్రీయం కానటువంటి, ప్రామాణికం లేనటువంటి,ప్రత్యక్ష ఋజువునకు నిలబడని గణితమును పూర్వగణితము అంటారు. ఈ పూర్వగణితం ద్వారా ఉగాది పండుగను మార్చి 29గా ప్రకటిస్తారు.

కానీ పంచాంగాలలో దృగ్గణితము, పూర్వగణితము అను రెండు గణితములు ఉన్నవి. దృగ్గణిత పంచాంగములోని తిథి నక్షత్ర సమయములు ఖచ్చితమైన ప్రత్యక్షఋజువునకు నిలబడును. పూర్వగణితము ప్రత్యక్ష ఋజువునకు నిలబడదు. అందుచేత ఎన్నోసార్లు ప్రత్యక్ష ఋజువునకు నిలబడిన దృగ్గణిత పంచాంగగణిత ప్రకారంగా శ్రీ హేమలంబ ఉగాది మార్చి 28నే.

సూర్య గ్రహము, చంద్రగ్రహమునకు మధ్య ఉండే దూరమును తిథి అంటారు. కనుక 12 డిగ్రీలు వరకు పాడ్యమి తిథి అని, 12 పైన 24 డిగ్రీల వరకు విదియ తిథి అని లెక్క. అనగా ఒక్కో తిథికి 12 డిగ్రీల ప్రమాణంగా, శుక్లపక్షంలోని 15 తిథులు, కృష్ణపక్షంలోని 15 తిథులు, వెరసి 30 తిథులకు కలిపి 360 డిగ్రీలుగా భచక్రముండును (ఖగోళము).

సూర్యుడు ఎన్ని డిగ్రీలలో, చంద్రుడు ఎన్ని డిగ్రీలలో ఉన్నారనే ఖచ్చిత స్థితిని దృగ్గణిత పంచాంగం ద్వారా తెలుసుకోవచ్చు. దృగ్గణిత రీత్యా సాధించిన తిథ్యాదుల సమయాలు, అమెరికాలోని నాసావారి సమయాలతో ఏకీభవించును. అంటే నాసావారు పంచాంగం రాస్తారు అని అర్థం కాదు, ఖగోళ పరిశోధన సంస్థ అయిన నాసావారి గణాంకాల వివరాల ప్రకారం చంద్రోదయం, పూర్ణిమ ప్రారంభము, పూర్ణిమ ముగింపు, అమావాస్య ప్రారంభము స్పష్టంగా తెలియును. ఇట్టి గణాంకాలే అతి ఖచ్చితమైనవి. అంతేకాక ఖగోళంలో ఏర్పడే సూర్యచంద్ర గ్రహణ సమయాలను దృగ్గణితం ప్రకారం సాధించ వచ్చును. పూర్వగణితం ప్రకారం సాధించిన సూర్యచంద్ర గ్రహణ సమయాలు, ఆకాశంలో కనపడే గ్రహణ సమయాలతో ఏకీభవించవు. కనుక ఆస్తికులైన పాఠకులందరూ ప్రత్యక్ష ప్రామాణికమున్న దృగ్గణిత పంచాంగ గణిత ప్రకారంగా 2016 మార్చి 28 ఉగాదిగా పేర్కొనాలి. మార్చి 29న పంచాంగ పఠనం చేసినా సంకల్పంలో శుక్ల విదియను స్వాగతిస్తూ పంచాంగ పఠనం చేసుకుంటారు. సంవత్సర నిర్ణయంపై పండిత సభలో తిరుమల సిద్ధాంతి గారి నిర్ణయానికి ఏప్రిల్ పేజీలో దిగువన చూడండి.



# మిధునరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:14, వ్యయం:11, రాజ్యపూజ్యం:7, అవమానం:3

శ్రీ హేమలంబ : ఆదాయం:5, వ్యయం:5, రాజ్యపూజ్యం:3, అవమానం:6

**జనవరి :** సంతానంచే ప్రశంసలు, విమర్శలుండును. కపటస్వభావులతో స్నేహం ఉండును. నిరుద్యోగులకు తీపివార్తలు. నమ్మినవారి వలన నష్టమేమీ లేదు. స్పెక్యులేషన్ వద్దు. ఆచితూచి సంభాషిస్తుంటారు. దైవకార్యాచరణపై ఆసక్తి. సామరస్యధోరణి వైపు వెళ్లలేరు. అసత్యాలతో పనులు ఆగును. స్వార్థం పెరిగి, ఆదాయం తగ్గును. గృహవాతావరణం అనుకూలం కాదు. వ్యక్తిగత ఆకర్షణలకు ధనవ్యయం. జనవరి 26 రాత్రి 2.51 నుంచి 29 ఉదయం 10.51 వరకు ప్రతికూల సమయము.

**ఫిబ్రవరి :** మొదటిపక్షంలో అధికవ్యయం. ఆశ్రిత పక్షపాతంచే నిందలు తప్పవు. పాత పద్ధతులను మానుకోలేరు. శుభకరచర్చలు వాయిదా పడును. స్పెక్యులేషన్ సాధారణం. 2వ పక్షంలో విమర్శలధికం. ఋణదాతల వత్తిడి పెరుగును. మానసిక, శారీరక సంఘర్షణలు సాధారణం. నూతన ఆలోచనలు కలిసివస్తాయి. ఆర్థికస్థితి సాధారణం. ఫిబ్రవరి 23 మధ్యాహ్నం 11.31 నుంచి 25 రాత్రి 7.13 వరకు ప్రతికూలం.

**మార్చి :** తోబుట్టువులు సహకరిస్తారు. వృత్తి వ్యాపారాదులలో ఇతరుల జోక్యం పెరుగును. దీర్ఘకాల సమస్యలకు మోక్షం కల్గును. ఆత్మవిశ్వాసంతో అడుగులు ముందుకు వేస్తారు. ఎదుటివారి బాధ్యతలను తీసుకుంటారు. భేషజాలకు వెళ్లరు. 2వవారం నుంచి చలాకీతనం పెరుగును. మాసం మధ్య నుంచి మనశ్శాంతి లభించును. కుటుంబంలో సుఖశాంతులు పరిఢవిల్లును. మార్చి 22 రాత్రి 8.32 నుంచి 24 అర్ధరాత్రి తదుపరి 4.52 వరకు వ్యతిరేకసమయం.

**ఏప్రిల్:** పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. అనవసర విరోధాలు తగ్గిస్తారు. లేనిపోని వ్యవహారాలలో కీలకబాధ్యతలను తీసుకోరు. వివేకంతో ఆదాయమార్గాలను అన్వేషించి లాభం చెందుదురు. విధాన నిర్ణయాలలో లోపాలు కనపడును. స్థిరాస్తులలో జాగ్రత్తలు తీసుకోవాలి. కార్యదీక్షా దక్షత బాధ్యతను పెంచుకుంటారు. సంపాదనలో ముందంజ. మనోనిబ్బరం పెరుగును. అంకితభావానికి పెద్దపీట వేయుదురు. ఏప్రిల్ 18 రా.తె 4.43 నుంచి 21 మధ్యాహ్నం 2.13 వరకు సమయం అనుకూలం కాదు.

**మే :** లోభత్వం ఎక్కువ. శతృబెడద తగ్గును. ఋణప్రయత్నాలు ఫలించును. ప్రతిబంధక సమస్యలు తొలగును. అవివాహితులకు శుభవార్తలున్నవి. ఆలస్య ఒప్పందాలు అనుకోకుండా ఫలిస్తాయి. కృతనిశ్చయం బలంగా ఉండాలి. కాంట్రాక్ట్‌లు, స్పెక్యులేషన్‌లచే స్వల్ప నష్టం. జీవనోపాధి విషయంలో స్థిరత్వం. మే 16 మధ్యాహ్నం 11.34 నుంచి 18 రాత్రి 10.07 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూన్ :** పితృవర్గం వారితో స్వల్ప మనస్పర్థలుండును. ఆర్థికస్థితి ఆశాజనకం. స్పెక్యులేషన్‌లు తప్పుదారి పట్టించును. 3వవారంలో ప్రయాణాలలో జాగ్రత్తలు తీసుకోవాలి. ఆత్మవిశ్వాసం సన్నగిల్లకుండా జాగ్రత్తపడతారు. పాతమిత్రత్వం తిరిగి ప్రారంభం. హామీలచే గౌరవప్రశంసలు. తోబుట్టువులచే నిందలుండవు. ఒప్పందాలచే ఆర్థిక లబ్ధి. విందు వినోదాలలో పాల్గొంటారు. జూన్ 12 సాయంత్రం 5.28 నుంచి 14 రా.తె4.24 వరకు వ్యతిరేక సమయమని గ్రహించి జాగ్రత్తలు తీసుకోవాలి.

**జూలై :** స్వయంవృత్తుల వారికి పూర్తిగా అనుకూలం. కీలకనిర్ణయాలు తీసుకోవటంలో ఆలస్యం చేయరు. శస్త్రచికిత్సకు అవకాశం కలదు. గౌరవ ప్రతిష్ఠలకు భంగం రాదు. సమస్యలకు ఎదురీదతారు. నిర్మాణాత్మక శక్తిని పెంచుదురు. ధర్మకార్యాలు వాయిదా పడును. స్వయంవృత్తుల వారికి లబ్ధి. చివరి వారంలో తొట్రుపాటు నిర్ణయాలతో జాగ్రత్తలవసరం. జూలై 9 రాత్రి 11.23 నుంచి 12 ఉదయం 10.00 వరకు అన్నీ అంశాలలో వ్యతిరేకతలు అవసరం.

**ఆగస్టు :** సజ్జన సహచర్యంచే విజయప్రాప్తి. సంకల్పబలం నెరవేరును. శక్తియుక్తులు, హుందాతనం ప్రదర్శిస్తారు. విజయపంథాలో నడుస్తారు. శుభకార్యబాధ్యతను స్వీకరిస్తారు. స్పెక్యులేషన్ జోలికి వెళ్లరు. ఆర్థిక శతృవిజయాలతో ముందంజ. మాసం మధ్యలో అధిక ఖర్చులు. సాయపడే వారిని గమనించి మసలుకోవాలి. సంతాన అంశాలలో ముందు జాగ్రత్తలు పాటించాలి. పంతాలకు వెళ్లకండి. ఆశలు నిరాశలు కావు. ఆగస్టు 6 ఉదయం 6.08 నుంచి 8 సాయంత్రం 4.13 వరకు ప్రతికూల సమయాలు.

**సెప్టెంబరు :** ప్రణాళికాబద్ధంగా మసులుకుంటారు. నేత్రలోపం ఉందని గ్రహించాలి. జాయింట్ వ్యాపారస్తులకు బాగా అనుకూలం. అకాలభోజనాదులు కలవు. మనోవాంఛలు స్వల్పంగా నెరవేరును. ఉన్నత వ్యక్తుల పరిచయాలతో కార్యసిద్ధి. చంచలత్వం తగ్గును. ప్రతిభకు గుర్తింపు లభించును. సెప్టెంబరు 2 మధ్యాహ్నం 1.58 నుంచి 4 రాత్రి 11.51 వరకు తిరిగి 29 రాత్రి 10.25 నుంచి అక్టోబరు 2 ఉదయం 8.46 వరకు అనుకూల సమయాలు కాదు.

**అక్టోబరు :** మానసిక వత్తిడి తట్టుకుంటారు. స్థిరాస్తి అంశాలలో సరైన నిర్ణయాలుండును. బుద్ధిబలం పెరుగును. రాజీధోరణి ఉండును. మృదు సంభాషణలు అధికము. స్వయంరంగం వారు సహనం పాటించాలి. శుభకార్యాచరణపై ఆసక్తి. ఉద్యోగస్తులకు ఊరట. ప్రతిభకు గుర్తింపు లభించును. మాసాంతంలో మనోనిబ్బరం మాత్రం తగ్గును. ఆచితూచి సంభాషిస్తుంటారు. అక్టోబరు 27 ఉదయం 6.34 నుంచి 29 సాయంత్రం 5.53 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**నవంబరు :** పుణ్యకార్యాచరణం కొరకు సమయం కేటాయింపు. తరచూ నిద్రాభంగములు. మనోవ్యాకులత పెరుగును. ప్రతివిషయంలో అప్రమత్తత అవసరము. వ్యక్తిగత కక్షలను పెంచవద్దు. ఆగ్రహంతో సంభాషించవద్దు. 2వపక్షంలో అధికారుల అండచే విజయప్రాప్తి. నవంబరు 23 మధ్యాహ్నం 1.45 నుంచి 25 రాత్రి 1.56 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**డిశంబరు :** సంతానం ద్వారా విజయప్రాప్తి. స్పెక్యులేషన్ ఆశాజనకం కాదు. అనవసర పైరవీలు చేసి విసుగు చెందుతారు. దైవ కార్యాలపై శ్రద్ధ చూపిస్తారు. రహస్య మంతనాలు వివాదం కాకుండా చూసుకోవాలి. భుజముల తీపు పెరుగును. మిత్రశతృత్వాలు గమనించాలి. ప్రయాణాలలో నూతన పరిచయాలు పెరిగి ఆర్థిక నష్టం. డిశంబరు 20 రాత్రి 8.01 నుంచి 23 ఉదయం 8.27 వరకు వ్యతిరేక సమయం.

## నిత్యం పారాయణకై తిధుల వారీగా శ్రీ లలితా దేవీ అతి రహస్య నామాలు

మత్స్య పురాణంలో 'లక్ష్మీర్మేధా ధరా పుష్టిః గౌరీ తుష్టిః ప్రభా ధృతిః ఏతాభిః పాహి తనుభి రష్టాభిర్మాం సరస్వతీ' అని సరస్వతీ దేవి 8 విధములైన ప్రాణస్వరూపిణిగా చెప్ప బడింది. 'ప్రాణశక్తి సరస్వతీ' అని వేదం చెప్పింది. ఈ ప్రాణశక్తి ప్రపంచమంతా వ్యాపించి 8 విధాలుగా మనల్ని రక్షిస్తున్నది.

సరస్వతి అనే శబ్దానికి ప్రవాహమని అర్ధము. శరీరంలో ప్రతి అణువు నందు ఈ ప్రవాహలక్షణము ప్రసరిస్తుంటుంది. ఇట్టి ప్రాణస్వరూపిణిగా నున్న అష్టమూర్తిత్వంలో లక్ష్మీ అనగా ఐశ్వర్యము సంపద, మేధా అంటే బుద్ధిశక్తి, ధరా అంటే ధరించునది అనగా భూమి. పుష్టి అంటే ఇంద్రియాలకు కావల్సిన శక్తి, గౌరీ అనగా వాక్స్వరూపిణీ, తుష్టి అనగా తృప్తి, ప్రభా అనగా వెలుగు, ధృతి అనగా ధైర్యమని అర్ధములు.

ఈ 8 శక్తులు మానవులకు సహకరించి రక్షిస్తుంటాయి. యోగశాస్త్రం ప్రకారం ఆత్మకు కూడా జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, సిద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ అనబడే ఎనిమిది రూపములున్నవి.

శ్రీచక్రంలో కూడా 8వ ఆవరణంలో అనంగకుసుమ, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ అనే 8 దేవతలుండి రక్షిస్తున్నారు.

బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణి, చాముండీ, మహాలక్ష్మీ అనే అష్టమాతృకా దేవతలు ఉన్నారు. అలాగే కామాక్షీ దేవిని కూడా ధరణిమయీ, భరణిమయీ, పవనమయీ, గగనమయీ, దహనమయీ, హవనమయీ, అంబుమయీ, ఇందుమయీ అనే 8 రూపాలలో ప్రార్థిస్తుంటాం.

దక్షిణామూర్తి స్తోత్రంలో భవ శర్వ ఈశాన పశుపతి రుద్ర ఉగ్ర భీమ మహాదేవ అనే 8పేర్లను అష్టమూర్తులుగా తెలియజేశారు. అష్టమూర్తులకు సంబంధించిన శక్తి అమ్మవార్లే భవాని శర్వాణి ఈశాని పశుపాశవిమోచని రుద్రాణి ఉగ్రాణి భీమాణి మహాదేవీ అను 8 శివుని యొక్క శక్తులు. ప్రత్యక్షంగా మనం అర్థం చేసుకుంటే ఈ 8 అంకెలో ఉన్నటువంటిదంతా సాక్షాత్తు శక్తి స్వరూపిణి అయిన జగన్మాతే అని స్పష్టము.

శుక్లపక్షంలోని పాడ్యమి నుంచి పూర్ణిమ వరకు నిత్యం చంద్రుడు క్రమ క్రమంగా పెరుగుతూ తిరిగి కృష్ణపక్షంలోని పాడ్యమి నుంచి అమావాస్య వరకు చంద్రుడు క్రమక్రమంగా క్షీణిస్తూ ఉండటం అందరికీ తెలిసిందే. మాసం 30 తిథులలో... ఒక్కోతిథి నాడు ఒక్కొక్క కళతో జగన్మాత ప్రకాశిస్తూ నిత్యా దేవతగా ఆరాధింపబడుతుంటుంది.

శుక్లపక్ష పాడ్యమి నుంచి దేవీకళ మొదలై కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహా వజ్రేశ్వరీ, శివదూతీ, త్వరితా, కులసుందరీ, నిత్యా, నీలపతాకా, విజయా, సర్వమంగళా, జ్వాలామాలినీ, చిత్రా అనే 15 నిత్యదేవతలు ఆరాధింపబడుతుంటారు. అలాగే కృష్ణపక్షంలో వెనుక నుంచి వరుసగా చిత్రా, జ్వాలామాలినీ, సర్వమంగళా, విజయా, నీలపతాకా, నిత్యా, కులసుందరీ, త్వరితా, శివదూతీ, మహావజ్రేశ్వరీ, వహ్నివాసినీ, భేరుండా, నిత్యక్లిన్నా, భగమాలినీ, కామేశ్వరీ నిత్యతిథి దేవతలుగా చంద్రకళలు ఉంటాయి.

శుక్లపక్షంలో వచ్చే 15 దేవతలలో 8వ(శుక్లఅష్టమికి) నిత్యా దేవత త్వరితా. కృష్ణపక్షంలో 8వ(బహుళ అష్టమి) నిత్యాదేవత త్వరితా. మిగిలిన అన్నీ తిథులకు వేరు వేరు నిత్యాదేవతలు ఉంటారు. శుక్ల అష్టమి,బహుళ అష్టమి తిథులలో మాత్రం త్వరితా మాత్రమే ఉండును. అష్టమితిథి నాడు తిథి దేవత మారదు. ఈ 8వ చంద్రకళకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది.

అందుకే 'అష్టమీచంద్రవిభ్రాజదలికస్థలశోభితా' అను శ్రీ లలితా సహస్రనామావళిలోని 15వ నామంలో 8వ తిథి అయిన అష్టమి నాడు ప్రకాశించు చంద్రుని కళవలె ప్రకాశించు తల్లి అని భావము. అష్టమంటే భయపడతారు. అష్టమి ప్రశస్తమైనదని చాలామందికి తెలియదు. ప్రశస్తమైన ఈ 8 అక్షరాలతో కలిసిన 240 నామాలు శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రంలో ఉన్నాయి. ఇవి అతి రహస్య నామాలు. వీటికి ముందు ఓం బీజాక్షరాన్ని, చివరన నమఃను కలుపుతాము. ఇలా కలిపే సందర్భంలో కొన్ని నామాలు సంధితో కలిపి నప్పుడు 9 అక్షరాలుగా వస్తాయి. కానీ వాస్తవానికి నామానికి ఉన్న అక్షరాలు మాత్రం 8 గానే భావించాలి.

కనుక ప్రతిమాసంలో శుక్ల పాడ్యమి నుంచి అమావాస్య వరకు ప్రతిరోజు సాయంత్రం సూర్యాస్తమయం తదుపరి 2 గంటలు వరకు( అనగా 5 ఘడియలు). దిగువ తెల్పిన నిత్య తిథిదేవత నామాలను పారాయణం చేసేది. మొత్తం 240 నామాలను 15 మంది దేవతలకు విభజించగా, ఒక్కో దేవతకు 16 నామాలు వచ్చును. కనుక ఈ క్రింది పట్టికలో ఇచ్చిన రీతిగా ఏయే తిథులలో ఏయే దేవతలో తెలుసుకోవచ్చు.

| నిత్యతిథి దేవత | తిథులు |
|---|---|
| కామేశ్వరీ | శుక్ల పాడ్యమి / అమావాస్య |
| భగమాలినీ | శుక్ల విదియ /బహుళ చతుర్దశి |
| నిత్యక్లిన్నా | శుక్లతదియ/బహుళ త్రయోదశి |
| భేరుండా | శుక్ల చవితి/ బహుళ ద్వాదశి |
| వహ్నివాసినీ | శుక్లపంచమి/ బహుళ ఏకాదశి |
| మహావజ్రేశ్వరీ | శుక్ల షష్ఠి / బహుళ దశమి |
| శివదూతీ | శుక్ల సప్తమి / బహుళ నవమి |
| త్వరితా | శుక్ల అష్టమి / బహుళ అష్టమి |
| కులసుందరీ | శుక్ల నవమి / బహుళ సప్తమి |
| నిత్యా | శుక్ల దశమి / బహుళ షష్ఠి |
| నీలపతాకా | శుక్ల ఏకాదశి/బహుళ పంచమి |
| విజయా | శుక్ల ద్వాదశి / బహుళ చవితి |
| సర్వమంగళా | శుక్లత్రయోదశి/బహుళ తదియ |
| జ్వాలామాలినీ | శుక్ల చతుర్దశి / బహుళ విదియ |
| చిత్రా | పూర్ణిమ / బహుళ పాడ్యమి |

మార్చి

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్‌కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిమిడీస్ కేలండర్

పంచాంగకర్త:
శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర చైత్రమాస శుక్ల పంచమి శనివారం నుంచి వైశాఖమాస శుక్ల పంచమి ఆదివారం వరకు

# 2017 APRIL ఏప్రిల్

ఈ నెలలో గురువు కన్యారాశిలోనే వక్రంతో ఉండి, ధనస్సు రాశి నుంచి వక్ర శనిచేత వీక్షించబడటం జరిగింది. పూర్తి వివరాలకై క్లిక్ చేయండి. www.gargeyam.com

| Day | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము:సా4.39-5.28<br>రా.కా: సా4.30-6.00 | **30**<br>శు.పంచమిరా12.49<br>మృగశిర ఉ8.33<br>వ.సా4.17-5.45 | **2**<br>శు.షష్ఠి మ3.16<br>మృగశిర రా1.14<br>వ.ఉ8.07-9.36 | **9**<br>శు.త్రయోదశి ఉ9.29<br>ఉత్తర రా1.54<br>వ.ఉ8.09-9.51 | **16**<br>బ.పంచమి రా10.15<br>జ్యేష్ఠ సా4.39<br>వ.రా1.37-3.25 | **23**<br>బ.ద్వాదశి రా2.26<br>పూర్వాభాద్ర రా1.40<br>వ.ఉ8.43-10.15 |
| MON సోమ<br>దుర్ము:<br>మ12.35-1.24<br>మ3.01-3.50<br>రా.కా: ఉ7.30-9.00 | | **3**<br>శు.సప్తమి మ1.05<br>ఆర్ద్ర రా12.00<br>వ.ఉ9.12-10.43 | **10**<br>శు.చతుర్దశి ఉ10.22<br>హస్త రా3.38<br>వ.ఉ10.54-12.37 | **17**<br>బ.షష్ఠి రా12.36<br>మూల రా7.33<br>వ.సా5.45-7.33 | **24**<br>బ.త్రయోదశి రా12.04<br>ఉత్తరాభాద్ర రా12.05<br>వ.ఉ10.38-12.08 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.30-9.19<br>రా10.59-11.46<br>రా.కా: మ3.00-4.30 | | **4**<br>శు.అష్టమి మ11.20<br>పునర్వసు రా11.12<br>వ.మ11.36-1.09 | **11** ○<br>చైత్రపూర్ణిమ మ11.37<br>చిత్ర తె5.42<br>వ.మ12.19-2.03 | **18**<br>బ.సప్తమి రా2.37<br>పూర్వాషాఢరా10.11<br>వ.ఉ6.12-7.59 | **25**<br>బ.చతుర్దశి రా9.08<br>రేవతి రా9.55<br>వ.మ11.00-12.28 |
| WED బుధ<br>దుర్ము:మ11.45-12.34<br>రా.కా:<br>మ12.00-1.30 | | **5**<br>శు.నవమి ఉ10.03<br>పుష్యమి రా10.52<br>వ.ఉ7.05-8.40 | **12**<br>బ.పాడ్యమి మ1.14<br>స్వాతి పూర్తిగా<br>వ.మ11.51-12.37 | **19**<br>బ.అష్టమి తె4.06<br>ఉత్తరాషాఢ రా12.20<br>వ.ఉ6.54-8.39<br>వ.తె4.36 లగాయితు | **●26**<br>చైత్రఅమావాస్యసా5.45<br>అశ్వని రా7.20<br>వ.మ3.46-5.11<br>వ.రా3.48-5.13 |
| THU గురు<br>దుర్ము:ఉ10.07-10.56<br>మ3.01-3.50<br>రా.కా:మ1.30-3.00 | | **6**<br>శు.దశమి ఉ9.15<br>ఆశ్లేష రా11.00<br>వ.మ11.45-1.21 | **13**<br>బ.విదియ మ3.10<br>స్వాతి ఉ8.06<br>వ.మ2.19-4.06 | **20**<br>బ.నవమి తె4.54<br>శ్రవణం రా1.51<br>శేషవర్జ్యం ఉ6.18వరకు | **27**<br>వైశాఖమాసప్రారంభం<br>శు.పాడ్యమి మ2.09<br>భరణి సా4.31<br>వ.రా3.05-4.30 |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.28-9.17<br>మ12.34-1.23<br>రా.కా:ఉ10.30-12.00 | | **7**<br>శు.ఏకాదశి ఉ8.54<br>మఘ రా11.34<br>వ.మ11.17-12.56 | **14**<br>బ.తదియ సా5.23<br>విశాఖ ఉ10.47<br>వ.మ3.16-5.03 | **21**<br>బ.దశమి తె4.54<br>ధనిష్ఠ రా2.36<br>వ.ఉ5.59-7.38 | **28**<br>శు.విదియ ఉ10.29<br>కృత్తిక మ1.39<br>వ.రా3.51-5.16 |
| SAT శని<br>దుర్ము:ఉ6.05-7.43<br>రా.కా:ఉ9.00-10.30 | **1**<br>శు.పంచమి సా5.49<br>రోహిణి రా2.54<br>వ.రా7.34-9.02 | **8**<br>శు.ద్వాదశి ఉ9.00<br>పుబ్బ రా12.33<br>వ.ఉ7.54-9.34 | **15**<br>బ.చవితి రా7.48<br>అనూరాధ మ1.40<br>వ.రా7.58-9.46 | **22**<br>బ.ఏకాదశి తె4.04<br>శతభిషం రా2.32<br>వ.ఉ9.47-11.23 | **29**<br>శు.తదియ ఉ6.55<br>శు.చవితి రా3.39<br>రోహిణి ఉ10.57<br>వ.మ3.59-5.26 |

### పండుగలు

1. శాలిహోత్రహయ5మి, శ్రీవ్రతం,కూర్మకల్పాది
2. రమణమహర్షిజయంతి యమునాజయంతి(మధుర) భానుషష్ఠి
4. శ్రీరామనవమి అశోకాష్టమి
5. శ్రీరామజయంతి భద్రాద్రిలో కల్యాణం
6. ధర్మరాజదశమి
7. కామదాఏకాదశి
8. వామనద్వాదశి శనిత్రయోదశిప్రదోషం అనంగత్రయోదశి (పూర్వవిద్ధ గ్రాహ్య)
9. మహావీరజయంతి ఒంటిమిట్ట రామకల్యాణం
10. హనుమద్విజయోత్సవం
11. మహాచైత్రి
14. మేషసంక్రాంతి, విషు(కేరళ), గుడ్‌ఫ్రైడే తమిళసంవత్సరాది, సంకష్టహరచతుర్థి
16. ఈస్టర్‌సండే
22. వరూధినీఏకాదశి
25. వరాహజయంతి మాసశివరాత్రి కృష్ణఅంగారక చతుర్దశి
27. వైశాఖచంద్రోదయం
28. త్రేతాయుగాది అక్షయతదియ, పరశురామజయంతి షాబాన్‌నెలప్రారంభం సింహాచల చందనోత్సవం
30. శ్రీ శంకరజయంతి

### ఏప్రిల్ శుభసమయములు

శ్రీ హేమలంబ చైత్రమాసము

| తేదీ | వివరము |
|---|---|
| 01 | శని శు.పంచమి రోహిణి ఉ8.32-12.45 |
| 01 | శని శు.షష్ఠి రోహిణి రా9.18-11.32 |
| 02 | ఆది శు.షష్ఠి మృగశిర ఉ9.37-12.41 |
| 02 | ఆది శు.సప్తమి మృగశిర రా11.28-1.14 |
| 05 | బుధ శు.దశమి పుష్యమి ఉ10.17-11.44 |
| 05 | బుధ శు.దశమి పుష్యమి రా9.02-10.52 |
| 07 | శుక్ర శు.ఏకాదశి మఘ ఉ8.08-8.27 |
| 07 | శుక్ర శు.ద్వాదశి మఘ ఉ9.18-11.16 |
| 07 | శుక్ర శు.ద్వాదశి మఘ రా8.54-11.08 |
| 09 | ఆది శు.చతుర్దశి ఉత్తర రా9.52-2.25 |
| 09 | ఆది శు.చతుర్దశి ఉత్తర రా8.46-11.00 |
| 10 | సోమ శు.చతుర్దశి హస్త ఉ7.56-10.22 |
| 10 | సోమ పూర్ణిమ హస్త ఉ10.23 -10.53 |
| 10 | సోమ పూర్ణిమ హస్త సా6.32-10.56 |
| 12 | బుధ బ.పాడ్యమి స్వాతి ఉ7.50-11.42 |
| 12 | బుధ బ.విదియ స్వాతి రా8.35-10.49 |
| 14 | శుక్ర బ.తదియ అనూరాధ ఉ10.48-12.31 |
| 15 | శని బ.చవితి అనూరాధ ఉ9.39-మ1.40 |
| 16 | ఆది బ.పంచమి మూల రా8.20-10.34 |
| 17 | సోమ బ.షష్ఠి మూల ఉ9.32-మ12.31 |
| 19 | బుధబ.అష్టమి ఉత్తరాషాఢ మ11.35-1.47 |
| 19 | బుధ బ.అష్టమిఉత్తరాషాఢ రా8.08-10.22 |
| 20 | గురు బ.నవమి శ్రవణం మ11.31-1.43 |
| 20 | గురు బ.నవమి శ్రవణం రా8.04-10.18 |
| 21 | శుక్ర బ.దశమి ధనిష్ఠ మ11.27-12.30 |
| 21 | శుక్ర బ.దశమి ధనిష్ఠ రా8.00-10.14 |
| 22 | శని బ.ఏకాదశి శతభిషంఉ9.11-9.46 |
| 22 | శని బ.ఏకాదశి శతభిషం రా7.56-10.10 |
| | శ్రీ హేమలంబ వైశాఖమాసము |
| 28 | శుక్ర శు.తదియ రోహిణి రా7.32-9.46 |
| 29 | శని శు.చవితి రోహిణి ఉ8.43-10.55 |
| 29 | శని శు.చవితి మృగశిర ఉ10.58-మ1.07 |
| 29 | శని శు.చవితి మృగశిరరా7.28-9.42 |

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## సభలో ఒకలా, బయట మరొకలా ప్రవర్తించే పండితులు

ఈ మార్చి 28 నుంచి ప్రారంభమైన శ్రీ హేమలంబ సంవత్సర విషయమై జగద్గురువులు, శ్రీ కంచి పీఠాధీశ్వరుల సమక్షంలో 2016 ఆగస్టు 9న విజయవాడలో జరిగిన పంచాంగ పండిత సదస్సులో తమిళ తెలుగు ప్రాంతాలకు చెందిన పూర్వపద్ధతి, దృక్పద్ధతి పంచాంగకర్తలు కొంతమంది పాల్గొన్నారు. ఇందులో తిరుమల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి గారు కూడా పాల్గొన్నారు. ఈ సభలో జరిగిన నిర్ణయములన్నింటికీ రెండు గణిత పంచాంగకర్తలు ఆమోదం తెలిపారు. కానీ బయటకు వచ్చి వారి ఇష్టమైన రీతిలో పంచాంగాలు అచ్చు వేస్తున్నారు.

సభా మర్యాద తెలియని వారు ఇటువంటి సభలకు ఎందుకు రావాలి ? సభలో ఉగాది విషయము, సంవత్సర పేరు విషయము, మహాశివరాత్రి విషయాలలో చర్చ జరిగినప్పుడు సరైన ఆధారమివ్వకుండా సభలో చెప్పిన నిర్ణయాన్ని ఒప్పుకున్నట్లుగా సమాధానం లేక మౌనం వహించి, బయటకొచ్చి వారి ఇష్టానురీతిగా పంచాంగ ముద్రణకు గణితం ఇవ్వటం సభా మర్యాద కానేకాదు. ఆ సభలో ప్రస్తుత తెలుగు సంవత్సరం 'హేమలంబ' అని నిర్ణయించగా, ఒప్పుకుని, తద్విరుద్ధంగా హేమలంబి అని ముద్రణకు తిరుమల సిద్ధాంతి గారు ఇచ్చారు.

అంతేకాక సభలో ఉగాది 2017 మార్చి 28 నిర్ణయించగా, తిరుమల సిద్ధాంతి గారు 2017 మార్చి 29గా ముద్రణచేయించారు. అలాగే 2018 ఫిబ్రవరి 14 మహాశివరాత్రిగా సభలో నిర్ణయించారు. దానికి కూడా తిరుమల సిద్ధాంతి గారు ఒప్పుకుని, తద్విరుద్ధంగా 2018 మార్చి 13 అని ముద్రణ చేయించారు. **తిరుమల సిద్ధాంతి గారిని గ్రహణ గణితమడిగితే, తమ పద్ధతి ప్రకారం చేస్తే ఎలా వస్తుందో తెలియదండి, అందుకే కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ నుండి డౌన్‌లోడ్ చేసి తెచ్చామని చెప్పారు. సభా ప్రారంభం నుండి అంత్యం వరకు జరిగిన సంభాషణ పూర్తిగా రికార్డు చేయటం జరిగినది.** తిథులలో గంటలకొద్దీ, పండుగలలో మరిన్ని తేడాలతో ముద్రణకు ఇస్తున్న ఈ తిరుమల దేవస్థాన పంచాంగకర్తలు మాత్రం సరిక్రొత్త పంథాలో వ్యవహరిస్తున్నారు. ఏమంటే గ్రహణం అందరికీ కనపడుతుందని కాబోలు దృక్ ప్రకారమే వేశారు. వారి గణితంలో గ్రహణాల కాలం ఎలా వచ్చిందో? లోగుట్టు పెరుమాళ్లకే ఎరుక.

గత సర్వజిత్ ఉగాది తేదీ నిర్ణయంలో నలుగురు ఐఎఎస్ ఆఫీసర్ల (శ్రీ కె.వి.రమణాచారి, శ్రీ.పి.వి.ఆర్.కె.ప్రసాద్, శ్రీ ఐ.వి.సుబ్బారావు, శ్రీ సుందరకుమార్ గార్లు) ముందు, దృక్ పంచాంగకర్తలతో, ఆనాటి తిరుమల పంచాంగకర్త గారు కూర్చుని ఖచ్చిత ప్రత్యక్ష ఋజువులను చూపించలేక దృగ్గణిత తేదీ నిర్ణయానికే బద్ధుడైనానని సంతకం చేయటం జరిగింది. కనుక పాఠకులు ఇది గమనించి ప్రామాణికం గల దృగ్గణిత పంచాంగాలనే విశ్వసించండి.



# కర్కాటకరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:8, వ్యయం:11, రాజ్యపూజ్యం:3, అవమానం: 3

శ్రీ హేమలంబ : ఆదాయం:14, వ్యయం:2, రాజ్యపూజ్యం:6, అవమానం: 6

**జనవరి :** కృషికి తగిన ఫలితమధికము. విశేష వ్యక్తుల పరిచయాలచే లబ్ధి. విమర్శలు, ఆరోపణలుండవు. దైవకార్యాచరణపై ఆసక్తి మెండు. కుటుంబ నిర్ణయాలు ఫలించును. ఆదాయానికి గండి పడదు. వాస్తవ అంశాలలో గోప్యత పాటిస్తారు. స్వల్ప ఆరోగ్య భంగములు. స్వార్థబుద్ధిని తగ్గించి ఆదాయం పెంచుదురు. జనవరి 1 అర్ధరాత్రి తదుపరి 4.26 నుంచి 4 మధ్యాహ్నం 11.15 వరకు తిరిగి 29 ఉదయం 10.51 నుంచి 31 సాయంత్రం 4.50 వరకు అనుకూల సమయం కాదు.

**ఫిబ్రవరి :** సజ్జన సహచర్యం కలదు. స్వయంరంగాల వారికి సానుభూతి. శుభ కార్యాచరణకు సంకేతాలు. ప్రణాళికలో నూతన మార్పులుండును. సంకల్పబలం నెరవేరును. స్పెక్యులేషన్ దారితప్పును. జాయింటు వ్యాపార నిర్ణయాలు వాయిదా పడును. సంతాన అవాంతరములు ఉండవు. స్థానచలన ఆశలలో నిరాశలున్నవి. ఫిబ్రవరి 25 రాత్రి 7.13 నుంచి 27 రాత్రి 12.10 వరకు ప్రతికూలమని గమనించాలి.

**మార్చి :** ఆందోళన భయం ఉండదు. కార్యబాధ్యతలు సజావుగా సాగును. శక్తి యుక్తులతో కార్యసిద్ధి. శాంత స్వభావంతో అనుకూలతలు. స్పెక్యులేషన్‌చే రాణింపు. భాగస్వామ్యులకు ఆశాజనకం. స్థిరాస్తి అంశాలలో అనుకూల నిర్ణయాలు ఉండును. స్త్రీలకు శుభకరం. న్యాయసలహాలకై సమయం కేటాయింపు. సోమరితనం వ్యాప్తి హెచ్చు. మార్చి 24 అర్ధరాత్రి తదుపరి 4.52 నుంచి 27 ఉదయం 9.37 వరకు వ్యతిరేక సమయమని గమనించాలి.

**ఏప్రిల్ :** వృత్తిరీత్యా ఉన్నతులు పొందుదురు. శుభకర చర్చలు కలిసివస్తాయి. ఆత్మ పరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. స్పెక్యులేషన్ సాధారణం. నిర్భీతిగా వ్యవహరిస్తారు. ఋణదాతల వత్తిడి అధికం. వివాద అంశాలు కనుమరుగు. వాహన మరమ్మత్తులకై ధనవ్యయం. మనోనిబ్బరం పాటిస్తారు. వృధా ప్రయాణాలు మెండు. ఏప్రిల్ 21 మధ్యాహ్నం 2.13 నుంచి 23 రాత్రి 7.53 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** భూలావాదేవీలు ఫలించును. కార్యసిద్ధికై ఆటంకాలు ఉండవు. రోగబాధలు ఉప శమించును. దూరప్రయాణాలు రద్దగును. నిదానంతో నిర్ణయాలు తీసుకుంటారు. బుద్ధిబలం పెరుగును. మానసిక వత్తిడి తగ్గును. మార్పులకై అన్వేషిస్తారు. పాతమిత్రత్వం కోరుకుంటారు. ప్రత్యేక ప్రతిపత్తిని ఆశిస్తారు. ప్రతిబంధక సమస్యలకు పరిష్కారాలు కనపడును. మిత్రశతృత్వాలు గమనిస్తారు. శుభకార్యాచరణకు సమయం కేటాయింపు. మే 18 రాత్రి 10.07 నుంచి 20 రా.తె 5.15 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూన్ :** ముఖ్యవ్యక్తికి ప్రాధాన్యత ఇవ్వలేరు. ఆర్థిక విషయాలలో హామీలు వద్దు. ప్రయాణంలో సమయం వృధా. వ్యక్తిగత విమర్శలు తట్టుకుంటారు. మాటల ధోరణిలో మార్పులుండును. కీలక నిర్ణయాలలో పైచేయిగా ఉంటారు. మనోసంకటాలపై పోరాటం వద్దు. సునాయాస ప్రయత్నాలు కూడా మాసాంతంలో కఠినమగును. జూన్ 14 రా.తె 4.24 నుంచి 17 మధ్యాహ్నం 12.41 వరకు ముఖ్య అంశాలకు ప్రాధాన్యత ఇవ్వవద్దు.

**జూలై :** వృత్తి, ఉద్యోగ, వ్యాపారాదులలో లోపాలు సరిచేసుకోవాలి. స్పెక్యులేషన్ తగ్గిస్తారు. విసుగును, కోపాన్ని తగ్గించుకోవాలి. శరీర తేజస్సు తగ్గును. అవివాహితులకు అనుకూల సమయం. సంతానసౌఖ్యం లాభించును. భూ గృహ ధన అంశాలలో విజయలబ్ధి. మాసం మధ్యలో అనవసర కలహాలు. తరచూ శతృత్వాలు ఎదురగును. సాహసప్రయత్నాలు వద్దు. కీలకనిర్ణయాలలో అసత్యాలు వద్దు. జూలై 12 ఉదయం 10.00 నుంచి 14 సాయంత్రం 6.30 వరకు వ్యతిరేక సమయం.

**ఆగస్టు :** ఉద్యోగ నిర్ణయాలలో స్వల్ప ఆటంకాలు. అలౌకిక విషయాలపై ఆసక్తి మెండు. అవివాహితులకు అనుకూలం. మానసిక చింతన తగ్గిస్తారు. స్పెక్యులేషన్ స్వల్పంగా రాణింపు. శుభచర్చలలో సానుకూలం. తెరచాటు నిర్ణయాలు సఫలం కావు. ఋణాల వత్తిడి తగ్గును. కుటుంబ అన్యోన్యత పెరుగును. కార్యభారాన్ని మోస్తారు. ప్రశంసలకు, ఆర్భాటాలకు ప్రాధాన్యత వద్దు. ఆగస్టు 8 సాయంత్రం 4.13 నుంచి 10 రాత్రి 12.06 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**సెప్టెంబరు :** వైరాగ్యపు ధోరణితో సంభాషించవద్దు. స్థిరాస్తి నిర్ణయాలు నిదానంగా చర్చించండి. హడావుడి నిర్ణయాలు కార్యరూపం దాల్చవు. బంధువులతో ప్రీతిగా మాట్లాడండి. నిద్రాసౌఖ్యం ఉండదు. శరీరానికి వైద్యసేవలవసరం. స్పెక్యులేషన్ వద్దు. పిత్రార్జిత సమస్యలు ఓ కొలిక్కి వచ్చును. సోదరమైత్రి పెరుగును. జ్ఞాపకశక్తి పెంచాలి. ఆందోళన, భయం తగ్గును. ఋణవిముక్తికి మార్గం సుగమం. సెప్టెంబరు 4 రాత్రి 11.51 నుంచి 7 ఉదయం 6.57 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**అక్టోబరు :** ప్రతిబంధక సమస్యలచే శారీరకంగా అలసట చెందుదురు. 2వ వారంలో వాగ్దాన భంగములు. 3వ వారంలో నూతన అంశాలకు తెరతీయవద్దు. మాతృ వర్గీయులచే ఆర్థిక ప్రాప్తి. వివాద అంశాలు సమసిపోవును. సంతాన, కుటుంబ సఖ్యతతో మానసికోల్లాసం. విందు, వినోదాలతో సమయం గడుపుతారు. అక్టోబరు 2 ఉదయం 8.46 నుంచి 4 మధ్యాహ్నం 3.43 వరకు తిరిగి 29 సాయంత్రం 5.53 నుంచి 31 రాత్రి 1.40 వరకు ఆవేశాలకు లోనుకాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**నవంబరు :** స్వయంవృత్తుల వారికి కార్యసిద్ధి. జీవనస్థితిపై మార్పులుండును. హామీ సంతకాలలో లోపాలు తలెత్తును. చలాకీతనం తగ్గును. నిర్వహణ బాధ్యతలో లోపాలుండును. ఆరోగ్య నిర్ణయాలు తీసుకుంటారు. కుటుంబ వ్యవహారాలలో ఇతరుల జోక్యం ఉండును. మనోనిబ్బరం ఉండును. కోపం, నైరాశ్యం తగ్గును. నవంబరు 25 రాత్రి 1.56 నుంచి 28 మధ్యాహ్నం 11.10 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**డిశంబరు :** శతృవర్గ వైషమ్యాల ప్రభావం తగ్గును. స్వీయకల్పనాశక్తి పెరుగును. సంతానంచే శుభవార్తలు. మిత్రుత్వ సంభాషణలచే లబ్ధి. వ్యూహాత్మక ఆలోచనలు ఫలించును. ముఖ్య ఒప్పందాలు బుద్ధిబలంతో ఫలించును. అసత్యాలతో కార్యసిద్ధి జరగదని గుర్తిస్తారు. హాస్యవచనాలు వద్దు. వృత్తి ఉద్యోగాలలో శుభవార్తలు. డిశంబరు 23 ఉదయం 8.27 నుంచి 25 సాయంత్రం 6.48 వరకు ప్రతికూల సమయములు.

## శుక్ల పాడ్యమి అమావాస్య తిథులలో 'కామేశ్వరి' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత ఎరుపు మాణిక్యం పొదిగిన కిరీటాన్ని ధరించి, ఎరుపు వస్త్రాలతో కుడికాలు మడిచి, ఎడమకాలు జారవిడిచి పీఠంపై ఆసీనురాలై మూడు కన్నులు, ఆరు చేతులు, శిరస్సుపై చంద్రవంకను కల్గి చిరుమందహాసంతో ఉండును. చెరకు విల్లు, పుష్పబాణాలు, పాశము, అంకుశము, తేనెతో నింపిన బంగారుపాత్ర, వరముద్రను కల్గి ముంజేతికి మెడకు నడుముకు స్వర్ణాభరణాలు ధరించి ఉండును.

సంపద సంతోషాలకు, మానసిక శాంతి కొరకు, కుటుంబ సఖ్యత అభివృద్ధి దిశలో ఉండుటకు, సమంజస మైన కోరికలు తీరుటకై ప్రతి నెలలో వచ్చే శుక్ల పాడ్యమి, అమావాస్య తిథులలో సాయంత్ర సమయాలలో శ్రీలలితాదేవిలోకామేశ్వరీ దేవతను భావిస్తూ ఆరాధించేది.

| | |
|---|---|
| ఓం శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః | (03) |
| ఓం చిదగ్నికుండసమ్భూతాయై నమః | (04) |
| ఓం దేవకార్యసముద్యతాయై నమః | (05) |
| ఓం ఉద్యద్భానుసహస్రాభాయై నమః | (06) |
| ఓం చతుర్బాహుసమన్వితాయై నమః | (07) |
| ఓం రాగస్వరూపపాశాఢ్యాయై నమః | (08) |
| ఓం క్రోధాకారాంకుశోజ్జ్వలాయై నమః | (09) |
| ఓం మనోరూపేక్షుకోదండాయై నమః | (10) |
| ఓం పంచతన్మాత్రసాయకాయై నమః | (11) |
| ఓం మరాళీమందగమనాయై నమః | (47) |
| ఓం మహాలావణ్యశేవధయే నమః | (48) |
| ఓం సర్వాభరణభూషితాయై నమః | (51) |
| ఓం శివకామేశ్వరాంకస్థాయై నమః | (52) |
| ఓం సుమేరుమధ్యశృంగస్థాయై నమః | (55) |
| ఓం శ్రీమన్నగరనాయికాయై నమః | (56) |
| ఓం చింతామణిగృహాంతస్థాయై నమః | (57) |

## శుక్ల విదియ, బహుళ చతుర్దశి తిథులలో 'భగమాలినీ' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత ఎరుపు వర్ణ దుస్తులు ధరించి, చిరునగు మోముతో ఉన్న సౌందర్యవతి. కుడికాలు మడిచి, ఎడమ కాలు కిందకిఉంచి పద్మంపై ఆసీనురాలై మూడు కన్నులు, ఆరు చేతులు కల్గి ఉండును. అంకుశము, పద్మము, పాశము, చెరకుగడ విల్లు, రాత్రి వికసించే లిల్లీ పుష్పము, పుష్పబాణాలు చేతులలో ధరించి ఉండును.

శతృజయానికి కావాల్సిన శక్తి పొందుటకు, పదిమందిలో ఆకర్షణ శక్తికి, గర్భవతుల పిండసంరక్షణకు తగిన తోడ్పాటుకై, దంపతులు సంతాన భాగ్యముల కొరకు ప్రతి నెలలో వచ్చే శుక్ల విదియ, బహుళ చతుర్దశి తిథులలో సాయంత్ర సమయా లలో శ్రీ లలితాదేవిలో భగమాలినీ దేవతను భావిస్తూ, ఈ క్రింది నామాలతో ఆరాధించాలి.

| | |
|---|---|
| ఓం పంచబ్రహ్మాసనస్థితాయై నమః | (58) |
| ఓం మహాపద్మాటవీసంస్థాయై నమః | (59) |
| ఓం కదంబవాసిన్యై నమః | (60) |
| ఓం సుధాసాగరమధ్యస్థాయై నమః | (61) |
| ఓం కుళామృతైకరసికాయై నమః | (90) |
| ఓం కులసంకేతపాలిన్యై నమః | (91) |
| ఓం సమయాచారతత్పరాయై నమః | (98) |
| ఓం మూలాధారైకనిలయాయై నమః | (99) |
| ఓం బ్రహ్మగ్రంథివిభేదిన్యై నమః | (100) |
| ఓం మణిపూరాంతరుదితాయై నమః | (101) |
| ఓం విష్ణుగ్రంథివిభేదిన్యై నమః | (102) |
| ఓం ఆజ్ఞాచక్రాంతరాళస్థాయై నమః | (103) |
| ఓం రుద్రగ్రంథివిభేదిన్యై నమః | (104) |
| ఓం సహస్రారాంబుజారూఢాయై నమః | (105) |
| ఓం సుధాసారాభివర్షిణ్యై నమః | (106) |
| ఓం తటిల్లతాసమరుచ్యై నమః | (107) |

## శుక్ల తదియ, బహుళ త్రయోదశి తిథులలో 'నిత్యక్లిన్నా' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత ఎరుపు వర్ణ మేనిఛాయ కల్గి, ఎర్రచందన లేపనము శరీరమునకు పూసుకుని, మూడు కన్నులు నాల్గు చేతులతో ఎరుపుదుస్తులను ధరించి నుదుటిపైన అర్ధచంద్రాకార చంద్రబింబమును కల్గి ఉండును. ఓ చేతిలో పాయసపాత్ర కల్గి, పాశము, అంకుశాలతో పాటు అభయహస్తంతో ఉండును.

కుటుంబ సభ్యులలో ఒక్కొక్కరి మధ్య ప్రేమాను రాగాలు పరిఢవిల్లి, ఆత్మీయత అనురాగాలతో పాటు కుటుంబంలో కలహాలు లేకుండా ఉండుటకై ప్రతినెలలో వచ్చే శుక్ల తదియ, బహుళ త్రయోదశి తిథులలో వచ్చే సాయంత్ర సమయాలలో శ్రీలలితా పరమేశ్వరిలో నిత్యక్లిన్నా దేవతను భావిస్తూ, భక్తి విశ్వాసాలు కల్గి ఈ క్రింది నామాలతో ఆ దేవిని ఆరాధించాలి.

| | |
|---|---|
| ఓం షట్చక్రోపరిసంస్థితాయై నమః | (108) |
| ఓం బిసతంతుతనీయస్యై నమః | (111) |
| ఓం భవారణ్యకుఠారికాయై నమః | (114) |
| ఓం భక్తసౌభాగ్యదాయిన్యై నమః | (117) |
| ఓం శరచ్చంద్రనిభాననాయై నమః | (129) |
| ఓం సమానాధికవర్జితాయై నమః | (198) |
| ఓం సర్వమంత్రస్వరూపిణ్యై నమః | (204) |
| ఓం మహాపాతకనాశిన్యై నమః | (214) |
| ఓం మహాయోగీశ్వరేశ్వర్యై నమః | (225) |
| ఓం మహాయాగక్రమారాధ్యాయై నమః | (230) |
| ఓం మహాభైరవపూజితాయై నమః | (231) |
| ఓం మహాకామేశమహిష్యై నమః | (233) |
| ఓం మహాత్రిపురసుందర్యై నమః | (234) |
| ఓం చతుష్షష్ట్యుపచారాఢ్యాయై నమః | (235) |
| ఓం చతుష్షష్టికళామయ్యై నమః | (236) |
| ఓం చంద్రమండలమధ్యగాయై నమః | (240) |

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్ కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

పంచాంగకర్త:

శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర వైశాఖమాస శుక్ల షష్ఠి సోమవారం నుంచి జ్యేష్ఠమాస శుక్ల షష్ఠి బుధవారం వరకు

# 2017 MAY మే

ఈ మే నెలలో కూడా ధనస్సురాశి నుంచి వక్రశని వక్ర గురువుపై తీవ్ర వీక్షణలు, కుజ శనుల పరస్పర వీక్షణలున్నవి. పరిహార వివరాలకై www.gargeyam.com చూడండి.

| రోజు | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.43-5.34<br>రా.కా: సా4.30-6.00 | పండుగలు<br>1. కార్మికదినోత్సవం<br>4. వాస్తుకర్తరి ప్రారంభం<br>5. శ్రీవాసవిజయంతి, శ్రీవీరబ్రహ్మేంద్రజయంతి | 7<br>శు.ద్వాదశి రా9.42<br>ఉత్తర ఉ7.45<br>వ.సా4.51-6.34 | 14<br>బ.తదియ ఉ10.17<br>మూల రా2.08<br>వ.ఉ8.10-9.58<br>వ.రా12.21-2.08 | 21<br>బ.దశమి సా4.41<br>పూర్వాభాద్రమ11.12<br>వ.రా8.23-9.55 | 28<br>శు.తదియ మ2.04<br>ఆర్ద్ర మ3.31<br>వ.రా2.28-3.56 |
| MON సోమ<br>దుర్ము: మ12.29-1.20<br>మ3.01-3.51<br>రా.కా: ఉ7.30-9.00 | 1<br>శు.షష్ఠి రా10.31<br>ఆర్ద్ర ఉ6.37<br>పునర్వసు తె5.16<br>వ.సా5.57-7.27 | 8<br>శు.త్రయోదశిరా11.16<br>హస్త ఉ9.44<br>వ.సా6.30-8.15 | 15<br>బ.చవితి మ12.38<br>పూర్వాషాఢ తె4.57<br>వ.మ12.52-2.39 | 22<br>బ.ఏకాదశి మ2.43<br>ఉత్తరాభాద్ర ఉ10.10<br>శేషవర్జ్యం తె7.06వరకు<br>వ.రా9.17-10.46 | 29<br>శు.చవితి మ11.07<br>పునర్వసు మ1.25<br>వ.రా8.56-10.26 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.17-9.07<br>రా10.56-11.41<br>రా.కా: మ3.00-4.30 | 2<br>శు.సప్తమి రా8.51<br>పుష్యమి తె4.33<br>వ.మ1.02-2.35 | 9<br>శు.చతుర్దశి రా1.07<br>చిత్ర మ12.02<br>వ.సా6.13-8.00 | 16<br>బ.పంచమి మ2.46<br>ఉత్తరాషాఢ పూర్తిగా<br>వ.మ1.46-3.32 | 23<br>బ.ద్వాదశి మ12.03<br>రేవతి ఉ8.24<br>వ.రా2.26-3.53 | 30<br>శు.పంచమి ఉ8.47<br>పుష్యమి మ11.57<br>వ.రా12.22-1.55 |
| WED బుధ<br>దుర్ము:మ11.39-12.29<br>రా.కా: మ12.00-1.30 | 3<br>శు.అష్టమి రా7.51<br>ఆశ్లేష తె4.29<br>వ.సా5.19-6.54 | 10○<br>వైశాఖపూర్ణిమరా3.12<br>స్వాతి మ2.35<br>వ.రా8.49-10.36 | 17<br>బ.షష్ఠి సా4.31<br>ఉత్తరాషాఢ ఉ7.26<br>వ.మ11.46-1.30 | 24<br>బ.త్రయోదశి ఉ8.47<br>బ.చతుర్దశి తె5.07<br>అశ్వని ఉ6.02భరణిరా3.14<br>వ.మ2.31-3.56 | 31<br>శు.షష్ఠి ఉ7.10<br>ఆశ్లేష మ11.14<br>వ.రా11.14-12.51 |
| THU గురు<br>దుర్ము:ఉ9.57-10.48<br>మ3.01-3.52<br>రా.కా:మ1.30-3.00 | 4<br>శు.నవమి రా7.29<br>మఘ తె5.02<br>వ.సా4.46-6.24 | 11<br>బ.పాడ్యమి తె5.28<br>విశాఖ సా5.19<br>వ.రా9.48-11.36 | 18<br>బ.సప్తమి సా5.42<br>శ్రవణం ఉ9.26<br>వ.మ1.40-3.21 | ●25<br>వైశాఖఅమావాస్యరా1.14<br>కృత్తిక రా12.11<br>వ.మ1.42-3.06 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.16-9.07<br>మ12.29-1.20<br>రా.కా:ఉ10.30-12.00 | 5<br>శు.దశమి రా7.44<br>పూర్వఫల్గుణిపూర్తిగా<br>వ.మ1.25-3.05 | 12<br>బ.విదియ పూర్తిగా<br>అనూరాధ రా8.13<br>వ.రా2.31-4.19 | 19<br>బ.అష్టమి సా6.11<br>ధనిష్ఠ ఉ10.48<br>వ.సా6.11-7.49 | 26<br>జ్యేష్ఠ శు.పాడ్యమిరా9.18<br>రోహిణిరా9.05<br>వ.మ2.07-3.30<br>వ.రా1.59-3.24 | |
| SAT శని<br>దుర్ము:ఉ5.43-7.25<br>రా.కా:ఉ9.00-10.30 | 6<br>శు.ఏకాదశి రా8.30<br>పూర్వఫల్గుణి ఉ6.09<br>వ.మ1.50-3.32 | 13<br>బ.విదియ ఉ7.51<br>జ్యేష్ఠ రా11.11<br>వర్జ్యం లేదు | 20<br>బ.నవమి సా5.51<br>శతభిషం మ11.24<br>వ.సా5.45-7.20 | 27<br>శు.విదియ సా5.31<br>మృగశిర సా6.08<br>వ.రా1.37-3.02 | |

5. తిరుచానూర్ శ్రీపద్మావతీ కళ్యాణోత్సవం
6. మోహినీఏకాదశి అన్నవరసత్యదేవకల్యాణం
7. పరశురామద్వాదశి
9. శ్రీ నృసింహజయంతి
10. మహావైశాఖి,బుద్ధపూర్ణిమ, శ్రీఅన్నమయ్యజయంతి మదర్స్‌డే, కూర్మజయంతి
11. నిజకర్తరి ప్రారంభం
14. సంకష్టహరచతుర్థి వృషభసంక్రాంతి
21. శ్రీ హనుమజ్జయంతి
22. అపరైకాదశి
24. మాసశివరాత్రి
25. శనిజయంతి
27. జ్యేష్ఠమాసచంద్రోదయం
28. వాస్తుకర్తరిత్యాగం రంజాన్‌నెల ప్రారంభం
29. ఉమాచతుర్థి
30. ఆరణ్యకగౌరీవ్రతం

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## మే శుభసమయములు

శ్రీ హేమలంబ వైశాఖమాసము

| | | | | |
|---|---|---|---|---|
| 01 | సోమ | శు.షష్ఠి | పునర్వసు | ఉ8.35-మ12.28 |
| 04 | గురు | శు.నవమి | మఘ | ఉ8.23-9.56 |
| 04 | గురు | శు.నవమి | మఘ | ఉ10.50-12.47 |
| 04 | గురు | శు.దశమి | మఘ | రా7.30-9.22 |
| 06 | శని | శు.ఏకాదశి | ఉత్తర | ఉ8.15-12.39 |
| 06 | శని | శు.ఏకాదశి | ఉత్తర | రా7.00-8.30 |
| 07 | ఆది | శు.ద్వాదశి | హస్త | ఉ8.11-12.35 |
| 07 | ఆది | శు.ద్వాదశి | హస్త | సా6.56-9.10 |
| 08 | సోమ | శు.త్రయోదశి | హస్త | ఉ8.07-9.44 |
| 08 | సోమ | శు.త్రయోదశి | చిత్ర | ఉ9.45 -12.28 |
| 08 | సోమ | శు.త్రయోదశి | చిత్ర | రా8.16-9.06 |
| 10 | బుధ | పూర్ణిమ | స్వాతి | ఉ7.59-11.37 |
| 11 | గురు | బ.పాడ్యమి | అనూరాధ | సా6.40-8.54 |
| 12 | శుక్ర | బ.విదియ | అనూరాధ | ఉ9.06-12.15 |
| 12 | శుక్ర | బ.విదియ | అనూరాధ | సా6.36-8.13 |
| 14 | ఆది | బ.తదియ | మూల | ఉ7.43-8.09 |
| 14 | ఆది | బ.చవితి | మూల | ఉ10.18-12.07 |
| 14 | ఆది | బ.చవితి | మూల | సా6.28-8.42 |
| 17 | బుధ | బ.షష్ఠి | శ్రవణం | ఉ9.43-11.37 |
| 17 | బుధ | బ.సప్తమి | శ్రవణం | సా6.16-8.30 |
| 18 | గురు | బ.సప్తమి | ధనిష్ఠ | ఉ10.48-11.51 |
| 18 | గురు | బ.అష్టమి | ధనిష్ఠ | సా6.12-8.26 |
| 19 | శుక్ర | బ.అష్టమి | ధనిష్ఠ | ఉ7.23 -8.12 |
| 19 | శుక్ర | బ.అష్టమి | ధనిష్ఠ | ఉ9.05-9.35 |
| 19 | శుక్ర | బ.నవమి | శతభిషం | రా7.50-8.22 |
| 20 | శని | బ.నవమి | శతభిషం | ఉ7.22-9.31 |
| 21 | ఆది | బ.ఏకాదశి | ఉత్తరాభాద్ర | సా6.00-8.14 |
| 22 | సోమ | బ.ఏకాదశి | ఉత్తరాభాద్ర | ఉ7.11-10.10 |
| 22 | సోమ | బ.ఏకాదశి | రేవతి | ఉ10.11-11.35 |

శ్రీ హేమలంబ జ్యేష్ఠమాసము

| | | | | |
|---|---|---|---|---|
| 26 | శుక్ర | శు.పాడ్యమి | రోహిణి | ఉ6.55-8.11 |
| 26 | శుక్ర | శు.పాడ్యమి | రోహిణి | ఉ9.07-11.19 |
| 26 | శుక్ర | శు.పాడ్యమి | రోహిణి | సా5.40-7.54 |
| 27 | శని | శు.విదియ | మృగశిర | ఉ9.03-11.15 |
| 28 | ఆది | శు.చవితి | పునర్వసు | మ3.32-4.47 |
| 28 | ఆది | శు.చవితి | పునర్వసు | రా9.55-11.47 |
| 29 | సోమ | శు.చవితి | పునర్వసు | ఉ8.55-11.07 |
| 29 | సోమ | శు.పంచమి | పుష్యమి | మ3.58-5.28 |
| 29 | సోమ | శు.పంచమి | పుష్యమి | రా10.27-11.43 |
| 31 | బుధ | శు.సప్తమి | మఘ | మ3.11-5.20 |

*Engagements*

## వివాహ పొంతనలలో పాయింట్ల పట్టిక అశాస్త్రీయం

వధూవరుల జన్మనక్షత్రాలచే వధూవర గుణమేళన పట్టిక ద్వారా వివాహ నిర్ణయాలను చేస్తుంటారు. 18 లేక అంతకంటే అధికంగా, గుణమేళన పట్టికలో పాయింట్లు వస్తే ఇరువురికీ వివాహం అనుకూలమని, 18 కంటే తక్కువ ఉంటే వివాహం చేయకూడదనేది... వధూవర గుణమేళన పట్టిక భావం. అనుభవంలో పరిశీలించగా.... 18 పాయింట్ల కంటే ఎక్కువ వచ్చి వివాహమైన వారిలో అధికులు మనస్పర్ధలు, అభిప్రాయబేధాలు, దాంపత్యభంగములు ఏర్పడి, విడాకులు తీసుకోవటము, ద్వితీయవివాహాలు చేసుకోవటము జరిగింది. 18 కంటే తక్కువ వచ్చి షష్ఠి పూర్తి కార్యములు జరుపుకున్న దంపతులు కూడా ఉన్నారు.

అనుభవంలో వేలాది దంపతుల స్థితిగతులను పరిశీలిస్తే వధూవర గుణమేళన పట్టిక పూర్తి అశాస్త్రీయమని ఋజువైనది. కనుక తల్లిదండ్రులు తమ సంతానానికి వివాహం చేసే సమయంలో వధూవర గుణమేళన పట్టికను చూడవద్దు. యువతీ యువకుల జాతకాలలో సంతాన, కళత్ర, ఆయుస్థాన అధిపతులు మిత్రశతృత్వాలు పరిశీలించి, ఇతర దోషాలు లేకుండా చూసుకుని వివాహ నిర్ణయాలను చేసుకోవాలి. వధూవరులిరువురికీ తారాబలం ఎలా ఉందో గమనించాల్సిన అవసరం ఉంది. సహజంగా తారాబలంలో క్షేమతారను శుభకరంగా గుర్తిస్తాం. కానీ.... అమ్మాయికి అబ్బాయికి తారాబలాలు చూస్తుంటే... ఒక వైపు నుంచి క్షేమతారాబలం ఉండి.... మరోవైపు నుంచి ప్రమాదకర నైధనతారాబలం ఉంటుంది. మరి ఇట్టి స్థితిలో క్షేమతార ఉందని స్వీకరించాలా? నైధనతారాబలం ఉందని విసర్జించాలా?

ఇలాంటి అనుమానాలు చాలామందికి వస్తుంటాయి. అనుభవంలో పరిశీలిస్తే... క్షేమతార, నైధనతారలతో చేసిన వివాహాలు.... కొంతకాలానికి అనుకోని కారణాలచే సమస్యలు రావటము, అభిప్రాయబేధాలు వచ్చి విడాకులు తీసుకోవటము జరిగింది. కనుక వివాహ పొంతనకు క్షేమతారాబలాన్ని విసర్జించండి. కేవలం ముహూర్తాలకు మాత్రం క్షేమతారను స్వీకరించండి.

నూటికి 75శాతం వరకు క్షేమతార, నైధనతారలతో ఉన్న జంటలు సమస్యల వలయాల లోనే ఉంటూ... జీవితాలు సాగిస్తున్నారు. 25 శాతం జంటలు కొంత ఆశాజనకమైన పరిస్థితితో ఉంటున్నారు. కనుక 27 నక్షత్రాలలో జన్మించిన వారు వివాహ నిర్ణయాలలో ఏయే నక్షత్రాలలో జన్మించిన వారిని వివాహం చేసుకొనాలని తెల్పే పూర్తి పట్టికలను ఈ క్యాలెండర్‌లోని వెనుక పేజీలలో ఇవ్వటం జరిగింది. పొంతనలలో 27 నక్షత్రాలకు క్షేమతారలు, నైధనతారలు, అష్టమచంద్రదోషాన్నిచ్చే తారలను విసర్జించి పూర్తిగా అనుకూల నక్షత్రాల వివరాలను ఇవ్వటం జరిగింది. కనుక పాఠకులు అవసరమైన నక్షత్రాన్ని ఎంచుకున్నప్పటికీ, ఆ నక్షత్రంతో... ఇరువురి జాతకపొంతన సరిచూసుకోవటం మంచిది.



# సింహరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:5, రాజ్యపూజ్యం:6, అవమానం:3

శ్రీ హేమలంబ : ఆదాయం:2, వ్యయం:14, రాజ్యపూజ్యం:2, అవమానం:2

**జనవరి :** నూతన ఒప్పందాలు ఆలస్యంగా ఫలించును. సంతానంచే అమితోత్సాహం. వాగ్దానాలను తగ్గిస్తారు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. మేధాశక్తితో అన్వేషణను అధికం చేస్తారు. ముఖ్య విషయాలలో హామీలు తీసుకుంటారు. ప్రశంసలు అధికం. రాజకీయ వర్గీయులకు అనుకూలములు. నమ్మినవారిలో శత్రువులున్నారని గ్రహించాలి. సంతాన ఆలోచనలచే కార్యసిద్ధి. అవివాహితులకు వివాహయోగం. 4 మధ్యాహ్నం 11.15 నుంచి 6 మధ్యాహ్నం 3.45 వరకు వ్యతిరేకరోజులని గ్రహించాలి.

**ఫిబ్రవరి :** శత్రువర్గీయులను అంచనా వేయగలరు. 2వ పక్షంలో వ్యూహాత్మక పావులు కదుపుదురు. స్నేహసంబంధాలు పెరుగును. నూతన అగ్రిమెంట్లు ఫలించును. సంతానంచే లబ్ధి కలదు. హాస్యంచే గౌరవం తగ్గునని భావించండి. శక్తికి మించిన కార్యాలు వద్దు. మృదువాక్కులతో మాసం చివరలో ఆకట్టుకుంటారు. గతనెల 31 సాయంత్రం 4.50 నుంచి ఫిబ్రవరి 2 రాత్రి 9.12 వరకు తిరిగి 27 రాత్రి 12.10 నుంచి మార్చి 1 అర్ధరాత్రి 3.16 వరకు అనుకూలం కాదు.

**మార్చి :** వ్యక్తిగత కక్షలను తగ్గిస్తారు. హడావుడి నిర్ణయాలతో ధననష్టం. వివాద విషయాలలో జోక్యం చేసుకుందురు. అవివాహితులకు శుభయోగం. నేత్ర దంత రుగ్మతలు ఏర్పడు సూచన. మాసాం మధ్యలో ఆధిపత్య పోరు తగ్గును. జీవన సరళిలో విజయముండును. ధైర్య సాహసాలు తగ్గిననూ నష్టాలు రావు. మాసాంతంలో సంజాయిషీలు,విమర్శలు అధికమగును. 27 ఉదయం 9.37 నుంచి 29 మధ్యాహ్నం 11.39 వరకు ప్రతికూలం.

**ఏప్రిల్ :** ఆశాజనక పరిస్థితులున్ననూ ముఖ్య వ్యవహారాలను వాయిదా వేసుకుందురు. మానసిక దౌర్భల్యాన్ని తగ్గిస్తారు. ఆచితూచి సంభాషించి ఎదుటివారిని ఆకట్టుకుంటారు. ధైర్యం పెరిగిననూ, సమయస్ఫూర్తి లోపించును. కార్యదీక్షా భాధ్యత పెంచుదురు. విలాసాలు, వాహనమరమ్మత్తులకు ఆర్థిక వనరులు కరువగును. దూరప్రయాణాలుండును. ఏప్రిల్ 23 రాత్రి 7.53 నుంచి 25 రాత్రి 9.55 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** కుటుంబకలహం ఉండదు. మాసాంతంలో మనోక్లేశము. వృత్తి ఉద్యోగాదులు తృప్తిగా ఉండును. నిరుద్యోగులకు శుభవార్తలు. ఋణవత్తిడి తగ్గును. ముఖ్య వ్యవహారాలలో శీఘ్రనిర్ణయాలు తీసుకోలేరు. ప్రతిభకు గుర్తింపు ఉన్ననూ మనశ్శాంతి కరువగును. అభివృద్ధి అంశాలపై దృష్టి ఉంచాలి. తోబుట్టువులతో సామరస్య సంభాషణలు. మే 20 రా.తె 5.15 నుంచి 23 ఉదయం 8.24 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**జూన్ :** వ్యూహాత్మక శక్తులను పెంచుకుంటారు. ఆర్థికంగా బలం పెరుగును. మనశ్శాంతి లాభించును. ఇష్టకార్యసిద్ధి. సుఖసంతోషాదులు. శుభకార్యాచరణకు సిద్ధం. సోమరితనం తగ్గించాలి. వ్యాపారవర్గీయులకు అనవసర కాలయాపన. కళత్ర సలహాలను పెడచెవిన పెడతారు. దీర్ఘాలోచనలు అధికము. విమర్శల జోలికి వెళ్లకండి. జూన్ 17 మధ్యాహ్నం 12.41 నుంచి 19 సాయంత్రం 5.27 వరకు ప్రతికూల సమయం.

**జూలై :** ఈర్ష్యాద్వేషాలు తగ్గును. సాహసంతో ప్రతిపని చేయుదురు. పాతమిత్రత్వంచే నిర్ణయాలలో మార్పులు కల్గును. కుటుంబ అంశాలలో రాజీపోకడలు నెరవేరును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త తప్పదు. అసత్య ఆరోపణలు అధికము. స్థిరాలోచనలకై దృష్టి ఉంచండి. నిద్రాసౌఖ్యంచే 2వపక్షంలో ఉల్లాసంగా ఉంటారు. ప్రాధాన్యత వ్యక్తులను గౌరవించలేరు. క్షణికావేశంతో ధనవ్యయం. జూలై 14 సాయంత్రం 6.30 నుంచి 16 రాత్రి 12.20 వరకు ప్రతి విషయంలోను జాగ్రత్తలు అవసరం.

**ఆగస్టు :** వివాదాస్పద అంశాలు సమసిపోవును. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండాలి. స్థిరాదాయం తగ్గును. వృధా ప్రయాణాలు. స్త్రీ మూలక సమస్యలు, మానసిక శారీరక చిక్కులు తగ్గును. మనోవాంఛలు నెరవేరును. సంతాన విజయాలతో సౌఖ్యం. రోగబాధలు ఉపశమనం. 2వ పక్షంలో పరనిందారోపణలచే సమస్యలున్నవి. విధాన పాలనా నిర్ణయాలు సజావుగా సాగును. స్థానచలన అవకాశాలు లేవు. ఆగస్టు 10 రాత్రి 12.06 నుంచి 12 రా.తె 5.50 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**సెప్టెంబరు :** స్పెక్యులేషన్ స్వల్పంగా లబ్ది. కీలక నిర్ణయాలలో జాగ్రత్తలు తీసుకుందురు. వ్యవహారశైలిలో మార్పులు చేయుదురు. స్వయంవృత్తుల వారికి లబ్ది చేకూరును. సమయస్ఫూర్తి సంయమనం అవసరం. ఆశలు నిరాశలు కావు. హామీలు ఇవ్వవద్దు. ఋణవిషయంలో అప్రమత్తత అవసరము. స్థిరాస్తి అంశాలలో జాప్యం. కుటుంబసఖ్యత తగ్గును. సెప్టెంబరు 7 ఉదయం 6.57 నుంచి 9 మధ్యాహ్నం 11.43 వరకు అనుకూల సమయం కాదు.

**అక్టోబరు :** వినోదకాలక్షేపాలున్ననూ ధర్మకార్యాలలో పాల్గొందురు. ఋణసేకరణ అనుకూలించును. స్థిరాస్తి నిర్ణయాలలో వాయిదా. గౌరవ,ప్రతిష్ఠలు పెరుగును. నిర్ణయాలను నిర్భయంగా చెప్పగలరు. శత్రువర్గ ప్రభావం తగ్గును. శారీరక అలసట పెరుగును. రాజీ ప్రయత్నాలను విరమిస్తారు. కుటుంబ పరిస్థితులు చక్కబడును. అక్టోబరు 4 మధ్యాహ్నం 3.43 నుంచి 6 రాత్రి 7.31 వరకు సమయం వ్యతిరేకమని గ్రహించాలి.

**నవంబరు :** ఉద్యోగవ్యాపారాదులలో నూతన నిర్ణయాలు. శత్రువుల పోకడలను గమనిస్తూ సరియైన నిర్ణయాలు తీసుకోండి. భయాందోళనలు విడనాడండి. 2,3వారాలలో ఆశాభావంతోనే గడపండి. సోదరవ్యతిరేకం తగ్గును. ప్రతిబంధక వ్యవహారాలపై చర్చలు వద్దు. మనోసంకటం సడలును. ముంజేతి సమస్య తీరును. దైవకార్యాలపై శ్రద్ధ అధికము. గతనెల 31 రాత్రి 1.40 నుంచి 2 రా.తె5.29 వరకు అనుకూల సమయం కాదు.

**డిశంబరు:** శరీర అలసత్వం తగదు. రహస్యచర్చలకు దూరం కావాలి. శీఘ్రనిర్ణయాలు తగ్గును. మార్పులకై అన్వేషణ. సాహసప్రయత్నాలు వద్దు. మిత్రబేధాలుండును గాన జాగ్రత్త. అవివాహితులకు శుభవార్తలు. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు. సమయస్ఫూర్తితో ఉన్ననూ విమర్శలు కలవు. గతమాసం కంటే అధికలాభం. తోబుట్టువులతో సహకరించండి. దూరప్రయాణాలచే శారీరక అలసట. 3వవారంలో వైద్యసేవలను జాప్యం చేయవద్దు. డిశంబరు 25 సాయంత్రం 6.48 నుంచి 27 రాత్రి 1.37 వరకు సమయం వ్యతిరేకము.

## శుక్ల చవితి, బహుళ ద్వాదశి తిథులలో 'భేరుండా' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత మూడు కనులు, ఎనిమిది చేతులతో పోతపోసిన బంగారు విగ్రహం వలె ప్రకాశవంతంగా ఉండి, చిరుమంద హాసంతో ఉండును. పాశ అంకుశాలు, కవచము, గద, ధనస్సు, బాణాలు, కత్తి, వజ్రాయుధములను ధరించి ఉండును.

భక్తి విశ్వాసాలతో ఈదేవత ఆరాధనచే విషప్రాణులు, విషజంతువుల కాటు నుంచి, మూలికా విషం నుంచి మరియు కృత్రిమ ఆయుధాల ద్వారా కల్గే ప్రమాదముల నుంచి రక్షణ కల్గుతుంది (మనము చేయవలసినవి ఆచరిస్తూ, భారాన్ని దేవతపై ఉంచాలి). ప్రతినెలలో వచ్చే శుక్ల చవితి, బహుళ ద్వాదశి తిథుల సాయంత్ర సమయాలలో శ్రీ లలితాపరమేశ్వరిలో భేరుండా దేవతను భావిస్తూ, ఈ క్రింది నామాలతో ఆరాధించేది.

**ఓం చారుచంద్రకళాధరాయై నమః (243)**
**ఓం చక్రరాజనికేతనాయై నమః (245)**
**ఓం పద్మరాగసమప్రభాయై నమః (248)**
**ఓం పంచప్రేతాసనాసీనాయై నమః (249)**
**ఓం పంచబ్రహ్మస్వరూపిణ్యై నమః (250)**
**ఓం విజ్ఞానఘనరూపిణ్యై నమః (253)**
**ఓం ధ్యానధ్యాతృధ్యేయరూపాయై నమః (254)**
**ఓం ధర్మాధర్మవివర్జితాయై నమః (255)**
**ఓం సర్వావస్థావివర్జితాయై నమః (263)**
**ఓం పంచకృత్యపరాయణాయై నమః (274)**
**ఓం భానుమండలమధ్యస్థాయై నమః (275)**
**ఓం పద్మనాభసహోదర్యై నమః (280)**
**ఓం సహస్రశీర్షవదనాయై నమః (282)**
**ఓం ఆబ్రహ్మకీటజనన్యై నమః (285)**
**ఓం వర్ణాశ్రమవిధాయిన్యై నమః (286)**
**ఓం నిజాజ్ఞారూపనిగమాయై నమః (287)**

## శుక్ల పంచమి, బహుళ ఏకాదశి తిథులలో 'వహ్నివాసినీ' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత బంగారువర్ణ మేనిఛాయ కల్గి పసుపురంగు పట్టు పీతాంబరాలను ధరించిన యవ్వనవతి. మూడు కన్నులు, ఎనిమిది చేతులు కల్గి చిరుమందహాసంతో ఉండును.

ఈ దేవత చేతిలో పద్మము, శంఖము, చెరకుగడ, విల్లు, పూర్ణకలశము, తెల్ల లిల్లీపుష్పము, బంగారుకొమ్ము, పుష్పబాణాలు, దబ్బ పండును కల్గి ఉండును.

ఈ దేవతను ప్రార్థించినచో బాధోపశమనంకల్గి, ప్రాపంచికవిజయాల వైపు అడుగిడే విధంగా శక్తిని అందించును. ప్రతినెలలో వచ్చే శుక్ల పంచమి, బహుళ ఏకాదశి తిథుల సాయంత్ర సమయాలలో ఈ దేవతను ఆరాధించాలి. తిథి విషయంలో పూర్వగణిత పంచాంగాన్ని చూడకుండా దృగ్గణిత పంచాంగ తిథుల ప్రకారంగా పారాయణం చేసేది.

**ఓం పుణ్యాపుణ్యఫలప్రదాయై నమః (288)**
**ఓం హరిబ్రహ్మేంద్రసేవితాయై నమః (297)**
**ఓం నామరూపవివర్జితాయై నమః (300)**
**ఓం హేయోపాదేయవర్జితాయై నమః (304)**
**ఓం రణత్కింకిణిమేఖలాయై నమః (312)**
**ఓం కదంబకుసుమప్రియాయై నమః (323)**
**ఓం కరుణారససాగరాయై నమః (326)**
**ఓం వారుణీమదవిహ్వలాయై నమః (333)**
**ఓం వింధ్యాచలనివాసిన్యై నమః (336)**
**ఓం క్షేత్రక్షేత్రజ్ఞపాలిన్యై నమః (343)**
**ఓం క్షయవృద్ధివినిర్ముక్తాయై నమః (344)**
**ఓం క్షేత్రపాలసమర్చితాయై నమః (345)**
**ఓం వందారుజనవత్సలాయై నమః (349)**
**ఓం వహ్నిమణ్డలవాసిన్యై నమః (352)**
**ఓం భక్తిమత్కల్పలతికాయై నమః (353)**
**ఓం పశుపాశవిమోచన్యై నమః (354)**

## శుక్ల షష్ఠి, బహుళ దశమి తిథులలో 'మహావజ్రేశ్వరీ' నిత్యా దేవత పారాయణ నామాలు

మహావజ్రేశ్వరీ దేవత ఎరుపు వర్ణంతో ఉండి, ఎరుపు రంగు దుస్తులను ధరించి, రక్త సముద్రంలో పయనించే స్వర్ణపడవలోని సింహాసనంపై స్థిరాసనంతో ఉండును. కెంపులు పొదిగిన కిరీటమును, రత్నాలు పొదిగిన నగలను ధరించి 3 కన్నులతో, 4 చేతులు కల్గి ఉండును. పాశము, అంకుశము, చెరకువిల్లు, దానిమ్మపండు ఒక్కో చేతిలో ఉండును.

ఈ దేవతను శుక్ల షష్ఠి, బహుళ దశమి తిథులలో సాయంత్ర సమయంలో ప్రార్థించి, పారాయణం చేసేది. ఈమె చూపే దయ, దాక్షిణ్యాలు చాలా చల్లగా ఉంటాయి. ఎంతో తెలివి ఉండి అయోమయంలో ఉండేవారికి భూత, పిశాచ, భయాందోళనలతో ఈ తల్లి నుంచి ఉపశమనం కల్గును. ఖచ్చిత తిథులను అందించే దృగ్గణిత పంచాంగ సమయాల ప్రకారం పారాయణం చేయండి.

**ఓం సంహృతాశేషపాషండాయై నమః (355)**
**ఓం సదాచారప్రవర్తికాయై నమః (356)**
**ఓం చిదేకరసరూపిణ్యై నమః (364)**
**ఓం భక్తమానసహంసికాయై నమః (372)**
**ఓం కామేశ్వరప్రాణనాడ్యై నమః (373)**
**ఓం శృంగారరససంపూర్ణాయై నమః (376)**
**ఓం ఓడ్యాణపీఠనిలయాయై నమః (379)**
**ఓం బిందుమండలవాసిన్యై నమః (380)**
**ఓం రహోయాగక్రమారాధ్యాయై నమః (381)**
**ఓం రహస్తర్పణతర్పితాయై నమః (382)**
**ఓం షడంగదేవతాయుక్తాయై నమః (386)**
**ఓం షాడ్గుణ్యపరిపూరితాయై నమః (387)**
**ఓం నిర్వాణసుఖదాయిన్యై నమః (390)**
**ఓం నిత్యాషోడశికారూపాయై నమః (391)**
**ఓం శ్రీకంఠార్ధశరీరిణ్యై నమః (392)**
**ఓం వ్యక్తావ్యక్తస్వరూపిణ్యై నమః (399)**

# కాలచక్రం©

## జ్యోతిష రెమిమిడీస్ కేలండర్

పంచాంగకర్త:
శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర జ్యేష్ఠమాస శుక్ల సప్తమి గురువారం నుంచి ఆషాఢమాస శుక్ల సప్తమి శుక్రవారం వరకు

# 2017 JUNE జూన్

జూన్ 21 వరకు వక్రశనిచే రవి, కుజులకు వీక్షణలతో పాటు జూన్ 21 శని వృశ్చికరాశి లోనికి ప్రవేశం జరుగును. రాశులపై దీని ప్రభావం కొరకై www.gargeyam.com వీక్షించండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము: సా4.50-5.42<br>రా.కా: సా4.30-6.00 | | **4**<br>శు.దశమి ఉ8.03<br>హస్త మ3.25<br>వ.రా12.12-1.58 | **11**<br>బ.విదియ రా11.15<br>మూల ఉ8.05<br>వ.ఉ6.18-8.05<br>వ.సా6.47-8.34 | **18**<br>బ.నవమి రా3.16<br>ఉత్తరాభాద్ర సా6.29<br>వ.శేషంఉ5.51వరకు | **25**<br>శు.విదియ రా1.01<br>పునర్వసు రా11.26<br>వ.మ12.42-2.08 |
| **MON సోమ**<br>దుర్ము:<br>మ12.32-1.23<br>మ3.07-3.59<br>రా.కా: ఉ7.30-9.00 | | **5**<br>శు.ఏకాదశి ఉ9.42<br>చిత్ర సా5.48<br>వ.రా12.01-1.48 | **12**<br>బ.తదియ రా1.18<br>పూర్వాషాఢ ఉ10.51<br>వ.రా7.41-9.27 | **19**<br>బ.దశమి రా1.11<br>రేవతి సా5.27<br>వ.ఉ5.58-7.30 | **26**<br>శు.తదియ రా10.12<br>పుష్యమి రా9.23<br>వ.ఉ6.45-8.12 |
| **TUE మంగళ**<br>దుర్ము: ఉ8.13-9.04<br>రా11.00-11.44<br>రా.కా: మ3.00-4.30 | | **6**<br>శు.ద్వాదశి మ11.42<br>స్వాతి రా8.28<br>వ.రా2.44-4.31 | **13**<br>బ.చవితి రా3.02<br>ఉత్తరాషాఢ మ1.22<br>వ.సా5.44-7.29 | **20**<br>బ.ఏకాదశి రా10.28<br>అశ్వని మ3.44<br>వ.మ12.01-1.30<br>వ.రా12.25-1.52 | **27**<br>శు.చవితి రా8.00<br>ఆశ్లేష రా7.58<br>వ.ఉ9.26-10.56 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.40-12.32<br>రా.కా:<br>మ12.00-1.30 | | **7**<br>శు.త్రయోదశిమ1.56<br>విశాఖ రా11.19<br>వ.రా3.48-5.36 | **14**<br>బ.పంచమి తె4.22<br>శ్రవణం మ3.33<br>వ.రా7.50-9.33 | **21**<br>బ.ద్వాదశి రా7.14<br>భరణి మ1.27<br>వ.రా12.06-1.31 | **28**<br>శు.పంచమి సా6.33<br>మఘ రా7.17<br>వ.ఉ7.38-9.11<br>వ.రా3.19-4.56 |
| **THU గురు**<br>దుర్ము:ఉ9.56-10.47<br>మ3.06-3.58<br>రా.కా:మ1.30-3.00 | **1**<br>శు.సప్తమి ఉ6.20<br>మఘ మ11.15<br>వ.రా7.31-9.10 | **8**<br>శు.చతుర్దశి సా4.16<br>అనూరాధ రా2.15<br>వర్జ్యం లేదు | **15**<br>బ.షష్ఠి తె5.08<br>ధనిష్ఠ సా5.15<br>వ.రా12.47-2.28 | **22**<br>బ.త్రయోదశి మ3.38<br>కృత్తిక ఉ10.45<br>వ.రా12.48-2.17 | **29**<br>శు.షష్ఠి సా5.53<br>పూర్వఫల్గుణిరా7.24<br>వ.రా2.51-4.31 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.12-9.04<br>మ12.31-1.23<br>రా.కా:ఉ10.30-12.00 | **2**<br>శు.అష్టమి ఉ6.14<br>పూర్వఫల్గుణిమ12.01<br>వ.రా7.39-9.21 | ○ **9**<br>జ్యేష్ఠ పూర్ణిమ సా6.39<br>జ్యేష్ఠ తె5.12<br>వ.ఉ8.32-10.20 | **16**<br>బ.సప్తమి తె5.15<br>శతభిషం సా6.22<br>వ.రా12.53-2.31 | **23**<br>బ.చతుర్దశి మ11.49<br>రోహిణి ఉ7.49<br>మృగశిర తె4.49<br>వ.మ12.43-2.07 | **30**<br>శు.సప్తమి సా6.00<br>ఉత్తర రా8.16<br>వ.తె5.13 లగాయితు |
| **SAT శని**<br>దుర్ము:ఉ5.37-7.21<br>రా.కా:ఉ9.00-10.30 | **3**<br>శు.నవమి ఉ6.51<br>ఉత్తర మ1.27<br>వ.రా10.32-12.16 | **10**<br>బ.పాడ్యమి రా9.00<br>మూల పూర్తిగా<br>వ.మ2.10-3.57 | **17**<br>బ.అష్టమి తె4.38<br>పూర్వాభాద్ర సా6.48<br>వ.తె4.16లగాయితు | ● **24**<br>జ్యేష్ఠఅమావాస్య:ఉ8.00<br>ఆషాఢ శు.పాడ్యమి<br>తె4.21 ఆర్ద్ర రా1.58<br>వ.మ12.13-1.38 | జూన్ 21న శనిగ్రహం వృశ్చికరాశిలో ప్రవేశిస్తాడు. అక్టోబరు 26 వరకు వృశ్చిక రాశిలోనే ఉండి తదుపరి ఋజుగమనంతో ధనస్సురాశి ప్రవేశం. |

### పండుగలు

2. త్రిలోచనాష్టమి, ధూమవతీజయంతి
4. దశపాపహరదశమి
5. నిర్జలేకాదశి శ్రీశంకర కైలాసగమనం
6. చంపకద్వాదశి
9. ఏరువాకపున్నమి, భౌచ్యమన్వాది మహాజ్యేష్ఠి పూరీ జగన్నాధుని పున్నమిస్నానం
13. సంకష్టహరచతుర్థి
15. మిధునసంక్రమణం
17. శీతలాష్టమి
20. యోగిన్యేకాదశి
22. మాసశివరాత్రి
23. వటసావిత్రీవ్రతం
25. ఆషాఢచంద్రోదయం పూరీజగన్నాధ రధయాత్ర
26. షవ్వాల్‌నెల ప్రారంభం రంజాన్‌పండుగ
28. స్కంధపంచమి
29. తెలంగాణా బోనాలారంభం, కుమారషష్ఠి
30. వివస్వతసప్తమి

### జూన్ శుభసమయములు

శ్రీ హేమలంబ జ్యేష్ఠమాసము

| | |
|---|---|
| 01 | గురు శు.అష్టమి మఘ ఉ8.43-9.55 |
| 02 | శుక్ర శు.నవమి ఉత్తర మ3.03-5.12 |
| 03 | శని శు.దశమి ఉత్తర ఉ8.35-10.47 |
| 03 | శని శు.దశమి హస్త మ2.58-5.08 |
| 03 | శని శు.దశమి హస్త రా9.31-10.31 |
| 04 | ఆది శు.ఏకాదశి హస్త ఉ8.31-10.43 |
| 04 | ఆది శు.ఏకాదశి చిత్ర మ3.26-4.49 |
| 04 | ఆది శు.ఏకాదశి చిత్ర రా9.27-11.19 |
| 05 | సోమ శు.ఏకాదశి చిత్ర ఉ8.27 -9.42 |
| 05 | సోమ శు.ద్వాదశి చిత్ర ఉ9.43-10.39 |
| 08 | గురు శు.చతుర్దశి అనూరాధ ఉ8.15-9.56 |
| 08 | గురు పూర్ణిమ అనూరాధ సా4.17-4.48 |
| 08 | గురు పూర్ణిమ అనూరాధ రా9.11-11.03 |
| 10 | శని బ.పాడ్యమి మూల ఉ8.07-10.19 |
| 10 | శని బ.విదియ మూల రా9.03-10.55 |
| 14 | బుధ బ.పంచమి శ్రవణం ఉ7.51-10.03 |
| 14 | బుధ బ.పంచమి శ్రవణం మ2.15-3.33 |
| 15 | గురు బ.షష్ఠి శతభిషం రా8.44-10.36 |
| 16 | శుక్ర బ.సప్తమి శతభిషం మ2.07-4.17 |
| 17 | శని బ.నవమి ఉత్తరాభాద్ర రా8.36-10.28 |
| 18 | ఆది బ.నవమి ఉత్తరాభాద్ర ఉ7.36-9.48 |
| 18 | ఆది బ.నవమి ఉత్తరాభాద్ర మ2.00-4.09 |
| 18 | ఆది బ.నవమి రేవతి రా8.32-10.24 |
| 19 | సోమ బ.దశమి రేవతి ఉ7.32-9.44 |
| 19 | సోమ బ.దశమి అశ్వని రా8.28-10.20 |

శ్రీ హేమలంబ ఆషాఢమాసము

| | |
|---|---|
| 25 | ఆది శు.విదియ పునర్వసు ఉ7.08-9.20 |
| 25 | ఆది శు.విదియ పునర్వసు రా8.04-9.56 |
| 26 | సోమ శు.తదియ పుష్యమి ఉ8.13-9.16 |
| 26 | సోమశు.తదియ పుష్యమి మ11.22-12.35 |
| 26 | సోమ శు.తదియ పుష్యమి రా8.00-9.52 |
| 28 | బుధ శు.పంచమి మఘఉ6.56-7.37 |
| 28 | బుధ శు.పంచమి మఘ మ11.14-11.43 |
| 28 | బుధ శు.పంచమి మఘ సా5.43-6.33 |
| 30 | శుక్ర శు.సప్తమి ఉత్తర ఉ6.48 -8.16 |
| 30 | శుక్ర శు.సప్తమి ఉత్తర మ11.06-12.36 |
| 30 | శుక్ర శు.అష్టమి ఉత్తర సా6.01-8.16 |

*Engagements*



## నరఘోష నివృత్తికి అద్భుత పరిహారం

నరఘోషతో బాధపడేవారు ఉంటారు. నివృత్తికై తంత్రశాస్త్ర పలు పద్ధతులున్నవి.ప్రత్యేకతిధి వారం కలిసిన రోజులలో ఆచరిస్తే నరఘోష పరిహారమగును. శుక్లత్రయోదశి కూడిన సోమవార రాహుకాలం, పూర్ణిమ కూడిన శనివార రాహుకాలం, శుక్లపంచమితో కూడిన శుక్రవార రాహు కాలం, శుక్లఏకాదశితో కూడిన బుధవార రాహుకాల సమయాలలోనే ఈ పరిహారాన్ని పాటించాలి.

పై నాల్గు రోజులకు వారం ముందుగా నిమ్మకాయను కోసి ఒక పాత్రలో రసం పిండండి. అందులో చిటికెడు ఇంగువను కలపండి. తెలుపు చేతి రుమాలు సైజు నూతన వస్త్రాన్ని తీసుకుని... ఇంగువ కలిపిన నిమ్మరసంలో ముంచండి. వస్త్రం రసాన్నంతటినీ పీల్చుకుంటుంది. తదుపరి తెలుపు వస్త్రాన్ని నీడలో ఆరనివ్వండి. ఈ నాల్గురోజుల నాటి రాహుకాల సమయాలకు ఓ గంట ముందుగా... అంతకు ముందే ఆరబెట్టి భద్రపరిచిన తెలుపు వస్త్రంలో ఎండిన కొబ్బరి కురిడినీ మూట కట్టండి. ఈ కట్టినమూటకు పసుపు, కుంకుమలు పెట్టవద్దు.

ఈ మూటను సింహద్వారానికి గానీ లేక సింహద్వారానికి ముందుండే వరండాలో సీలింగ్‌కు కట్టుకొనండి. కుటుంబంలో ఎవరైననూ దీనిని కట్టవచ్చు. మూట కట్టిన వ్యక్తి పాద ప్రక్షాళన తప్పక చేసుకోవాలి. పాటించాల్సిన నియమాలు ఏమియును లేవు. సహజంగా అధికశాతం గుమ్మడికాయలను కడుతుంటారు. ఆ కట్టే మేకుకే ఈ మూటను కూడా కట్టండి.

ఒకసారి కొబ్బరికురిడి మూటను సీలింగ్‌కు కడితే... దాని ప్రభావం అప్పటినుంచి 11 నెలలు మాత్రమే ఉండును. పై నాల్గు రోజులలో ఏరోజు కట్టిననూ...11 మాసాల తదుపరి సీలింగ్ నుంచి కొబ్బరికురిడి మూటను విసర్జించటం మాత్రం సోమవారం నాడే చేయాలి. మిగిలిన వారాలలో సీలింగ్ నుంచి తీసి విసర్జించవద్దు. జాతాశౌచ, మృతాశౌచ దినాలలో వచ్చే తిధి, నక్షత్రరోజులలో ఈ పరిహారమును పాటించవద్దు.

సీలింగ్‌కు కట్టినప్పటినుంచి 11 మాసాలలో... మధ్యకాలంలో ఎప్పుడైనా ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం వచ్చినచో.... సోమవారం నాడు ఈ మూటను విసర్జించండి. ఆరోజు అవకాశం లేకపోయినా ఆ తదుపరి సోమవారమైనా విసర్జించండి. ఈ నరఘోష పరిహారానికి ఆచరించే దాని కాలపరిమితి 11 మాసాలైనప్పటికీ.. ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం వస్తే... ఈ వస్త్రంలో ఉండే కొబ్బరికురిడీ... దాని ప్రభావాన్ని కోల్పోవును. చంద్రగ్రహణంతో సంబంధం లేదు. సూర్యగ్రహణమైనందున విసర్జిస్తారు కనుక, మరల పై 4వారాలు, తిధి కలిసిన రాహుకాల సమయాలలోనే మరో వస్త్రంతో కురిడీని ఇంటిముందు కట్టుకొనాలి. ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం భారతదేశంలో కనపడితేనే వర్తించును.



# కన్యారాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:14, వ్యయం:11, రాజ్యపూజ్యం:2, అవమానం:6

శ్రీ హేమలంబ : ఆదాయం:5, వ్యయం:5, రాజ్యపూజ్యం:5, అవమానం:2

**జనవరి :** కఠినవిర్ణయాలు తీసుకుందురు. పుకార్లను నమ్మి నష్టపోతారు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. మానసిక చింతన పెరుగును. ఆదాయానికి గండి. స్వయంరంగాల వారికి స్వల్ప లోపాలు. దైవకార్యాలపై శ్రద్ధ చూపిస్తారు. ఇతరులపై విమర్శలు, దూషణలు అధికం. మాసం మధ్యలో సజ్జన సహచర్యం లబ్ధిని అందించును. ధైర్యసాహసాలతో శత్రు జయం ఏర్పడును. జనవరి 6 మ3.45 నుంచి 8 సా 5.54 వరకు అనుకూలం కాదు.

**ఫిబ్రవరి :** సంతానంచే విజయవార్తలు. భయాందోళనలు తగ్గును. ప్రతిష్టాత్మక నిర్ణయాలు విజయవంతం. మనోనిబ్బరం కొనసాగిస్తారు. పితృవర్గం వారితో పేచీలుండవు. ఆర్థిక పరిపుష్టి కల్గును. అకాల భోజనాలు, నిద్రలేమి అధికం. పాతమిత్రత్వం కోరుకుంటారు. 3వ వారంలో పాలనా నిర్ణయాలు సజావుగా సాగవు. రాబడి విషయాలలో నిర్ణయాలు మార్పు. ఫిబ్రవరి 2 రాత్రి 9.12 నుంచి 4 అర్ధరాత్రి 12.16 వరకు ప్రతికూల సమయం.

**మార్చి :** స్థిరాదాయం తగ్గును. ఖర్చులు, విమర్శలు, విసుగు పెరుగును. స్పెక్యులేషన్ యోగించదు. వ్యవహారశైలిలో మార్పులుండును. హడావుడి నిర్ణయాలు తీసుకోలేరు. సంయ మనంతో విజయాన్ని పొందుదురు. మాసాంతంలో వ్యతిరేకరోజులున్నాయని గ్రహించాలి. మాసం మధ్యలో ఆర్థిక లావాదేవీలలో మతిమరపు. మార్చి 1 రాత్రి 3.16 నుంచి 4 ఉద యం 5.40 వరకు తిరిగి 29 మ11.39 నుంచి 31 మధ్యాహ్నం 12.32 వ్యతిరేకము.

**ఏప్రిల్ :** తోబుట్టువులతో స్వల్ప విరోధం. లోభగుణం తగ్గించండి. రహస్యమంతనాలు, పట్టింపులు దూరంగా ఉంచండి. న్యాయపోరాటాలు మానండి. వాగ్గోరణిని తగ్గించండి. స్నేహిత వర్గీయులతో ప్రశాంతంగా గడుపుదురు. స్పెక్యులేషన్ లాభించును. అంతర్గత శత్రుబెడదలు ఉండును. శక్తియుక్తులతో, హుందాతనంతో అనుకున్న కార్యాలు సాధిస్తారు. భాగస్వామ్య నిర్ణయాలు వాయిదా పడును. ఏప్రిల్ 25 రాత్రి 9.55 నుంచి 27 రాత్రి 9.48 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**మే :** ఈమాస ప్రణాళికలో మార్పుచేర్పులుండును. నిర్మాణాత్మక శక్తి పెరుగును. నూతన ఆలోచనలు లాభించును. ధైర్యంతో అడుగులు వేయుదురు. స్థానచలనములుండవు. మనోవ్యాకులత్వం తగ్గును. అధికారులతో జాగ్రత్తగా ఉంటారు. శుభకార్యాచరణకు సంకేతాలు. వృత్తి వ్యాపారాదులలో ఇతరుల జోక్యం పెరుగును. ఎదుటివారి బాధ్యతలను తీసుకుంటారు. జూదవ్యాపారాలు రాణించవు. మే 23 ఉదయం 8.24 నుంచి 25 ఉ దయం 8.28 వరకు సమయం వ్యతిరేకము.

**జూన్ :** అనవసర ఖర్చులు పెరుగును. క్రమశిక్షణాయుత పద్ధతిని పాటిస్తారు. వాగ్దాన భంగములుండవు. అంచనాలు తారుమారు కావు. వివాద విషయాలలో తలదూర్చవద్దు. సంకల్పబలం నెరవేరును. ఉదర సమస్య రాగల సూచన. సంతానసౌఖ్యం కల్గును. పంతాలకు వెళ్లినందున లబ్ధి తగ్గును. ఆందోళన, విసుగు అధికమగును. కపట స్వభావులు చేసే మోసంతో ఆర్థిక నష్టం. మనోనిబ్బరాన్ని పెంచుకోవాలి. అసత్యాలధికము. జూన్ 19 సాయంత్రం 5.27 నుంచి 21 సాయంత్రం 6.46 వరకు అనుకూల సమయం కాదు.

**జూలై :** మానసిక వత్తిడి తగ్గును. స్థిర లావాదేవీలలో లోపాలు సరిచేస్తారు. ఆదాయానికి పడిన గండిని పూడ్చుకుంటారు. అనవసర ఖర్చును తగ్గిస్తారు. సంతానంపై శ్రద్ధ చూపిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠలకు వెళ్లవద్దు. పైరవీలచే లబ్ధి తగ్గును. మిత్రశత్రుత్వాలను గమనించలేరు. జాయింట్ వ్యాపార నిర్ణయాలు వాయిదాపడును. చర్మ సంబంధ సమస్య రాగల సూచన. రాజకీయవాసులకు అనుకూలం కాదు. పరనిందారోపణలు వద్దు. జూలై 16 రాత్రి 12.20 నుంచి 18 రాత్రి 3.15 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్త అవసరం.

**ఆగస్టు :** సోదర అంశాలు మెరుగుపడును. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగుదురు. శరీరంపై గాయాలు రాగల సూచన. ఆశ్రిత పక్షపాతం వలన నిందలు తప్పవు. పుణ్యకార్యా చరణపై మక్కువ పెరుగును. శస్త్రచికిత్స రాగల సూచన. వాగ్ధోరణిలో అదుపు తప్పుదురు. స్థిరాస్తులలో లోపాలున్నవని గమనించాలి. వాగ్దానాల జోరును తగ్గిస్తారు. శాంత స్వభావంతో అనుకూలతలు లభించును. విమర్శలను ప్రతిఘటిస్తారు. ఆగస్టు 12 రా.తె 5.50 నుంచి 15 ఉదయం 9.35 వరకు ప్రతికూల సమయమని గమనించాలి.

**సెప్టెంబరు :** తలచిన కార్యములు ఆలస్యమగును. రాని బాకీలపై పరిష్కారాలు చేయాలి. సోమరితనం పెరుగును. శస్త్రచికిత్స ఉందని భయపడవద్దు. హాస్యానికి వెళ్లవద్దు. క్షమాపణలకి ప్రాధాన్యత ఇవ్వండి. స్థిరాదాయం తగ్గును. సంతానంపై వ్యాకులత్వం ఏర్పడును. వివేకంతో వ్యవహరించలేరు. సమయస్ఫూర్తితో గుప్తసమాచారాన్ని సేకరిస్తారు. నిద్రలేమి ఉండును. మాసాంతంలో ఆర్థికలబ్ధి. సెప్టెంబరు 9 మధ్యాహ్నం 11.43 నుంచి 11 మధ్యాహ్నం 2.59 వరకు అనుకూల సమయం కాదు.

**అక్టోబరు :** అమూల్యవిశేషాలను రహస్యంగా తెలుసుకుంటారు. ఋణవిముక్తికి మార్గం ఏర్పడును. శరీరానికి వైద్యసేవలు అవసరం. మాసం మధ్యలో స్తంభించిన వ్యవహారాలు కార్యరూపం దాల్చును. అకాల భోజనాదులు కలవు. జీవనోపాధి విషయంలో సరైన నిర్ణయం ఉండును. తోబుట్టువులు సహకరిస్తారు. విమర్శలకు దూరంగా ఉంటారు. కుటుంబ నిర్ణయాలని శిరసావహిస్తారు. భేషజాలకు వెళ్లరు. అక్టోబరు 6 రాత్రి 7.31 నుంచి 8 రాత్రి 9.59 వరకు సమయం వ్యతిరేకమని గ్రహించాలి.

**నవంబరు :** కార్యదీక్షా బాధ్యతలను సజావుగా నిర్వహిస్తారు. అశాంతితో తీసుకున్న నిర్ణయాలు ఫలించవు. రాజీధోరణితో వెళ్లుట ఉత్తమం. సంతానం ద్వారా శుభవార్తలు. కుటుంబ కలతలు సమసిపోవును. దూరప్రాంత ప్రయాణాలు విజయం చేకూర్చును. నవంబరు 2 రా.తె 5.29 నుంచి 5 ఉదయం 6.27 వరకు తిరిగి 30 సాయంత్రం 4.13 నుంచి డిశంబరు 2 సాయంత్రం 5.25 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**డిశంబరు :** స్వయంరంగాల వారికి లబ్ధి. రానిబాకీలపై పరిష్కారాలు తెలుసుకుందురు. శుభకార్యాలలో నూతన పరిచయాలు ఏర్పడును. పితృవర్గం వారితో స్వల్ప పేచీ. ఉద్యోగుల పైన నిఘా కలదు. హామీలచే నష్టముండును. స్తంభించిన వ్యవహారాలు కార్యరూపం దాల్చును. స్థానచలన అవకాశాలు లేవు. డిశంబరు 27 రాత్రి 1.37 నుంచి 29 రా.తె 4.22 వరకు సమయం అనుకూలం కాదు.

## శుక్ల సప్తమి, బహుళ నవమి తిథులలో 'శివదూతీ' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత ఎరుపు వస్త్రాలు ధరించి నవరత్నాలు పొదిగిన కిరీటంతోను 3 కన్నులు, 8 చేతులు కల్గి భగభగమండే మండుటెండలో వెలిగే సూర్యబింబంలా ప్రకాశించును. అంకుశము, గద, కొమ్ము, గొడ్డలి, కత్తి, కమలము, కవచము, పాయసపాత్ర చేతులలో ఉండును.

శుక్ల సప్తమి, బహుళ నవమి తిథులలో సాయంత్ర సమయంలో ఈ దేవతని ప్రార్థించాలి. అన్యాయ, అక్రమాలు చేసే వారిని దరికి చేరనివ్వదు. గొంతెమ్మ కోర్కెలు కాకుండా న్యాయపరమైన, సమంజసమైన కోర్కెలను తీర్చును.

పూర్వగణిత పంచాంగ సమయాలు ఖచ్చితములు కావు. అందుచేత ఈ దేవతల అనుగ్రహం పొందాలంటే పాటించే తిథి సమయం ఖచ్చితమై ఉండాలి.

| | |
|---|---|
| ఓం విద్యావిద్యాస్వరూపిణ్యై నమః | **(402)** |
| ఓం మనోవాచామగోచరాయై నమః | **(415)** |
| ఓం ద్విజబృందనిషేవితాయై నమః | **(423)** |
| ఓం పంచకోశాంతరస్థితాయై నమః | **(428)** |
| ఓం మదఘూర్ణితరక్తాక్ష్యై నమః | **(432)** |
| ఓం మదపాటలగండభువే నమః | **(433)** |
| ఓం చందనద్రవదిగ్ధాంగ్యై నమః | **(434)** |
| ఓం చాంపేయకుసుమప్రియాయై నమః | **(435)** |
| ఓం కుమారగణనాథాంబాయై నమః | **(442)** |
| ఓం లోలాక్షీకామరూపిణ్యై నమః | **(454)** |
| ఓం మలయాచలవాసిన్యై నమః | **(458)** |
| ఓం వయోవస్థావివర్జితాయై నమః | **(470)** |
| ఓం విశుద్ధచక్రనిలయాయై నమః | **(475)** |
| ఓం ఖట్వాంగాదిప్రహరణాయై నమః | **(478)** |
| ఓం వదనైకసమన్వితాయై నమః | **(479)** |
| ఓం పశులోకభయంకర్యై నమః | **(482)** |

## శుక్ల అష్టమి, బహుళ అష్టమి తిథులలో 'త్వరితా' నిత్యా దేవత పారాయణ నామాలు

త్వరిత దేవత 3 నేత్రాలు, 4 చేతులతో పద్మముఖంతో శాంతస్వరూపిణియై పద్మాసనంతో ఆసీనురాలై చిరుమంద హాసం చేస్తూ సుగంధాలు వెదజల్లే శరీరంతో ఉండును. తలపై కిరీటరూపంలో 5 నెమలిపింఛములు కల్గి నాల్గు విధాలైన 8 గొప్ప సర్పాలను ముంజేతి గాజులుగా, కర్ణాభర ణములుగా, వడ్డాణముగా, కాలి ఆభరణాలుగా ధరించి ఉండును. శుక్ల బహుళ అష్టమి తిథులలో ప్రార్థించాలి.

విద్య, ఉద్యోగం, ఆరోగ్యం, సంపద, దీర్ఘాయువు కల్గుటే కాక శరీరకాంతిని అందించి విషశస్త్ర భయం నుంచి దూరం చేయును. ఖచ్చితమైన సమయాలతో ఉన్న దృగ్గణిత పంచాంగంలోని తిథి సమయాలనే పాటించండి. పూర్వ గణిత పంచాంగాలలోని తిథులు ఋజువునకు సరిరావు.

| | |
|---|---|
| ఓం అనాహతాబ్జనిలయాయై నమః | **(485)** |
| ఓం మహావీరేంద్రవరదాయై నమః | **(493)** |
| ఓం రాకిన్యంబాస్వరూపిణ్యై నమః | **(494)** |
| ఓం మణిపూరాబ్జనిలయాయై నమః | **(495)** |
| ఓం వదనత్రయసంయుతాయై నమః | **(496)** |
| ఓం వజ్రాదికాయుధోపేతాయై నమః | **(497)** |
| ఓం డామర్యాదిభిరావృతాయై నమః | **(498)** |
| ఓం గుడాన్నప్రీతమానసాయై నమః | **(501)** |
| ఓం సమస్తభక్తసుఖదాయై నమః | **(502)** |
| ఓం లాకిన్యంబాస్వరూపిణ్యై నమః | **(503)** |
| ఓం స్వాధిష్ఠానాంబుజగతాయై నమః | **(504)** |
| ఓం చతుర్వక్త్రమనోహరాయై నమః | **(505)** |
| ఓం శూలాద్యాయుధసంపన్నాయై నమః | **(506)** |
| ఓం బందిన్యాదిసమన్వితాయై నమః | **(511)** |
| ఓం దధ్యన్నాసక్తహృదయాయై నమః | **(512)** |
| ఓం కాకినీరూపధారిణ్యై నమః | **(513)** |

## శుక్ల నవమి, బహుళ సప్తమి తిథులలో 'కులసుందరీ' నిత్యా దేవత పారాయణ నామాలు

కులసుందరి దేవత 6 ముఖాలు కల్గి, ఒక్కో ముఖానికి 3 కనుల చొప్పున 18 నేత్రాలతో, 12 చేతులతో ఎర్రని దుస్తులు ధరించి, ఎరుపు ఆభరణాలతో మాణిక్యాలు పొదిగిన కిరీటమును శిరస్సుపై ఉంచుకొని శరీరానికి ఎర్రని లేపనమును గంధముగా పూసుకొని ప్రసన్న వదనురాలై చిరు మందహాసం చేస్తూ ఎర్రకమలంపై ఆసీనురాలై ఉండును. పగడపు మాల, పద్మము, బంగారునాణెముల పాత్ర, దబ్బపండు, కమండలము, పుస్తకము, ఎర్ర కమలము, స్వర్ణ కలము, రత్నమాల, శంఖములను కల్గి ఒక చేతితో వర ముద్రతోను మరియు చిన్ముద్ర కల్గి ఉండును. వ్యక్తులకు వారి వారి రంగాలలో విశేష ప్రజ్ఞా పాటవాలను అందించి పలువురి చేత సర్వజ్ఞుడిగా కీర్తింపబడేలా అనుగ్రహించును.

| | |
|---|---|
| ఓం మూలాధారాంబుజారూఢాయై నమః | **(514)** |
| ఓం అంకుశాదిప్రహరణాయై నమః | **(517)** |
| ఓం వరదాదినిషేవితాయై నమః | **(518)** |
| ఓం ముద్గౌదనాసక్తచిత్తాయై నమః | **(519)** |
| ఓం సాకిన్యంబాస్వరూపిణ్యై నమః | **(520)** |
| ఓం ఆజ్ఞాచక్రాబ్జనిలయాయై నమః | **(521)** |
| ఓం హరిద్రాన్నైకరసికాయై నమః | **(526)** |
| ఓం హాకినీరూపధారిణ్యై నమః | **(527)** |
| ఓం సహస్రదళపద్మస్థాయై నమః | **(528)** |
| ఓం సర్వవర్ణోపశోభితాయై నమః | **(529)** |
| ఓం సర్వౌదనప్రీతచిత్తాయై నమః | **(533)** |
| ఓం యాకిన్యంబాస్వరూపిణ్యై నమః | **(534)** |
| ఓం పుణ్యశ్రవణకీర్తనాయై నమః | **(544)** |
| ఓం వియదాదిజగత్ప్రసువే నమః | **(550)** |
| ఓం సర్వవ్యాధిప్రశమన్యై నమః | **(551)** |
| ఓం సర్వమృత్యునివారిణ్యై నమః | **(552)** |

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్ కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

పంచాంగకర్త: శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినిగార్గేయ గార్లచే రచించబడినది. హైదరాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర ఆషాఢమాస శుక్ల అష్టమి శనివారం నుంచి శ్రావణమాస శుక్ల అష్టమి సోమవారం వరకు

# 2017 JULY జూలై

ఆషాఢ పూర్ణిమ వరకు రవి, కుజులు మిధున రాశిలో కలిసి సంచారం చేస్తారు. దీని ప్రభావం ద్వాదశరాశులపై ఎలా ఉంటుందో ఆ సమయానికి www.gargeyam.com క్లిక్ చేయండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము: సా4.56-5.48<br>రా.కా: సా4.30-6.00 | **30**<br>శు.సప్తమి ఉ8.06<br>చిత్ర ఉ7.23<br>వ.మ1.31-3.16 | **2**<br>శు.నవమి రా8.19<br>చిత్ర రా12.00<br>వ.ఉ6.34-8.19 | **○9**<br>ఆషాఢపూర్ణిమ ఉ9.36<br>పూర్వాషాఢ సా4.48<br>వ.రా1.35-3.21 | **16**<br>బ.సప్తమి మ1.37<br>రేవతి రా12.20<br>వ.మ12.34-2.00 | **23●**<br>ఆషాఢఅమావాస్యమ3.15<br>పునర్వసు ఉ9.53<br>వ.సా5.10-6.37 |
| **MON సోమ**<br>దుర్ము:మ12.37-1.29<br>మ3.13-4.05<br>రా.కా:ఉ7.30-9.00 | **31**<br>శు.అష్టమి ఉ9.46<br>స్వాతి ఉ9.40<br>వ.మ3.53-5.40 | **3**<br>శు.దశమి రా10.15<br>స్వాతి రా2.36<br>వ.ఉ6.13-7.59 | **10**<br>బ.పాడ్యమి మ11.25<br>ఉత్తరాషాఢ రా7.09<br>వ.రా11.30-1.14 | **17**<br>బ.అష్టమి మ12.05<br>అశ్వని రా11.19<br>వ.రా7.29-9.01 | **24**<br>శ్రావణమాసారంభం<br>శు.పాడ్యమి మ12.22<br>పుష్యమి ఉ7.44<br>వ.రా7.37-9.06 |
| **TUE మంగళ**<br>దుర్ము: ఉ8.18-9.10<br>రా11.05-11.50<br>రా.కా: మ3.00-4.30 | **పండుగలు**<br>3. మహాలక్ష్మి వ్రతారంభం<br>4. శయనే(తొలి)ఏకాదశి<br>చాతుర్మాస్యవ్రతారంభం<br>5. వాసుదేవద్వాదశి<br>8. కోకిలావ్రతం<br>9. గురుపూర్ణిమ,మహాషాఢి సికింద్రాబాద్ మహంకాళీ జాతర<br>11. ఆడిపదినెట్టు<br>12. సంకష్టహరచతుర్థి<br>16. రుద్రసావర్ణిక మన్వాది కర్కాటకసంక్రమణం దక్షిణాయనప్రారంభం భానుసప్తమి<br>19. ఆడికృత్తిక కామికాఏకాదశి<br>22. మాసశివరాత్రి సాయందీపస్తంభారాధన<br>24. శ్రావణచంద్రోదయం<br>25. జిల్లాజ్‌నెల ప్రారంభం<br>26. మధుశ్రవావ్రతం నాగచతుర్థి (మ.వ్యాప్తి) దూర్వాగణపతి వ్రతం<br>27. గరుడపంచమి<br>28. సామవేదఉపాకర్మ<br>29. సూర్యషష్ఠి<br>30. భానుసప్తమి | **4**<br>శు.ఏకాదశి రా12.29<br>విశాఖ తె5.27<br>వ.ఉ8.52-10.39 | **11**<br>బ.విదియ మ12.56<br>శ్రవణం రా9.11<br>వ.రా1.27-3.10 | **18**<br>బ.నవమి ఉ10.00<br>భరణి రా9.45<br>వ.ఉ8.17-9.47 | **25**<br>శు.విదియ ఉ9.57<br>ఆశ్లేష ఉ6.01<br>మఖ తె4.52<br>వ.సా5.26-6.58 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.46-12.38<br>రా.కా:<br>మ12.00-1.30 | | **5**<br>శు.ద్వాదశి రా2.51<br>అనూరాధ పూర్తిగా<br>వ.ఉ9.57-11.44 | **12**<br>బ.తదియ మ2.03<br>ధనిష్ఠ రా10.49<br>వర్జ్యం లేదు | **19**<br>బ.దశమి ఉ7.25<br>బ.ఏకాదశి తె4.27<br>కృత్తిక రా7.45<br>వ.ఉ8.45-10.13 | **26**<br>శు.తదియ ఉ8.08<br>పూర్వఫల్గుణి తె4.24<br>వ.మ12.43-2.17 |
| **THU గురు**<br>దుర్ము:ఉ10.02-10.54<br>మ3.13-4.05<br>రా.కా:మ1.30-3.00 | | **6**<br>శు.త్రయోదశి తె5.14<br>అనూరాధ ఉ8.25<br>వ.మ2.42-4.30 | **13**<br>బ.చవితి మ2.44<br>శతభిషం రా12.00<br>వ.ఉ6.23-8.03 | **20**<br>బ.ద్వాదశి రా1.12<br>రోహిణి సా5.25<br>వ.ఉ10.12-11.38<br>వ.రా10.26-11.52 | **27**<br>శు.చవితి ఉ7.01<br>ఉత్తర తె4.40<br>వ.మ11.41-1.18 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.19-9.11<br>మ12.38-1.30<br>రా.కా:ఉ10.30-12.00 | | **7**<br>శు.చతుర్దశి పూర్తిగా<br>జ్యేష్ఠ మ11.21<br>వ.రా8.18-10.05 | **14**<br>బ.పంచమి మ2.55<br>పూర్వాభాద్ర రా12.41<br>వ.ఉ6.35-8.14 | **21**<br>బ.త్రయోదశి రా9.49<br>మృగశిర మ2.53<br>వ.రా10.24-11.49 | **28**<br>శు.పంచమి ఉ6.38<br>హస్త తె5.41<br>వ.మ1.25-3.05 |
| **SAT శని**<br>దుర్ము:ఉ5.42-7.26<br>రా.కా:ఉ9.00-10.30 | **1**<br>శు.అష్టమి సా6.51<br>హస్త రా9.51<br>శేషవర్జ్యం ఉ6.55వరకు | **8**<br>శు.చతుర్దశి ఉ7.31<br>మూల మ2.11<br>వ.మ12.23-2.11<br>వ.రా12.50-2.36 | **15**<br>బ.షష్ఠి మ2.33<br>ఉత్తరాభాద్ర రా12.48<br>వ.ఉ10.20-11.56 | **22**<br>బ.చతుర్దశి సా6.27<br>ఆర్ద్ర మ12.20<br>వ.రా11.06-12.33 | **29**<br>శు.షష్ఠి ఉ7.01<br>చిత్ర పూర్తిగా<br>వ.మ2.15-3.58 |

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## జూలై శుభసమయములు

**శ్రీ హేమలంబ ఆషాఢమాసము**

| | |
|---|---|
| 01 | శని శు.అష్టమి హస్త ఉ07.27-8.56 |
| 01 | శని శు.అష్టమి హస్త మ11.02-1.07 |
| 01 | శని శు.నవమి హస్త సా6.52-9.32 |
| 02 | ఆది శు.నవమి చిత్ర ఉ10.58-1.03 |
| 02 | ఆది శు.నవమి చిత్ర సా5.49-8.19 |
| 03 | సోమ శు.దశమి స్వాతి ఉ8.00-8.48 |
| 03 | సోమ శు.దశమి స్వాతి ఉ10.54-12.36 |
| 03 | సోమ శు.దశమి స్వాతి సా5.23-9.24 |
| 05 | బుధ శు.ద్వాదశి అనూరాధ ఉ6.28-8.40 |
| 05 | బుధ శు.ద్వాదశి అనూరాధ సా5.15-9.16 |
| 06 | గురు శు.త్రయోదశి అనూరాధ ఉ6.24-8.25 |
| 07 | శుక్ర శు.చతుర్దశి మూల మ11.22-12.37 |
| 07 | శుక్ర శు.చతుర్దశి మూల సా5.07-8.17 |
| 08 | శని శు.చతుర్దశి మూల ఉ6.16-7.31 |
| 08 | శని పూర్ణిమ మూల ఉ7.32-10.34 |
| 09 | ఆది బ.పాడ్యమి ఉత్తరాషాఢ సా5.50-9.00 |
| 10 | సోమ బ.పాడ్యమి ఉత్తరాషాఢ ఉ6.08-8.20 |
| 10 | సోమ బ.విదియ ఉత్తరాషాఢ మ11.26-12.31 |
| 10 | సోమ బ.విదియ ఉత్తరాషాఢ సా4.55-7.09 |
| 10 | సోమ బ.విదియ శ్రవణం రా7.10-8.56 |
| 12 | బుధ బ.తదియ ధనిష్ఠ ఉ10.18-11.46 |
| 12 | బుధ బ.చవితి ధనిష్ఠ సా6.56-8.48 |
| 13 | గురు బ.చవితి శతభిషం ఉ10.56-12.19 |
| 13 | గురు బ.పంచమి శతభిషం సా6.52-8.44 |
| 15 | శని బ.సప్తమి ఉత్తరాభాద్ర సా6.44-8.36 |
| 16 | ఆది బ.సప్తమి రేవతి ఉ10.02-12.07 |
| 16 | ఆది బ.అష్టమి రేవతి సా6.40-8.32 |
| 17 | సోమ బ.నవమి అశ్వని సా6.36-7.28 |
| 19 | బుధ బ.ఏకాదశి రోహిణి రా7.46-8.20 |

**శ్రీ హేమలంబ శ్రావణమాసము**

| | |
|---|---|
| 27 | గురు శు.పంచమి ఉత్తర ఉ9.18-10.05 |
| 27 | గురు శు.పంచమి ఉత్తర ఉ10.58-11.40 |
| 27 | గురు శు.పంచమి ఉత్తర సా5.56-7.48 |
| 28 | శుక్ర శు.షష్ఠి హస్త ఉ9.16-12.38 |
| 28 | శుక్ర శు.షష్ఠి హస్త సా5.52-7.44 |
| 29 | శని శు.సప్తమి చిత్ర ఉ9.10-మ1.25 |
| 29 | శని శు.సప్తమి చిత్ర సా5.48-7.40 |
| 30 | ఆది శు.అష్టమి స్వాతి ఉ9.06-మ1.21 |
| 30 | ఆది శు.అష్టమి స్వాతి సా5.48-7.36 |
| 31 | సోమ శు.అష్టమి స్వాతి ఉ9.02-9.39 |

*Engagements*

## చవితి, అష్టమి, నవమి ముహూర్తాలు దోషములు కావు

పంచాంగాలలో ఉండే చవితి షష్ఠి అష్టమి నవమి ద్వాదశి చతుర్దశి తిథులనగానే సహజం గానే ప్రజలు ఆందోళన చెందుతూ, భయపడుతుంటారు. ఈ తిథులలో శుభ కార్యములు ఆచరించకూడదని పలువురు విశ్వసిస్తుంటారు. ఈ తిథి సమయాలలో సుముహూర్తములను పంచాంగకర్తలు నిర్ణయించి తమ తమ పంచాంగాలలో ముద్రిస్తుంటారు.

ఈ తిథులలో ముహూర్తాలు చేయకూడదని చాలా మంది భావిస్తుంటారు. ఇది పొరపాటు. ముహూర్తం నిర్ణయించిన నాటి గ్రహబలాబలాలను గ్రహించే, ముహూర్తాలను పండితులు నిర్ణయిస్తారు. చవితి ప్రారంభమైన 10గంటల తదుపరి, షష్ఠి ప్రారంభమైన 2 గంటల తదుపరి, అష్టమి ద్వాదశి తిథులు ప్రారంభమైన 5గం॥36నిముషాల తదుపరి, నవమి చతుర్దశి తిథులు ప్రారంభమైన 4గం॥24నిముషాల తదుపరి శుభప్రద సమయమని శాస్త్ర నిర్దేశము. ఒకవేళ పై సమయాలకి ముందున్న సమయంలో ముహూర్తాలున్ననూ దోషం కానేకాదు. ఎందుకంటే గురువు, శుక్రుడు, బుధుడు అనే శుభగ్రహాల స్థితిగతులను బట్టి ముహూర్త దోషాలు ఉండవని శాస్త్రనిర్దేశము. గనుక పాఠకులు గమనించేది.

## త్రిజ్యేష్ఠ, జ్యేష్ఠా చతుష్టయం, జ్యేష్ఠా పంచకములు

జ్యేష్ఠులనగా తొలిచూలు పిల్లలని అర్థము. వధువు కంటే, వరుని కంటే ముందు ఒకరు లేక చాలామంది జన్మించి మరణించినచో ఆ మరణించిన వారిలో ప్రథములే జ్యేష్ఠులగుదురు. జీవించి ఉన్న వారిననుసరించి జ్యేష్ఠా నిర్ణయములు చేయరాదు. జన్మ క్రమం విడిచి స్త్రీ పురుషులలో జ్యేష్ఠా నిర్ణయము శాస్త్ర విరుద్ధము. జీవించి ఉన్ననూ, మరణించిననూ ప్రథమ గర్భమున జన్మించినటువంటి వారే జ్యేష్ఠులని భావము. 1. వధూవరులిరువురూ జ్యేష్ఠులై జ్యేష్ఠమాసములో వివాహం చేయటాన్ని త్రిజ్యేష్ఠ అంటారు. 2. వధూవరులలో ఒకరు జ్యేష్ఠులై, వారిలో ఒకరిది జ్యేష్ఠా నక్షత్రమై, జ్యేష్ఠమాసంలో వివాహం చేయటం త్రిజ్యేష్ఠే.
3. వధూవరులిరువురూ జ్యేష్ఠులు కాకున్ననూ జ్యేష్ఠమాసంలో జన్మించి, జ్యేష్ఠంలో వివాహం జరగటం త్రిజ్యేష్ఠే. 4. వధూవరులిరువురూ జ్యేష్ఠులుగాకున్ననూ వారి జన్మనక్షత్రాలు జ్యేష్ఠలై జ్యేష్ఠమాసంలో వివాహం త్రిజ్యేష్ఠయే. 5. వధూవరులు ఇరువురూ జ్యేష్ఠులై వారిలో ఒకరిది జ్యేష్ఠానక్షత్రమై జ్యేష్ఠమాస వివాహం జ్యేష్ఠా చతుష్టయమగును. 6. వధూవరులు ఇరువురూ జ్యేష్ఠులై ఇరువురి నక్షత్రములు జ్యేష్ఠలై జ్యేష్ఠమాస వివాహాన్ని జ్యేష్ఠా పంచకమందురు.



# తులారాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:4, రాజ్యపూజ్యం:5, అవమానం:6

శ్రీ హేమలంబ : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:1, అవమానం:5

**జనవరి:** ముఖ్యకార్యాలను వాయిదా వేస్తారు. ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చగును. సహచరులతో విభేదాలు తగ్గును. 3వవారంలో మనస్థైర్యం సన్నగిల్లును. అవివాహితులు నిర్ణయాలు తీసుకోలేరు. సెటిల్‌మెంట్ వ్యవహారంలో లోపాలు పెరుగును. ప్రతిభకు రాణింపు కలదు. వ్యక్తిగత విమర్శలచే న్యాయపోరాటం వద్దు. జనవరి 8 సాయంత్రం 5.54 నుంచి 10 సాయంత్రం 6.44 వరకు ప్రతికూలం.

**ఫిబ్రవరి:** సొంతవారిని విభేదించవద్దు. చలాకీతనం, కళాకాంతులు తగ్గును. జాయింట్ నిర్వహణలో లోపాలు కనపడును. సోదర సమన్వయం అవసరమని గ్రహిస్తారు. ఆత్మపరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. స్పెక్యులేషన్ లాభసాటి కాదు. శుభకార్యాలలో సమస్యలున్ననూ విజయం సిద్ధించును. గర్వభంగములుండును. సంయమనం, సమయస్ఫూర్తి మాసాంతంలో అవసరం. ఫిబ్రవరి 4 అర్ధరాత్రి 12.16 నుంచి 6 అర్ధరాత్రి 2.39 వరకు వ్యతిరేకము.

**మార్చి:** మానసిక వత్తిడి తగ్గును. స్వీయకల్పనాశక్తి పెరుగును. శుభకార్యాచరణకు రంగం సిద్ధం. వృధా ప్రయాణాలు ఉండవు. స్థానచలన అవకాశములు లేవు. స్పెక్యులేషన్ రాణింపు కలదు. ఆడంబరాలకు ధనవ్యయం. వివాదాంశాలు మటుమాయం. ప్రయత్న పూర్వకంగా కార్యసిద్ధి ఉండదు. వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. బుద్ధిబలం, మనోబలాన్ని పెంచుకోవాలి. మార్చి 4 ఉదయం 5.40 నుంచి 6 ఉదయం 8.21 వరకు అనుకూల సమయం కాదు.

**ఏప్రిల్ :** వాగ్ధోరణిలో అనుకూల మార్పులు. బుద్ధిబలం, ఋణభారం పెరుగును. నూతన నిర్ణయాలతో గాలి పీల్చుకుంటారు. స్థిర సంభాషణల వైపు మగ్గుదురు. రహస్య అంశాలను బహిర్గతం చేయవద్దు. స్వయంవృత్తుల వారికి పెట్టుబడి అధికంగా లభించును. మగత నిద్ర వలన నష్టం. గతనెల 31 మధ్యాహ్నం 12.32 నుంచి ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 వరకు తిరిగి 27 రాత్రి 9.48 నుంచి 29 రాత్రి 9.45 వరకు సమయములు అనుకూలం కాదని గమనించాలి.

**మే :** మాతృవర్గీయులచే లబ్ధి. కీర్తిప్రతిష్ఠలను రక్షించుకుంటారు. వాతరోగబాధలు 2వ పక్షంలో అధికము. ధనక్షయానికి అడ్డుకట్ట వేస్తారు. అంచనాలు తారుమారు కాకుండా చూస్తారు. ఆగ్రహావేశాలు తగ్గును. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. దూరప్రయాణాలు మరియు విధి విధానాలలో మార్పులు కల్గును. ఆర్థిక సామాజిక విలువలపై శ్రద్ధ పెరుగును. వ్యూహాత్మక అంశాలను ఛేదిస్తారు. మే 25 ఉదయం 8.28 నుంచి 27 ఉదయం 7.36 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూన్ :** వేధింపు జనుల విమర్శలను తట్టుకుందురు. కపట స్వభావుల మాటలకు లొంగవద్దు. రాజీధోరణిని అవలంబించాలి. స్పెక్యులేషన్‌లో తరచూ అపజయాలున్నవి. స్థిరాస్తులలో జాగ్రత్తలవసరం. భ్రాంతితో తరచూ వ్యవహరిస్తారు. 2వవారం నుంచి ఉన్నత వ్యక్తులచే కార్యసిద్ధి. రావలసిన బాకీలు వసూలగును. నూతన తేజస్సును పొందుదురు. జూన్ 21 సాయంత్రం 6.46 నుంచి 23 సాయంత్రం 6.19 వరకు ప్రతికూల సమయము.

**జూలై :** వివాద అంశాలపై సాహసాలు చేయవద్దు. ధనక్షయం జరుగును. ఆరోపణలు, విమర్శలు అధికం. స్వీయనిర్ణయాలు ఫలించవు. అంచనాలు తారుమారు కాగలవు. మాసం చివరలో ఆర్థికంగా లబ్ది కల్గును. శరీర అలసత్వానికి గురిచేయవద్దు. విధి విధాన మార్పులచే విజయం చేకూరును. ఎత్తులకు పై ఎత్తులు వేయగలరు. కళత్రంచే లబ్ధి అధికము. పుకార్లచే సమస్యలు పెరిగిననూ ధైర్యంగా ఉంటారు. వ్యాపార అంశాలలో పావులు కదుపుతారు. జూలై 18 రాత్రి 3.15 నుంచి 20 రా.తె 4.09 వరకు అనుకూల సమయం కాదు.

**ఆగస్టు :** న్యాయవ్యవహారాలపై మక్కువ పెంచండి. పరిష్కారం కాని సమస్య తెరపైకి వచ్చును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లాభం. కఠినవాక్కులతో స్నేహితుల మనసును గాయపరుచుదురు. ఆశ్రిత పక్షపాతం పెరుగును. స్వయంవృత్తుల వారికి పురోగమనం. వాగ్దానాలు భంగము కాకుండా జాగ్రత్త పడాలి. రాజీప్రయత్నాలు నెరవేరును. ఆగస్టు 15 ఉదయం 9.35 నుంచి 17 మధ్యాహ్నం 11.54 వరకు వ్యతిరేక సమయంగా గ్రహించాలి.

**సెప్టెంబరు:** స్థిరాదాయం తగ్గును. అనవసర ఖర్చులు పెరుగును. ఐననూ మనోవాంఛలు నెరవేరును. అకాల భోజనాదులుండును. సంతానంచే శుభవార్తలు. మానసికచింతన తగ్గించండి. శత్రువులపై కాలుదువ్వవద్దు. ఆశాజనకంతో సమయం గడుపుదురు. లబ్ధి పొందుదురు. అవివాహితులకు యోగం తక్కువ. ఉదరలోపాలకు వైద్యం అవసరం. సెప్టెంబరు 11 మధ్యాహ్నం 2.59 నుంచి 13 సాయంత్రం 5.44 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**అక్టోబరు:** సోమరితనం పెరుగును. నిర్వహణలో బాధ్యతలు పెరుగును. నిద్రలేమి, అకాల భోజనాదులు అధికము. సామరస్య ధోరణిని అవలంబించాలి. అంతరంగిక అంశాలను బహిర్గతం చేస్తారు. వీటిచే విమర్శలు, శత్రుబెడదలు అధికం. పట్టుదలకు వెళ్లి ఆర్థిక నష్టాన్ని చవిచూడవద్దు. నూతన వ్యాపారాలపై ఆసక్తి చూపవద్దు. సోదర సంభాషణలను రహస్యంగా ఉంచండి. అక్టోబరు 8 రాత్రి 9.59 నుంచి 10 రాత్రి 11.17 వరకు సమయం ప్రతికూలమని గ్రహించాలి.

**నవంబరు:** వృత్తివ్యాపారాదులలో ఇతరుల పర్యవేక్షణ చోటుచేసుకొనును. ఉదర లోపములు కలవు. మానసికవత్తిడులు, చికాకులు పెరుగును. బంధుఐక్యానికి ప్రయత్నించండి. మాసాంతంలో ఆశాజనక పరిస్థితులు. అవివాహితులకు శుభకాలము. ఋణసదుపాయం ఏర్పడును. సామర్థ్యం లేని వ్యక్తులచే విమర్శలు. సెంటిమెంట్ బలాన్ని పెంచుకుంటారు. నవంబరు 5 ఉదయం 6.27 నుంచి 7 ఉదయం 6.43 వరకు ముఖ్య విషయాలలో జాగ్రత్తలవసరం.

**డిశంబరు :** అభివృద్ధి అంశాలపై దృష్టి పెడుదురు. మానసిక చింత తగ్గును. వ్యక్తిగత విమర్శలను తట్టుకుంటారు. ముఖ్యప్రయాణాలు రద్దు కాగలవు. ఆర్థిక అంశాలపై పట్టు సాధిస్తారు. పాత మిత్రత్వం కోరుకుంటారు. పంతాలకు వెళ్లవద్దు. పెద్దల నిర్ణయాలను గౌరవిస్తారు. డిశంబరు 2 సాయంత్రం 5.25 నుంచి 4 సాయంత్రం 4.51 వరకు తిరిగి 29 రా.తె4.22 నుంచి 31 రా.తె 4.23 వరకు సమయములు అనుకూలం కాదు.

## శుక్ల దశమి, బహుళ షష్ఠి తిథులలో 'నిత్యా' నిత్యా దేవత పారాయణ నామాలు

నిత్యా దేవత 6 ముఖాలు కల్గి, ఒక్కో ముఖానికి 3 కనుల చొప్పున 18 నేత్రాలతో, 12 చేతులతో ఎర్రని దుస్తులు ధరించి ఎరుపు ఆభరణాలను మాణిక్యాలను ధరించి ఉండును. ఈ దేవత చేతులలో పాశము, అంకుశము, తెల్ల కలువ, చెరకు విల్లు, కవచము, త్రిశూలము, పుస్తకము, పుష్పబాణాలు, కత్తి, అభయ వర ముద్రలతో ప్రమిద వంటి పాత్రను పట్టుకుని ఉండును.

ఈ దేవతను ఆరాధించినందున శారీరక శక్తిని పెంపొందించి, వాక్శుద్ధితో పాటు మృదు సంభాషణా నైపుణ్యమును అలవరింపచేయును. ప్రతినెలలో వచ్చే శుక్ల దశమి, బహుళ షష్ఠి తిథులు ఉన్న సాయంత్ర సమయాలలో ధ్యానించేది. పూర్వగణిత పంచాంగంలోని తిథి సమయాలు కాకుండా, ఖచ్చిత తిథులున్న దృగ్గణిత పంచాంగాలను వినియోగించండి.

ఓం కలికల్మషనాశిన్యై నమః (555)
ఓం కమలాక్షనిషేవితాయై నమః (558)
ఓం తాంబూలపూరితముఖ్యై నమః (559)
ఓం దాడిమీకుసుమప్రభాయై నమః (560)
ఓం మైత్ర్యాదివాసనాలభ్యాయై నమః (570)
ఓం మహాప్రళయసాక్షిణ్యై నమః (571)
ఓం ప్రజ్ఞానఘనరూపిణ్యై నమః (574)
ఓం మాతృకావర్ణరూపిణ్యై నమః (577)
ఓం మహాకైలాసనిలయాయై నమః (578)
ఓం మృణాలమృదుదోర్లతాయై నమః (579)
ఓం మహాసామ్రాజ్యశాలిన్యై నమః (582)
ఓం శ్రీషోడశాక్షరీవిద్యాయై నమః (587)
ఓం త్రికోణాంతరదీపికాయై నమః (597)
ఓం దక్షయజ్ఞవినాశిన్యై నమః (600)
ఓం దరాందోళితదీర్ఘాక్ష్యై నమః (601)
ఓం దరహాసోజ్జ్వలన్ముఖ్యై నమః (602)

## శుక్ల ఏకాదశి, బహుళ పంచమి తిథులలో 'నీలపతాకా' నిత్యా దేవత పారాయణ నామాలు

నీలపతాక దేవత ఇంద్రనీల వర్ణముతో ఉండి, ఒక్కో శిరస్సుకు మూడు నేత్రములు చొప్పున 5 శిరస్సులు కల్గి ఎరుపు వర్ణ దుస్తులను అందమైన వజ్రాభరణములను ధరించి చిరుమందహాసంతో 10 చేతులను కల్గి ఉండును. పాశము, పతాకము, కవచము, ధనస్సు, వరముద్ర, అంకుశము, కత్తి, బాణాలు, అభయముద్ర శక్తి ఆయుధములు ఉండును.

వర్తక,వాణిజ్యములయందు విజయప్రాప్తి సిద్ధించే విధంగా, చక్కని ఆలోచనలను అందించటమే కాక ఒక్కోసారి జీవనపోరాటంలో నెగ్గుటకు సమయస్ఫూర్తితో ఆలోచనలు అందించును. ప్రతినెలలో వచ్చే శుక్ల ఏకాదశి, బహుళ పంచమి తిథుల సాయంత్ర సమయంలో ప్రార్థించేది. పూర్వ గణిత పంచాంగ తిథి సమయాలను స్వీకరించవద్దు. ఖచ్చిత తిథులు ఉన్నప్పుడు మాత్రమే అనుగ్రహం లభించును.

ఓం దహరాకాశరూపిణ్యై నమః (609)
ఓం కావ్యాలాపవినోదిన్యై నమః (613)
ఓం కైవల్యపదదాయిన్యై నమః (625)
ఓం సింధూరతిలకాంచితాయై నమః (632)
ఓం సర్వవేదాంతసంవేద్యాయై నమః (645)
ఓం సత్యానందస్వరూపిణ్యై నమః (646)
ఓం లోపాముద్రార్చితాయై నమః (647)
ఓం సదసద్రూపధారిణ్యై నమః (661)
ఓం లోకయాత్రావిధాయిన్యై నమః (664)
ఓం బ్రహ్మాత్మైక్యస్వరూపిణ్యై నమః (672)
ఓం భావాభావవివర్జితాయై నమః (680)
ఓం శోభనాసులభాగత్యై నమః (683)
ఓం చతురంగబలేశ్వర్యై నమః (691)
ఓం సర్వలోకవశంకర్యై నమః (697)
ఓం సచ్చిదానందరూపిణ్యై నమః (700)
ఓం దేశకాలాపరిచ్ఛిన్నాయై నమః (701)

## శుక్ల ద్వాదశి, బహుళ చవితి తిథులలో 'విజయా' నిత్యా దేవత పారాయణ నామాలు

అరుణవర్ణముతో ఉండి ఒక్కో శిరస్సునకు 3 నేత్రాలు చొప్పున చిరునవ్వు చిందించే 5 శిరస్సులతో 10 భుజములు కల్గి ఉండును. ఆకుపచ్చ, పసుపు మిళితమైన రంగు దుస్తులు ధరించును. కిరీటముపై చంద్రవంక ఉండును. శంఖము, పాశము, కవచము, ధనస్సు, లిల్లీ, చక్రము, అంకుశము, బాణాలు, దబ్బపండు, కత్తి చేతులలో కల్గి ఉండును. వ్యక్తులు ఆచరించే వ్యవహార సరళియందు విజయో త్సాహములు అందిస్తూ సక్రమ మార్గంలో జీవింపచేయును.

ప్రతినెలలో వచ్చే శుక్ల ద్వాదశి, బహుళ చవితి తిథుల సాయంత్ర సమయంలో ప్రార్థించేది. పూర్వగణిత పంచాంగ తిథి సమయాలను స్వీకరించవద్దు. ఖచ్చిత తిథులు ఉన్నప్పుడు మాత్రమే అనుగ్రహం లభించును. కనుక దృగ్గణిత పంచాంగాలనే వినియోగించండి. పూర్వగణితం వద్దు.

ఓం సర్వోపాధివినిర్ముక్తాయై నమః (708)
ఓం సదాశివపతివ్రతాయై నమః (709)
ఓం గురుమండలరూపిణ్యై నమః (713)
ఓం దక్షిణామూర్తిరూపిణ్యై నమః (725)
ఓం సనకాదిసమారాధ్యాయై నమః (726)
ఓం శివజ్ఞానప్రదాయిన్యై నమః (727)
ఓం నామపారాయణప్రీతాయై నమః (732)
ఓం మిథ్యాజగదధిష్ఠానాయై నమః (735)
ఓం భవదావసుధావృష్ట్యై నమః (742)
ఓం పాపారణ్యదవానలాయై నమః (743)
ఓం దౌర్భాగ్యతూలవాతూలాయై నమః (744)
ఓం జరాధ్వాంతరవిప్రభాయై నమః (745)
ఓం రోగపర్వతదంభోళ్యై నమః (748)
ఓం మృత్యుదారుకుఠారికాయై నమః (749)
ఓం జపాపుష్పనిభాకృత్యై నమః (766)
ఓం పాటలీకుసుమప్రియాయై నమః (773)

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

పంచాంగకర్త:
శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణమాస శుక్ల నవమి మంగళవారం నుంచి భాద్రపదమాస శుక్ల దశమి గురువారం వరకు

# 2017 AUGUST ఆగస్టు

ఆగస్టు 7 శ్రావణపూర్ణిమకు పాక్షిక చంద్రగ్రహణ ఉన్నందున నూతనులు ఉపాకర్మలాచరించరాదు. ఆగస్టు 21 శ్రావణ అమావాస్యకు సంపూర్ణ సూర్యగ్రహణమున్నది. భారత్‌లో కనపడదు.

| SUN ఆది<br>దుర్ము: సా4.52-5.42<br>రా.కా: సా4.30-6.00 | | 6<br>శు.చతుర్దశిరా10.28<br>ఉత్తరాషాఢ రా1.47<br>వ.ఉ8.19-10.04 | 13<br>బ.షష్ఠి రా9.31<br>అశ్వని తె5.04<br>వ.రా1.12-2.45 | 20<br>బ.చతుర్దశి రా2.09<br>పుష్యమి సా5.23<br>వ.తె5.22లగాయితు | 27<br>శు.షష్ఠి రా10.41<br>స్వాతి సా5.45<br>వ.రా11.55-1.40 |
|---|---|---|---|---|---|
| MON సోమ<br>దుర్ము:మ12.38-1.29<br>మ3.10-4.01<br>రా.కా:ఉ7.30-9.00 | | 7 ○<br>శ్రావణపూర్ణిమరా11.40<br>శ్రవణం రా3.33<br>వ.ఉ6.04-7.47 | 14<br>బ.సప్తమి రా7.45<br>భరణి రా3.57<br>వ.మ2.13-3.45 | ●21<br>శ్రావణఅమావాస్యరా11.59<br>ఆశ్లేష మ3.51<br>శేషవర్జ్యం ఉ6.52వరకు<br>వ.రా3.17-4.49 | 28<br>శు.సప్తమి:రా12.36<br>విశాఖ:రా8.10<br>వ.రా12.38-2.25 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.24-9.15<br>రా11.06-11.51<br>రా.కా: మ3.00-4.30 | 1<br>శు.నవమి మ11.53<br>విశాఖ మ12.21<br>వ.సా4.51-6.38 | 8<br>బ.పాడ్యమి రా12.25<br>ధనిష్ఠ తె4.53<br>వ.ఉ7.46-9.28 | 15<br>బ.అష్టమి సా5.39<br>కృత్తిక రా2.31<br>వ.మ3.14-4.44 | 22<br>భాద్రపదమాసారంభం<br>శు.పాడ్యమిరా10.15<br>మఘ మ2.43<br>వ.రా10.30-12.04 | 29<br>శు.అష్టమి రా2.52<br>అనూరాధ రా10.57<br>వ.తె5.14లగాయితు |
| WED బుధ<br>దుర్ము:మ11.48-12.39<br>రా.కా:<br>మ12.00-1.30 | 2<br>శు.దశమి మ2.13<br>అనూరాధ మ3.16<br>వ.రా9.34-11.22 | 9<br>బ.విదియ రా12.42<br>శతభిషం తె5.46<br>వ.మ12.21-2.00 | 16<br>బ.నవమి మ3.17<br>రోహిణి రా12.50<br>వ.సా5.24-6.53 | 23<br>శు.విదియ రా9.02<br>పూర్వఫల్గుణిమ2.04<br>వ.రా9.15-10.51 | 30<br>శు.నవమి తె5.17<br>జ్యేష్ఠ రా1.54<br>శేషవ.ఉ7.02వరకు |
| THU గురు<br>దుర్ము:ఉ10.06-10.57<br>మ3.11-4.02<br>రా.కా:మ1.30-3.00 | 3<br>శు.ఏకాదశి సా4.36<br>జ్యేష్ఠ సా6.13<br>వ.రా3.10-4.57 | 10<br>బ.తదియ రా12.33<br>పూర్వాభాద్ర పూర్తిగా<br>వ.మ12.17-1.55 | 17<br>బ.దశమి మ12.43<br>మృగశిర రా10.59<br>వ.ఉ6.01-7.29 | 24<br>శు.తదియ రా8.27<br>ఉత్తర మ2.01<br>వ.రా10.37-12.15 | 31<br>శు.దశమి పూర్తిగా<br>మూల తె4.47<br>వ.ఉ10.52-12.39<br>వ.రా3.00-4.47 |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.24-9.15<br>మ12.38-1.29<br>రా.కా:ఉ10.30-12.00 | 4<br>శు.ద్వాదశి సా6.52<br>మూల రా9.02<br>వ.రా7.15-9.02 | 11<br>బ.చవితి రా11.57<br>పూర్వాభాద్ర ఉ6.13<br>వ.మ3.49-5.25 | 18<br>బ.ఏకాదశి ఉ10.01<br>ఆర్ద్ర రా9.04<br>వ.ఉ6.43-8.11 | 25<br>శు.చవితి రా8.31<br>హస్త మ2.36<br>వ.రా11.01-12.42 | |
| SAT శని<br>దుర్ము:ఉ5.52-7.34<br>రా.కా:ఉ9.00-10.30 | 5<br>శు.త్రయోదశిరా8.51<br>పూర్వాషాఢరా11.35<br>వ.ఉ7.40-9.26 | 12<br>బ.పంచమి రా10.56<br>ఉత్తరాభాద్ర ఉ6.14<br>రేవతి తె5.50<br>వ.సా6.02-7.37 | 19<br>బ.12శి ఉ7.17 బ.13శి<br>తె4.38 పునర్వసురా7.09<br>వ.ఉ8.06-9.35<br>వ.రా2.33-4.02 | 26<br>శు.పంచమి రా9.17<br>చిత్ర మ3.52<br>వ.రా9.54-11.38 | |

### పండుగలు

1. కౌమారీదేవీపూజ
2. దధివ్రతారంభం
3. పుత్రదాఏకాదశి
4. వరలక్ష్మీవ్రతం దామోదరద్వాదశి
5. శనిత్రయోదశి
6. కృష్ణయజుర్వేదఉపాకర్మ
7. రక్షాబంధనం, హయగ్రీవజయంతి పాక్షిక చంద్రగ్రహణం
11. సంకష్టహరచతుర్ధి
14. శ్రీకృష్ణజన్మాష్టమి
15. భారత స్వాతంత్ర్యదినం
17. సింహసంక్రాంతి
18. అజఏకాదశి
19. శనిత్రయోదశి
20. మాసశివరాత్రి
21. పోలాల అమావాస్య సోమవతీ అమావాస్య సూర్యగ్రహణంభారత్‌లో లేదు
23. భాద్రపదచంద్రోదయం
24. హరితాళికావ్రతం, బలరామజయంతి షోడశోమావ్రతం జిల్లేజ్‌నెల ప్రారంభం
25. వినాయకచతుర్ధి
26. ఋషిపంచమి
31. క్షీరవ్రతారంభం, గజలక్ష్మీవ్రతం

### ఆగస్టు శుభసమయములు

శ్రీ హేమలంబ శ్రావణమాసము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 02 | బుధ | శు.దశమి | అనూరాధ | ఉ8.54-11.47 |
| 03 | గురు | శు.ద్వాదశి | మూల | సా6.14-7.20 |
| 04 | శుక్ర | శు.ద్వాదశి | మూల | ఉ9.16-మ1.01 |
| 04 | శుక్ర | శు.ద్వాదశి | మూల | సా5.24-6.52 |
| 06 | ఆది | శు.చతుర్దశి | ఉత్తరాషాఢ | ఉ10.05-12.53 |
| 06 | ఆది | శు.చతుర్దశి | ఉత్తరాషాఢ | సా5.45-7.08 |
| 07 | సోమ | పూర్ణిమ | శ్రవణం | ఉ8.34-మ12.37 |
| 07 | సోమ | పూర్ణిమ | శ్రవణం | సా5.12-7.04 |
| 09 | బుధ | బ.విదియ | శతభిషం | ఉ8.26-11.45 |
| 09 | బుధ | బ.విదియ | శతభిషం | సా5.04-6.56 |
| 11 | శుక్ర | బ.చవితి | ఉత్తరాభాద్ర | ఉ9.20-మ12.33 |
| 11 | శుక్ర | బ.చవితి | ఉత్తరాభాద్ర | సా5.26-6.48 |
| 12 | శని | బ.పంచమి | రేవతి | ఉ8.14-12.29 |
| 12 | శని | బ.పంచమి | రేవతి | సా4.52-6.01 |
| 13 | ఆది | బ.షష్ఠి | అశ్వని | ఉ10.15-12.25 |
| 13 | ఆది | బ.షష్ఠి | అశ్వని | సా5.40-6.36 |
| 16 | బుధ | బ.నవమి | రోహిణి | ఉ7.58-10.03 |
| 16 | బుధ | బ.దశమి | రోహిణి | సా4.36-5.23 |
| 16 | బుధ | బ.దశమి | రోహిణి | రా8.07-11.27 |
| 17 | గురు | బ.దశమి | మృగశిర | ఉ7.54-9.59 |
| 17 | గురు | బ.ఏకాదశి | మృగశిర | రా8.03-9.37 |

శ్రీ హేమలంబ భాద్రపదమాసము

| | | | | |
|---|---|---|---|---|
| 23 | బుధ | శు.విదియ | ఉత్తర | సా6.00-9.02 |
| 24 | గురు | శు.తదియ | ఉత్తర | ఉ7.26-10.01 |
| 24 | గురు | శు.తదియ | ఉత్తర | ఉ10.56-11.41 |
| 24 | గురు | శు.తదియ | హస్త | రా7.35-8.27 |
| 25 | శుక్ర | శు.చవితి | హస్త | ఉ7.22-8.24 |
| 25 | శుక్ర | శు.చవితి | హస్త | ఉ9.16-11.37 |
| 25 | శుక్ర | శు.పంచమి | చిత్ర | రా8.32-10.51 |
| 26 | శని | శు.పంచమి | చిత్ర | రా7.37-11.33 |
| 26 | శని | శు.పంచమి | స్వాతి | ఉ5.48-7.27 |
| 27 | ఆది | శు.షష్ఠి | స్వాతి | ఉ7.14-11.29 |
| 28 | సోమ | శు.సప్తమి | అనూరాధ | రా8.11-8.53 |
| 31 | గురు | శు.దశమి | మూల | ఉ6.58-10.03 |
| 31 | గురు | శు.దశమి | మూల | సా5.28-10.27 |

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## శ్రావణమాసంలో ఖగోళంలో జంట గ్రహణాలు

స్వస్తిశ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణపూర్ణిమ సరియగు తేది 2017 ఆగస్టు 7 సోమవారం శ్రవణానక్షత్ర నాల్గవపాదం మకరరాశిలో సూర్యునికి పాక్షిక గ్రహణం సంభవిస్తు న్నది. ఈ పాక్షిక గ్రహణం మీన, మేష లగ్నాలలో భారతదేశంలో కనపడును.

ఆగస్టు 7 సోమవారం నాడు రాత్రి సమయంలో చంద్రుడు పడమర దిక్కు నుంచి తూర్పు దిక్కుగా సంచారం జరిగే సమయంలో, చంద్రునికి దక్షిణపు భాగంలో రాత్రి 10గం॥53ని॥లకు గ్రహణ స్పర్శ కేతుగ్రస్తంగా జరుగును. అర్ధరాత్రికి పూర్వము 11గం॥50ని॥ల వరకు మాత్రమే గ్రహణము పాక్షికముగా కొనసాగును. తదుపరి నుంచి గ్రహణ విడుపు మొదలై 12గం॥48ని॥లకు గ్రహణము పూర్తగును.

ఈ పాక్షిక గ్రహణము కేవలం 115నిముషాలు మాత్రమే కొనసాగును. ఇది భారతదేశం అంతా కనపడును. ఈ గ్రహణము భారతదేశంతో పాటు యూరప్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండములలో కూడా పాక్షికంగానే గోచరించును. **శ్రావణపూర్ణిమ రోజున నూతన వటులు ఉపాకర్మలు ఆచరించరాదు.** ఇతరులు ఉపాకర్మలను ఆచరించవచ్చును.

శ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణ అమావాస్య సరియగు తేది 21 ఆగస్టు 2017 సోమవారం నాడు ఖగోళంలో సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించును. ఈ గ్రహణం భారత దేశంలో కనపడదు. కేవలం ఉత్తర అమెరికాలో మాత్రమే సంపూర్ణ గ్రహణముండును.

శ్రావణమాసంలో శుక్ల పాడ్యమి, పూర్ణిమ, అమావాస్యలు సోమవారాలే రావటము, అందులో పూర్ణిమకు పాక్షిక గ్రహణము సంభవించటము, అమావాస్యకు సంపూర్ణ సూర్య గ్రహణము సంభవించనున్నవి. ఈ సంపూర్ణ గ్రహణం జరిగే రోజు నుంచే శుక్రుడు కర్కాటక రాశిలోనికి ప్రవేశించి రాహువు చెంతకు రానున్నాడు. ఈ రాహువుతో శుక్రుడు సెప్టెంబరు 15 వరకు కలిసే నడుస్తాడు. శ్రావణమాసంలో రాహువు నీచ కుజునితో కూడా వారం రోజుల పాటు సంచారముండును. అయితే పరస్పర బద్ధ శత్రువులైన శని,కుజులు ఒకరినొకరు వీక్షించుకొనటం శ్రావణమాసం నుంచే ప్రారంభమగును.

కనుక ఈ జంటగ్రహణాల కొరకుగా ద్వాదశరాశుల వారు ఆచరించవలసిన పూర్తి విధి విధానాలను www.gargeyam.com లో అందజేయబడును. కనుక ఆస్తికులైన పాఠక మహాశయులు ఈ వెబ్‌సైట్ ద్వారా వివరాలను తెలుసుకొనగలరని ఆశిస్తాను.



# వృశ్చికరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:1, అవమానం:2

శ్రీ హేమలంబ : ఆదాయం:8, వ్యయం:14, రాజ్యపూజ్యం:4, అవమానం:5

**జనవరి:** ఇష్టార్థసిద్ధి కల్గును. తోబుట్టువులతో మాటపట్టింపులుండవు. అధర్మకార్యాలను ఆపుదురు. ఋణదాతల వత్తిడిని తట్టుకుంటారు. ఊహించని సౌకర్యాలు ఏర్పడును. స్వీయ కల్పనాశక్తి పెరుగును. జీర్ణాశయంలో సమస్య రాగల సూచన. హామీసంతకాలచే ఇతరుల బెడద. ఆధిపత్య పోరుకై ఉపక్రమిస్తారు. దైవ కార్యాలపై శ్రద్ధ పెరుగును. జనవరి 10 సాయంత్రం 6.44 నుంచి 12 రాత్రి 7.49 వరకు వ్యతిరేక రోజులుని గమనించాలి.

**ఫిబ్రవరి:** అవివాహితులకు ఊహించని వార్తలు. భూ, గృహ మార్పులధికము. గృహ వాతావరణం ఆశాజనకం. ఆర్థిక అంచనాలు తారుమారు కావు. ఆత్మవిశ్వాసం పెరుగును. వ్యూహాత్మక నిర్ణయాలు చేయగలరు. స్థానచలన సూచన కలదు. న్యాయలావాదేవీలు అనుకూలంగా ఉండవు. ఆరోగ్యానికి వైద్యసేవలవసరం. మాసాంతంలో జాయింటు వ్యాపారాలకు ఆదాయంలో గండి. ఫిబ్రవరి 6 అర్ధరాత్రి 2.39 నుంచి 9 ఉ.5.09 వరకు అనుకూలం కాదు.

**మార్చి :** భేషజాలకు వెళ్లరు. శత్రువర్గ వైషమ్యాల సమాచారాన్ని సేకరిస్తారు. అవినీతి కార్యాలను వ్యతిరేకిస్తారు. తోబుట్టువుల విమర్శలకు ధీటుగా సమాధానం చెప్తారు. చలాకితనం, ఉత్సాహంతో సంతాన విజయప్రాప్తి. చర్మసంబంధ రుగ్మత రాగల సూచన కలదు. విమర్శలకు దూరంగా ఉండండి. కపటస్వభావులను గమనించలేరు. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుంటారు. రానీబాకీలు వసూలగును. మార్చి 6 ఉదయం 8.21 నుంచి 8 మధ్యాహ్నం 11.58 వరకు ప్రతికూల సమయము.

**ఏప్రిల్ :** కార్యసిద్ధికై ఖర్చు పెడతారు. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుంటారు. కార్యదీక్షాబాధ్యత పెరుగును. బంధు సమాగమంచే సమస్యలు. సమయస్ఫూర్తి ప్రదర్శిస్తారు. వాక్కును అదుపులో ఉంచుకోలేరు. వైరాగ్య తగ్గును. అంతర్లీన భావనలు వ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తాయి. వ్యక్తిగత కక్షలను పెంచుకోవద్దు. విశేష పరిచయాలు పెరుగును.ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 నుంచి 4 సాయంత్రం 5.24 వరకు తిరిగి 29 రాత్రి 9.45 నుంచి మే 1 రాత్రి 11.36 వరకు ప్రతికూల సమయములని గ్రహించాలి.

**మే :** సోదరమైత్రి పెరుగును. నిద్రలేమిని తగ్గించండి. ప్రయాణాలలో అసౌకర్యాలు. తరచూ ఆర్థికమాంద్యం. కార్యసిద్ధికి ఆటంకాలు. గుప్తసమాచార సేకరణలో ఆలస్యం. అనవసర విషయాలలో ఇతరుల జోక్యం. రెండవపక్షంలో సమస్యల వలయాన్ని ఛేదిస్తారు. సహచరులతో అభిప్రాయభేధాలు. అంతర్గత వ్యవహారాలు గుట్టురట్టు. స్వయం వృత్తుల వారికి విజయప్రాప్తి. మే 27 ఉదయం 7.36 నుంచి 29 ఉదయం 7.56 వరకు సమయం వ్యతిరేకము.

**జూన్ :** శరీరం తరచూ అలసత్వంగా ఉండును. నిత్యం ఆశాభావంతోనే ఉంటారు. స్త్రీమూలకంగా లాభిస్తారు. ముఖ్య వ్యవహారాలు తల్లక్రిందులు కావు. అనవసర హామీలు ఇచ్చినందున వత్తిడి పెరుగును. కృషికి తగిన ఫలితం తక్కువ. వ్యూహాత్మక ఆలోచనలు చేయాలి. హాస్యవచనాలతో అసత్యాలతో కాలం గడపలేరు. ప్రతిబంధక సమస్యలను తప్పించాలి. సామరస్యధోరణితో ముందుకు కదలాలి.జూన్ 23 సాయంత్రం 6.19 నుంచి 25 సాయంత్రం 6.04 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై :** ప్రతిబంధక సంభాషణలచే స్వల్ప నష్టం. మనోక్లేశములుంటాయి. సంజాయిషీలు అధికం. సాహసప్రయత్నాలతో శుభకార్యాచరణ. ఉద్యోగస్తులకు ఊరట. మాసాంతంలో మనోవాంఛలు నెరవేరును. ఆర్థికహామీలు వద్దు. కీర్తి ప్రతిష్ఠలపై విమర్శల వెల్లువ. స్థానచలన సూచన లేదు. పట్టుదలకు పోయి భంగపడుదురు. బంధుప్రీతి అధికము. స్పెక్యులేషన్ రాణింపు. జూలై 20 రా.తె 4.09 నుంచి 22 రా.తె 4.29 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు :** స్వీయకల్పనాశక్తి పెరుగును. జీర్ణాశయంలో సమస్య రాగల సూచన. జూద నష్టములు. హామీ సంతకాలచే ఇతరుల బెడద. అందుకు గాను సంజాయిషీలు. ఆధిపత్య పోరుకై ఉపక్రమిస్తారు. దైవకార్యాలపై శ్రద్ధ పెరుగును. న్యాయలావాదేవీలు అనుకూలంగా ఉండవు. ఆరోగ్యానికి వైద్యసేవలవసరం. ఆగస్టు 17 మధ్యాహ్నం 11.54 నుంచి 19 మధ్యాహ్నం 1.37 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.

**సెప్టెంబరు :** శుభకార్యాలకు చర్చలుండును. రాజీధోరణితో వెళ్లాలి. ఋణాన్వేషణకు సమయం కేటాయించాలి. వాహనసౌఖ్యం. మృదువాక్యాలతో ఎదుటివారిని ఆకట్టుకుంటారు. మాసాంతంలో మానసిక ప్రశాంతత. మిత్ర సహాయం అందును. గర్వభంగములుండును. 2వవారంలో దీర్ఘకాల సమస్య పరిష్కారం. ఋణదాతల వత్తిడిపై విమర్శలు వద్దు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. సెప్టెంబరు 13 సా 5.44 నుంచి 15 రాత్రి 8.36 వరకు వ్యతిరేక సమయం.

**అక్టోబరు :** ధర్మావేశం అనుకూలం కాదు. రాజీప్రక్రియలు లాభిస్తాయి. సాహస ప్రయత్నాలు ఫలించును. రాబడి విషయంలో ఖచ్చితాన్ని పాటించలేరు. మాసం మధ్యలో శృంగభంగ ములు. ఆత్మపరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. పుకార్లను నమ్మి స్వల్ప నష్టం. స్వయం వృత్తుల వారికి లబ్ధి. ఋణలావాదేవీలు తగ్గుముఖం. భయాందోళనలు విడనాడండి. స్థానచలన అవకాశములు లేవు. అక్టోబరు 10 రాత్రి 11.17 నుంచి 12 రాత్రి 2.04 వరకు ప్రతికూల సమయంగా గ్రహించాలి.

**నవంబరు :** రానీబాకీలు వసూలగును. అవివాహితులకు వివాహయోగం. మనో వాంఛలు ఆలస్యంగా సిద్ధించును. సంతాన సమస్యలు తొలగును. మాసాంతంలో కఠిన నిర్ణయాలు తీసుకుంటారు. వర్గ వైషమ్యాలను ప్రోత్సహిస్తారు. శుభకార్య సంకేతాలకై వేచి ఉంటారు. సంకల్పబలంచే లోపాలు తగ్గును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లబ్ధి. రహస్య మంతనాలచే నష్టం. ఆలోచనా పటిమ పెరుగును. నవంబరు 7 ఉదయం 6.43 నుంచి 9 ఉదయం 8.04 వరకు సమయం వ్యతిరేకమని భావించాలి.

**డిశంబరు :** చలాకీతనం పెరుగును. వివాదఅంశాలు సమసిపోవును. వృధా ప్రయాణాలు ఉన్ననూ మనశ్శాంతి ఉంటుంది. స్పెక్యులేషన్ యోగించును. ఉదరసంబంధ లోపములు పెరుగును. కీలకనిర్ణయాలలో జాగ్రత్తలు అవసరము. సంతానానికి విజయప్రాప్తి. ఆశ్రిత పక్షపాతంచే విమర్శల వెల్లువ. బంధుసహాయం ఉంటుంది. శరీరతేజస్సు పెరుగును. ఆలోచనా పటిమ పెరుగును. డిశంబరు 4 సాయంత్రం 4.51 నుంచి 6 సాయంత్రం 4.34 వరకు ముఖ్యఅంశాలలో జాగ్రత్తలవసరం.

## శుక్ల త్రయోదశి, బహుళ తదియ తిథులలో 'సర్వమంగళా' నిత్యా దేవత పారాయణ నామాలు

సర్వమంగళా దేవత బంగారువర్ణంతో మెరిసిపోతూ, నవరత్నములు పొదిగిన ఆభరణములు ధరించి, సూర్య చంద్రులు అందించే తేజోవంతమైన వెలుగుతో పోలిన కనులను కల్గి పద్మంపై ఆసీనురాలై ఉండును. మూడు కనులు, నాల్గు భుజములు ఉండును. దబ్బపండు, బంగారు పాత్ర, అభయ వరముద్రలుండును. ఈ దేవతను ఆరాధించి నచో జీవితంలో చేసే ప్రయాణంలోని ప్రమాదాల నుంచి రక్షించి కోర్కెలను తీర్చే విధంగా ఉంటూ లౌకిక సామాజిక రంగాలలో విజయప్రాప్తి నందించును.

ప్రతినెలలో వచ్చే శుక్ల త్రయోదశి, బహుళ తదియ తిథి సాయంత్ర సమయాలలో ఈ దేవతను ఆరాధించేది. పూర్వగణిత తిథి సమయాలు కాకుండా దృగ్గణితంతో సాధించిన తిథి సమయాలలోనే పారాయణం చేయండి.

| | |
|---|---|
| ఓం మందారకుసుమప్రియాయై నమః | (776) |
| ఓం మార్తాండభైరవారాధ్యాయై నమః | (785) |
| ఓం మంత్రిణీన్యస్తరాజ్యధురే నమః | (786) |
| ఓం సత్యజ్ఞానానందరూపాయై నమః | (791) |
| ఓం సామరస్యపరాయణాయై నమః | (792) |
| ఓం పరమంత్రవిభేదిన్యై నమః | (812) |
| ఓం మునిమానసహంసికాయై నమః | (816) |
| ఓం పంచాశత్పీఠరూపిణ్యై నమః | (833) |
| ఓం మూలవిగ్రహరూపిణ్యై నమః | (840) |
| ఓం భవచక్రప్రవర్తిన్యై నమః | (843) |
| ఓం సర్వోపనిషదుద్ఘుష్టాయై నమః | (852) |
| ఓం శాంత్యతీతకలాత్మికాయై నమః | (853) |
| ఓం కార్యకారణనిర్ముక్తాయై నమః | (862) |
| ఓం కామకేలితరంగితాయై నమః | (863) |
| ఓం కనత్కనకతాటంకాయై నమః | (864) |
| ఓం లీలావిగ్రహధారిణ్యై నమః | (865) |

## శుక్ల చతుర్దశి, బహుళ విదియ తిథులలో 'జ్వాలామాలినీ' నిత్యా దేవత పారాయణ నామాలు

ఈ దేవత అగ్నికీలలు కల్గినటువంటి మాలను ధరించి, పద్మముపై నిల్చుని ఉండును. ఒక్కో శిరస్సుకు మూడు నేత్రాలతో 6 శిరస్సులను కల్గి, 12 భుజములుండును. పాశము, అంకుశము, బాణాలు, కత్తి, కవచము, త్రిశూలము, గద, ధనస్సు, పుష్పం, అగ్నికీలలతో, అభయ వరముద్రలతో ఉండును. ఈ దేవతను ఆరాధించినచో చక్కని దేహారోగ్యం కల్గి శత్రుజయంతో ముఖ్య కార్యములందు విజయ పరంపరను కల్గి అగ్నివలె తేజోవంతముగా ఉండును.

ఈ దేవతను ప్రతి నెలలో వచ్చే శుక్ల చతుర్దశి, బహుళ విదియ తిథుల సాయంత్ర సమయాలలో ఆరాధించాలి. పూర్వగణిత తిథి సమయాలు కాకుండా దృగ్గణితంతో సాధించిన తిథి సమయాలలోనే పారాయణం చేయండి.

| | |
|---|---|
| ఓం అంతర్ముఖసమారాధ్యాయై నమః | (870) |
| ఓం బహిర్ముఖసుదుర్లభాయై నమః | (871) |
| ఓం యజమానస్వరూపిణ్యై నమః | (883) |
| ఓం ధనధాన్యవివర్ధిన్యై నమః | (886) |
| ఓం విశ్వభ్రమణకారిణ్యై నమః | (889) |
| ఓం తత్త్వమర్థస్వరూపిణ్యై నమః | (908) |
| ఓం సదాశివకుటుంబిన్యై నమః | (911) |
| ఓం సవ్యాపసవ్యమార్గస్థాయై నమః | (912) |
| ఓం సర్వాపద్వినివారిణ్యై నమః | (913) |
| ఓం చైతన్యార్ఘ్యసమారాధ్యాయై నమః | (918) |
| ఓం చైతన్యకుసుమప్రియాయై నమః | (919) |
| ఓం తరుణాదిత్యపాటలాయై నమః | (922) |
| ఓం దక్షిణాదక్షిణారాధ్యాయై నమః | (923) |
| ఓం దరస్మేరముఖాంబుజాయై నమః | (924) |
| ఓం శ్రుతిసంస్తుతవైభవాయై నమః | (929) |
| ఓం పంచసంఖ్యోపచారిణ్యై నమః | (950) |

## పూర్ణిమ, బహుళ పాడ్యమి తిథులలో 'చిత్రా' నిత్యా దేవత పారాయణ నామాలు

చిత్రా దేవత మూడు కనులు, నాల్గు చేతులు కల్గి నవరత్నాలు పొదిగిన ఆభరణాలతో, చిరుమంద హాసంతో ఉదయించే సూర్యుని వలె ప్రకాశించును. ఈదేవత పాశము, అంకుశములను చేతులలో కల్గి వరముద్ర, అభయముద్రలతో అనుగ్రహించును. ఈ దేవతను ఆరాధించినచో సంపదను, మనోవికాసాన్ని పొందటమే కాక చక్కని ఆలోచనలు కల్గి విజయాన్ని అందించును. ప్రతిపూర్ణిమ, ప్రతి బహుళ పాడ్యమి సాయంత్ర తిథి సమయాలలో ప్రార్థించేది.

పూర్వగణిత పంచాంగాలలో ఇచ్చిన తిథి సమయాలు ప్రామాణికాలు కావు. ఋజువునకు నిలబడవు. కనుక దృగ్గణిత పంచాంగాలలోని తిథి సమయాలే ప్రామాణిక ములు. ఈ సమయాలలోనే ప్రార్థించేది.

| | |
|---|---|
| ఓం బంధూకకుసుమప్రఖ్యాయై నమః | (964) |
| ఓం సువాసిన్యర్చనప్రీతాయై నమః | (971) |
| ఓం బిందుతర్పణసంతుష్టాయై నమః | (974) |
| ఓం దశముద్రాసమారాధ్యాయై నమః | (977) |
| ఓం త్రిపురాశ్రీవశంకర్యై నమః | (978) |
| ఓం జ్ఞానజ్ఞేయస్వరూపిణ్యై నమః | (981) |
| ఓం వాంఛితార్థప్రదాయిన్యై నమః | (989) |
| ఓం అభ్యాసాతిశయజ్ఞాతాయై నమః | (990) |
| ఓం షడధ్వాతీతరూపిణ్యై నమః | (991) |
| ఓం అవ్యాజకరుణామూర్తయే నమః | (992) |
| ఓం అజ్ఞానధ్వాంతదీపికాయై నమః | (993) |
| ఓం ఆబాలగోపవిదితాయై నమః | (994) |
| ఓం సర్వానుల్లంఘ్యశాసనాయై నమః | (995) |
| ఓం శ్రీచక్రరాజనిలయాయై నమః | (996) |
| ఓం శ్రీమత్త్రిపురసుందర్యై నమః | (997) |
| ఓం శివశక్త్యైక్యరూపిణ్యై నమః | (999) |

ఆగస్టు

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్‌కై వీక్షించండి..

www.mohanpublications.com


# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్



పంచాంగకర్త:

శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ


దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైదరాబాద్ ఫోన్ : 9348032385, 9348632385


శ్రీ హేమలంబ నామ సంవత్సర భాద్రపదమాస శుక్ల దశమి శుక్రవారం నుంచి ఆశ్వీజమాస శుక్ల దశమి శనివారం వరకు

# 2017 SEPTEMBER సెప్టెంబరు

ఈ మాసంలో మొదటిపక్షమంతయూ శుక్ర రాహువుల కలయిక అధికంగా ఉంది. ద్వాదశరాశుల వారు ఆచరించాల్సిన విధి విధానాలకై క్లిక్ చేయండి www.gargeyam.com

### పండుగలు

2. పరివర్త్యేకాదశి
3. వామనజయంతి, ఓనం కృష్ణయజుర్వేద ఉపాకర్మ
4. ఋగ్వేదఉపాకర్మ
5. అనంతపద్మనాభవ్రతం
6. శుక్లయజుర్వేద ఉపాకర్మ ఉమామహేశ్వరవ్రతం మహాలయపక్షారంభం
8. ఉండ్రాళ్లతద్దె
9. సంకష్టహరచతుర్థి
10. భరణీమహాలయం
12. కావేరిపుష్కరారంభం
13. వైష్ణవ శ్రీకృష్ణజయంతి
14. వ్యతీపాతమహాలయం
16. ఇంద్రైకాదశి శనిపుష్యమి
17. కన్యాసంక్రాంతి యతీమహాలయం
18. విషశస్త్రహతమహాలయం, మాసశివరాత్రి
19. మహాలయఅమావాస్య
20. బతుకమ్మపండుగ
21. దేవీశరన్నవరాత్రారంభం కలశస్థాపన, ఆశ్వీజచంద్రోదయం
22 మొహరం నెలారంభం
24. లలితాపంచమి
27. సరస్వతీ ఆవాహనము దేవీత్రిరాత్ర వ్రతారంభం
28. సరస్వతీ సాయంత్ర పూజ, దుర్గాష్టమీ
29. మహర్నవమీ
30. విజయదశమి అపరాజితాదేవిపూజ, ఆయుధపూజ, శమీపూజ దుర్గా, సరస్వతీ-ఉద్వాసన

| Day | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.37-5.26<br>రా.కా: సా4.30-6.00 | | 3<br>శు.ద్వాదశి మ11.12<br>ఉత్తరాషాఢ ఉ9.37<br>వ.మ1.54-3.37 | 10<br>బ.చవితి ఉ7.24బ.5మి<br>తె5.23 అశ్వని ఉ10.37<br>వ.ఉ6.48-8.20<br>వ.రా7.43-9.14 | 17<br>బ.ద్వాదశి మ2.42<br>ఆశ్లేష రా12.07<br>వ.మ1.22-2.54 | 24<br>శు.చవితి మ12.39<br>విశాఖ తె4.26<br>వ.ఉ8.22-10.07 |
| MON సోమ<br>దుర్ము:మ12.30-1.20<br>మ2.58-3.47<br>రా.కా:ఉ7.30-9.00 | | 4<br>శు.త్రయోదశి మ12.14<br>శ్రవణం మ11.18<br>వ.మ3.29-5.10 | 11<br>బ.షష్ఠి రా3.14<br>భరణి ఉ9.20<br>వ.రా8.38-10.09 | 18<br>బ.త్రయోదశి మ1.07<br>మఘ రా11.24<br>వ.మ11.45-1.18 | 25<br>శు.పంచమి మ2.27<br>అనూరాధ పూర్తిగా<br>వ.ఉ8.52-10.39 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.25-9.14<br>రా10.55-11.42<br>రా.కా: మ3.00-4.30 | | 5<br>శు.చతుర్దశిమ12.41<br>ధనిష్ఠ మ12.25<br>వ.రా7.46-9.24 | 12<br>బ.సప్తమి రా1.01<br>కృత్తిక ఉ7.56<br>వ.రా10.58-12.28 | 19<br>బ.చతుర్దశి మ11.52<br>పూర్వఫల్గుణిరా11.01<br>వ.ఉ7.16-8.50 | 26<br>శు.షష్ఠి సా4.40<br>అనూరాధ ఉ7.03<br>వ.మ1.20-3.07 |
| WED బుధ<br>దుర్ము:మ11.41-12.30<br>రా.కా:<br>మ12.00-1.30 | | ○ 6<br>పూర్ణిమ మ12.32<br>శతభిషం మ12.57<br>వ.రా7.21-8.57 | 13<br>బ.అష్టమి రా10.48<br>రోహిణి ఉ6.28<br>మృగశిర తె5.01<br>వ.మ11.44-1.14 | ● 20<br>భాద్రపదఅమావాస్యఉ10.59<br>ఉత్తర రా11.03<br>వ.ఉ6.13-7.50 | 27<br>శు.సప్తమి రా7.08<br>జ్యేష్ఠ ఉ9.58<br>వ.సా6.58-8.46 |
| THU గురు<br>దుర్ము:ఉ10.03-10.51<br>మ2.56-3.45<br>రా.కా:మ1.30-3.00 | | 7<br>బ.పాడ్యమి మ11.52<br>పూర్వాభాద్రమ12.58<br>వ.రా10.23-11.57 | 14<br>బ.నవమి రా8.36<br>ఆర్ద్ర రా3.36<br>వ.మ12.55-2.25 | 21<br>ఆశ్వీజమాసారంభం<br>శు.పాడ్యమి ఉ10.34<br>హస్త రా11.34<br>వ.ఉ7.38-9.16 | 28<br>శు.అష్టమి రా9.36<br>మూల మ12.57<br>వ.మ11.09-12.57<br>వ.రా11.42-1.29 |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.25-9.14<br>మ12.32-1.21<br>రా.కా:ఉ10.30-12.00 | 1<br>శు.దశమి ఉ7.36<br>పూర్వాషాఢ పూర్తిగా<br>వ.మ3.26-5.13 | 8<br>బ.విదియ ఉ10.43<br>ఉత్తరాభాద్ర మ12.31<br>వ.రా12.07-1.40 | 15<br>బ.దశమి సా6.29<br>పునర్వసు రా2.16<br>వ.మ2.56-4.27 | 22<br>శు.విదియ ఉ10.41<br>చిత్ర రా12.38<br>వ.ఉ7.55-9.36 | 29<br>శు.నవమి రా11.49<br>పూర్వాషాఢ మ3.48<br>వ.రా12.37-2.23 |
| SAT శని<br>దుర్ము:ఉ5.57-7.36<br>రా.కా:ఉ9.00-10.30 | 2<br>శు.ఏకాదశి ఉ9.38<br>పూర్వాషాఢ ఉ7.25<br>వ.సా4.09-5.54 | 9<br>బ.తదియ ఉ9.12<br>రేవతి మ11.43<br>వర్జ్యం లేదు | 16<br>బ.ఏకాదశి సా4.30<br>పుష్యమి రా1.06<br>వ.ఉ9.53-11.24 | 23<br>శు.తదియ మ11.23<br>స్వాతి రా2.16<br>వ.ఉ6.37-8.19 | 30<br>శు.దశమి రా1.35<br>ఉత్తరాషాఢ సా6.16<br>వ.రా10.35-12.18 |

### సెప్టెంబరు శుభసమయములు

శ్రీ హేమలంబ భాద్రపదమాసము

| | | | | |
|---|---|---|---|---|
| 02 | శని | శు.ఏకాదశి | ఉత్తరాషాఢ | ఉ7.36-9.38 |
| 02 | శని | శు.ద్వాదశి | ఉత్తరాషాఢ | ఉ9.40-11.05 |
| 02 | శని | శు.ద్వాదశి | ఉత్తరాషాఢ | సా5.55-10.19 |
| 03 | ఆది | శు.ద్వాదశి | ఉత్తరాషాఢ | ఉ6.46-9.37 |
| 03 | ఆది | శు.ద్వాదశి | ఉత్తరాషాఢ | ఉ9.40-11.01 |
| 03 | ఆది | శు.త్రయోదశి | శ్రవణం | సా5.30-10.15 |
| 04 | సోమ | శు.త్రయోదశి | శ్రవణం | ఉ6.42-10.57 |
| 04 | సోమ | శు.చతుర్దశి | ధనిష్ఠ | సా5.12-10.11 |
| 06 | బుధ | పూర్ణిమ | శతభిషం | ఉ6.34-10.49 |
| 07 | గురు | బ.విదియ | ఉత్తరాభాద్ర | సా5.01-9.59 |
| 08 | శుక్ర | బ.విదియ | ఉత్తరాభాద్ర | ఉ6.26-8.24 |
| 08 | శుక్ర | బ.విదియ | ఉత్తరాభాద్ర | ఉ9.14-10.41 |
| 08 | శుక్ర | బ.తదియ | రేవతి | సా4.56-9.55 |
| 09 | శని | బ.తదియ | రేవతి | ఉ7.37-9.12 |
| 09 | శని | బ.చవితి | రేవతి | ఉ9.13-10.37 |
| 09 | శని | బ.చవితి | అశ్వని | సా4.52-9.51 |
| 10 | ఆది | బ.పంచమి | అశ్వని | ఉ8.23-10.33 |
| 13 | బుధ | బ.అష్టమి | మృగశిర | ఉ6.29-8.11 |
| 13 | బుధ | బ.అష్టమి | మృగశిర | సా6.15-9.35 |
| 15 | శుక్ర | బ.దశమి | పునర్వసు | ఉ5.58-8.20 |
| 15 | శుక్ర | బ.దశమి | పునర్వసు | ఉ8.25-10.13 |
| 15 | శుక్ర | బ.ఏకాదశి | పునర్వసు | సా6.30-9.27 |
| 16 | శని | బ.ఏకాదశి | పుష్యమి | ఉ7.37-9.52 |

శ్రీ హేమలంబ ఆశ్వీజమాసము

| | | | | |
|---|---|---|---|---|
| 21 | గురు | శు.విదియ | హస్త | సా5.43-11.04 |
| 22 | శుక్ర | శు.తదియ | చిత్ర | మ11.59-12.23 |
| 22 | శుక్ర | శు.తదియ | చిత్ర | రా7.13-11.00 |
| 23 | శని | శు.తదియ | స్వాతి | ఉ8.20-9.41 |
| 23 | శని | శు.చవితి | స్వాతి | మ11.55 -2.04 |
| 23 | శని | శు.చవితి | స్వాతి | రా7.09-10.56 |
| 25 | సోమ | శు.పంచమి | అనూరాధ | ఉ7.23 -8.51 |
| 25 | సోమ | శు.పంచమి | అనూరాధ | మ11.47 -12.21 |
| 25 | సోమ | శు.షష్ఠి | అనూరాధ | సా5.27-7.01 |
| 25 | సోమ | శు.షష్ఠి | అనూరాధ | రా8.47 -10.48 |
| 27 | బుధ | శు.సప్తమి | మూల | సా5.19-6.57 |
| 28 | గురు | శు.అష్టమి | మూల | ఉ7.11-9.21 |
| 29 | శుక్ర | శు.నవమి | ఉత్తరాషాఢ | సా5.11-8.31 |
| 30 | శని | శు.దశమి | ఉత్తరాషాఢ | ఉ7.36-9.13 |
| 30 | శని | శు.దశమి | శ్రవణం | సా6.17-10.28 |

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## ఆశ్లేష నక్షత్రంలో సర్ప శాప భయ నివృత్తికై జ్యోతి ప్రజ్వలన

పలు కుటుంబాలలోని పెద్దలు, ఏవో కారణాలచే సర్పాలను చేధించినందున, తమ సంతతి శాపఫలితాలను అనుభవిస్తుంటారని, ఇవి ఎంతకాలం ఉంటాయో తెలియదని భయపడుతుంటారు. చాలామందికి భయంకర సర్పాలు స్వప్నాలలో వచ్చి హింసిస్తున్నాయని చెబుతుంటారు. ఇట్టి వారందరూ ఈ అద్భుత పరిహారాన్ని పాటించండి.

ప్రతిమాసంలో ఆశ్లేష నక్షత్రం ఏదో ఒకవారం వస్తుంటుంది. ఈ ఆశ్లేష నక్షత్రానికి ముందు వచ్చే ఆదివారం అవసరం. ఆపై ఆశ్లేష నక్షత్రం ఏ వారం ఉందో ఆనాటి రాహుకాల సమయము అవసరం. ఆశ్లేష నక్షత్రంతో కూడిన ఆదివారం వచ్చిననూ, దాని ముందు ఆదివారం అవసరం. ఇక వివరాలలోకి వెళ్దాం. ఆశ్లేషా నక్షత్రానికి ముందు వచ్చిన ఆదివారం నాడు పావుకిలో గోధుమలను తీసుకోండి. నిమ్మకాయను కోసి ఆ రసాన్ని గోధుమలపై పిండండి. బాగా కలపండి. నీడలో గోధుమలను ఆరబెట్టండి. రెండు మూడు రోజులైననూ ఫరవాలేదు. బాగా ఆరిన గోధుమలను పిండి పట్టించండి. జల్లించవద్దు.

ఆశ్లేష నక్షత్రం రోజున ఏ వారం వస్తుందో, ఆనాటి రాహుకాల సమయంలో ఈ గోధుమ పిండితో దీప ప్రజ్వలన చేయాలి. దీపాన్ని సింహద్వారానికి రెండు వైపులా అలంకరించు కోవటం. ఆశ్లేష సోమవారం వస్తే ఉ7.30 నుంచి 9.00 లోపు, శనివారం వస్తే ఉ9.00 నుంచి 10.30 లోపు, శుక్రవారం వస్తే 10.30 నుంచి 12.00 మధ్య, బుధవారమైతే 12.00 నుంచి 1.30 లోపు, గురువారం 1.30 నుంచి 3.00 మధ్యలో, మంగళ వారమైతే 3.00 నుంచి 4.30 లోపు, ఆదివారమైతే 4.30 నుంచి 6.00 మధ్య దీపప్రజ్వలన చేయండి.

పావుకిలో గోధుమపిండిలో మూడవవంతు పిండిని నీటితో ముద్దగా కలిపి, ప్రమిదలుగా చేసకుని, మధ్య వత్తులు వేసి, కొబ్బరినూనెతో మాత్రమే సింహద్వారమునకు రెండువైపులా దీపాలను ఉంచండి. సహజంగా రాత్రి సమయాలలోనే దీపాలను సింహద్వారం ముందు అలంకరిస్తుంటాం. కానీ ఆశ్లేష నక్షత్రం ఏ వారం వస్తుందో, ఆనాటి రాహుకాలం పూర్తయ్యే వరకు దీపాలు వెలుగుతుండాలి. ఈ ప్రకారంగా పావుకిలో పిండితో 3 పర్యాయాలు ఆచరించండి. మూడు పర్యాయాల కంటే అధికంగా చేసిన ఫలమధికమే.

కుటుంబ సభ్యులలో పెద్దవారు మాత్రమే ఈ దీపాన్ని వెలిగించాలి. గోధుమలలో నిమ్మరసం కలపటం, పిండితో ప్రమిదలు చేయటం... ఎవరైననూ చేయవచ్చును. సర్పశాప ఫలితాలు తొలగిపోతాయి. ప్రత్యేకనియమాలు, ఉపవాసాలు, తలంట్లు ఏమీ లేవని గమనించండి.



# ధనూరాశి



| శ్రీ దుర్ముఖి : ఆదాయం:5, వ్యయం:14, రాజ్యపూజ్యం:4, అవమానం:5 |
|---|
| శ్రీ హేమలంబ: ఆదాయం:11, వ్యయం:5, రాజ్యపూజ్యం:7, అవమానం:5 |

**జనవరి:** ముఖ్య ఒప్పందాలు రద్దగును. ఆరోగ్య భంగములు, సంతానఅవాంతరములు తగ్గును. కీలక నిర్ణయాలచే ఆర్థిక మాంద్యం ఏర్పడును. స్త్రీలకు శుభకరం. నిర్మాణాత్మక శక్తులు పెరుగును. ఋణదాతల వత్తిడి తగ్గును. పరిశోధనాత్మక శక్తి పెరుగును. కార్యదీక్షా బాధ్యత అనవసరం. భూగృహ మార్పులు అధికం. జనవరి రాత్రి 7.49 నుంచి 14 రాత్రి 10.55 వరకు అనుకూలరోజులు కాదు.

**ఫిబ్రవరి:** పోటీలను ఎదుర్కొంటారు. నూతన ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ఆవేశాలకు వెళ్లి ధనవ్యయం చేస్తారు. స్థానచలన సూచన కలదు. జూదనష్టములు ఎక్కువ. జీర్ణాశయ లోపముంది. భాగస్వామ్య చిక్కులు మాసాంతంలో తగ్గును. న్యాయనిర్ణయాలకై సమయం వృథా చేస్తారు. సొంతవారితో విభేదించవద్దు. ఫిబ్రవరి 9 ఉదయం 5.09 నుంచి 11 ఉ 8.55 వరకు ప్రతికూలమని భావించాలి.

**మార్చి :** వాగ్ధోరణిని అదుపుచేస్తారు. శతృవర్గ వైషమ్యాల బెడద తగ్గును. ధర్మావేశం అనుకూలం కాదని తెలుసుకుంటారు. స్థిరాదాయం తగ్గును. శుభవార్తాశ్రవణం కలదు. స్వార్థబుద్ధిని తగ్గిస్తారు. నూతన అగ్రిమెంట్లు లాభించును. వృథా ప్రయాణాలచే అనారోగ్య మేర్పడును. ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు. మార్చి 8 మధ్యాహ్నం 11.58 నుంచి 10 సాయంత్రం 4.59 వరకు వ్యతిరేకతేదీలు.

**ఏప్రిల్ :** మనోసంకటాలు మటుమాయం. గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. వాహనచోదకంలో జాగ్రత్త. సంతానరీత్యా ఖర్చులు పెరుగును. మాసం మధ్యలో లోపాలు తలెత్తును. మిత్రబేధాలుండును. బంధువులతో శతృత్వాలు వద్దు. అనవసర ఆవేశాలకు వెళ్లకండి. సెటిల్‌మెంట్ వ్యవహారంలో సమస్య ఉన్ననూ ఆర్థికంగా లాభిస్తారు. ఏప్రిల్ 4 సాయంత్రం 5.24 నుంచి 6 రాత్రి 11.00 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** ఖచ్చిత నిర్ణయాలు తీసుకుందురు. తల్లి ప్రేమచే నిర్ణయాలలో మార్పులుం డును. కీర్తి ప్రతిష్ఠలు పెరిగినందున మధ్య మధ్యలో ఆర్థిక జాగ్రత్తలు. శుభవార్తలు తరచూ వింటారు. శతృభయం ఉండదు. రాజీ ధోరణికి కట్టుబడరు. సంతానంపై శ్రద్ధ చూపిస్తారు. పరనింద ఆరోపణలను దూరం చేస్తారు. కీలక నిర్ణయాలు మాసాంతంలో తీసుకోలేరు. వాహన మరమ్మత్తులకు ధనవ్యయం. మే 1 రాత్రి 11.36 నుంచి 3 రా.తె4.29 వరకు తిరిగి 29 ఉదయం 7.56 నుంచి 31 మధ్యాహ్నం 11.14 వరకు ప్రతికూల సమయం.

**జూన్ :** శుభకార్య నిర్వహణ చర్చలు ఫలించును. విమర్శలుండవు. పూర్తిగా అనుకూల స్థితిగతులు. జాయింట్ వ్యాపారాలలో పురోగతి. అధర్మకార్యాలను ఆపుదురు. శరీరానికి వైద్యసేవలు. ఊహించని ఖర్చులు వచ్చిననూ వెనుకంజ వేయరు. భూలావాదేవీలు సాధారణ స్థితి. రహస్యనిర్ణయాలు బాహాటం చేయవద్దు. చలాకీతనం కళాకాంతులు పెరుగును. జూన్ 25 సాయంత్రం 6.04 నుంచి 27 రాత్రి 7.58 వరకు సమయం వ్యతిరేకం.

**జూలై :** వాహనసౌఖ్యం లాభించును. కపట స్వభావులు ఎదురుగుదురు. వారిని ఆర్థికంగా ఆదుకోవద్దు. శుభచర్చలు కలిసివస్తాయి. 3వ వారంలో మానసిక చింతలచే రహస్యాలను బయటపెట్టకండి. ఆత్మవిశ్వాసంతో ఉండండి. సంజాయిషీలు ఇవ్వవద్దు. ఆవేశం వద్దు. కీలక నిర్ణయాలలో బంధువుల పాత్ర అధికము. స్వయంరంగాలలో విజయప్రాప్తి. జూలై 22 రా.తె 4.29 నుంచి 25 ఉదయం 6.01 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**ఆగస్టు :** ఆర్థికమాంద్యం, ఋణబాధలు అధికం. హడావుడి నిర్ణయాలచే నష్టం. వ్యాపారాలలో ముందంజ. రాబడి విషయంలో ఖచ్చిత నిర్ణయం తీసుకోలేరు. ఉద్యోగ నిర్వహణలో సమస్యలు 3వ వారంలో ఉంటాయి. స్నేహ సంబంధాలు పెంచుకుంటారు. మాసం మధ్యనుంచి హడావుడి ప్రయాణాలు, అకాలభోజనాదులు. ఆకస్మిక విజయప్రాప్తి. సంతానసౌఖ్యం. ఆగస్టు 19 మధ్యాహ్నం 1.37 నుంచి 21 మధ్యాహ్నం 3.51 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**సెప్టెంబరు :** మనోసంకటాలు ఉండవు. వ్యూహాత్మక శక్తి పెరుగును. ఆర్థికమాంద్యం ఉండదు. సాహసకృత్యములకు దూరమగుదురు. వివాద అంశాలు ఉండవు. శస్త్రచికిత్సకు అవకాశముంది. ఆత్మవిశ్వాసంతో ఉండండి. స్వయం రంగాల వారికి స్వల్పంగా నష్ట సూచన. శతృవర్గీయుల బెడదను ఎదుర్కోవాలి. మాసాంతంలో మనఃక్లేశములు. దైవ కార్యాలపై ఆసక్తి. సెప్టెంబరు 15 రాత్రి 8.36 నుంచి 17 రాత్రి 12.07 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్తలు అవసరం.

**అక్టోబరు :** కృతనిశ్చయం బలంగా ఉండదు. బుద్ధిబలంతో నిర్ణయాలు ఉంటాయి. వాదనా శక్తి వృద్ధి. స్పెక్యులేషన్ ఆశాజనకం. తోబుట్టువులతో మాటపట్టింపులు. కుటుంబ కలతలు తగ్గుముఖం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు. మాసాంతంలో ఆర్థిక పరిపుష్టి. వాగ్దాన నిర్ణయాలు మారును. ఆశ్రిత పక్షపాతం పెరుగును. దాయాదులతో కలహాలు ఉండవు. ఆర్థిక అంచనాలు సిద్ధం. అక్టోబరు 12 రాత్రి 2.04 నుంచి 15 ఉదయం 6.21 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.

**నవంబరు :** సాధారణంగానే గడుచును.తోబుట్టువులతో అంగీకారముంది. ఉపాధి రంగాల వారికి అనుకూలం. శరీరానికి వైద్య సేవలు అవసరం. కుటుంబ వాతావరణంలో వ్యతిరేకతలు. ధర్మావేశం అనుకూలం కాదు. వాహన నిర్ణయం వాయిదా వేయండి. న్యాయ అంశాలపై పట్టుదలకు పోవద్దు. కృతనిశ్చయంతో ధైర్యంగా ఉంటారు. నవంబరు 9 ఉదయం 8.04 నుంచి 11 మధ్యాహ్నం 11.43 వరకు వ్యతిరేక సమయంగా గ్రహించాలి.

**డిశంబరు:** కుటుంబ సమస్యలు గట్టెక్కును. అకారణ విరోధాలుండవు. నీలాపనిందలు తగ్గును. గురుతర బాధ్యతను స్వీకరించలేరు. బుద్ధిబల నిర్ణయాలతో పూర్ణలబ్ది. రహస్య అంశాలపై చర్చలు వద్దు. సంజాయిషీలు, క్షమాపణలు మామూలే. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. అవివాహితులకు వివాహయోగం. నూతన నిర్ణయాలు తీసుకుంటారు. డిశంబరు 6 సాయంత్రం 4.34 నుంచి 8 సాయంత్రం 6.28 వరకు నిర్ణయాలు తీసుకోవటంలో తొందరపాటు వద్దు.

## ఆర్థిక సుస్థిరతకై సప్త నక్షత్రాలలో జ్యోతి ప్రజ్జ్వలన

లలితాత్రిశతి కామరాజ ఖండమునందున్న హ్రీంకార నామాలలో 16వ నామం హ్రీంకారాంగణ దీపిక. హ్రీంకారమనే ఇంటిముందు దీపమని భావం. ఇట్టి హ్రీంకారాంగణ దీపాన్ని ప్రత్యేక రోజులలో ఇంటి గడపమీద సాయంసంధ్యా సమయంలో ప్రజ్జ్వలించి శ్రీ మహాలక్ష్మి దేవిని ప్రార్థించాలి.

అయితే ఈ దీప ప్రత్యేకత ఏమిటంటే... ప్రతినెలలో వచ్చే స్వాతి, శతభిషా నక్షత్ర మధ్యరోజులలో....అనూరాధ నక్షత్రం శనివారం వస్తే... ఆనాటి మధ్యాహ్నం 11.45 నుంచి 12.30 గంటలలోపల సముద్రకెరటం ద్వారా వచ్చే నురగతో కలిసిన నీటిని 2 లేక 3 సీసాలలోనికి తీసుకోండి. భద్రపరుచుకుని ఇంటికి రండి.

అశ్వని, భరణి, రోహిణి, పుష్యమి, ఆశ్లేష, శ్రవణం, రేవతి అనే 7 నక్షత్రదినాలలో సాయంసంధ్యా సమయాలలో సింహద్వారం గడపపై మట్టి ప్రమిదలో ఉగ్గుగిన్నెడు మాత్రమే (20కు మించవద్దు) సముద్ర నీటిని పోసి, చిటికెడు పసుపును కలిపి, ఆ నీటిప్రమిదలో ఇమిడే ఇత్తడి దీపపుకుందిని ఉంచి ఆవునెయ్యి లేక కొబ్బరినూనెతో రెండువత్తులతో జ్యోతిని ప్రజ్జ్వలన చేయండి.

సింహద్వారం నుంచి లోపలికి మీరు వెళుతుంటే.... మీకు కుడివైపున ... గడపమీద ప్రజ్జ్వలన చేయండి. శ్రీ మహాలక్ష్మి అనుగ్రహ ప్రీతికై మీకు వచ్చిన స్తోత్రకదంబాన్ని భక్తి విశ్వాసాలతో జ్యోతికి చేరువగా కూర్చుని పఠించి, ఆపైన పటికబెల్లాన్ని జ్యోతికి నివేదన ఇవ్వండి. రెండవరోజు ఉదయం ఇత్తడి దీపపుకుంది దిగువన ఉంచిన మట్టి ప్రమిదలోని నీటితో సింహద్వారం ముందు ప్రోక్షించండి.

అనగా ముందుగా సింహద్వారం ముందు చీపురుతో చిమ్ముకుంటారు, మామూలు నీటితో శుద్ధి చేసుకుంటారు. శుద్ధి చేసుకున్న తదుపరి మట్టి ప్రమిదలోని పసుపు కలిపిన సముద్రనీటిని ప్రోక్షించేది. ఈ ప్రోక్షణ చేయువారు స్త్రీలై ఉండాలి. అనగా ఇంటి యజమానురాలు లేక ఇతర కుటుంబ సభ్యులలో స్త్రీలై ఉండాలి. వైధవ్యస్త్రీలు కూడా చేయవచ్చు.

శనివారం అనూరాధ నక్షత్రం మధ్యాహ్న సమయంలో సముద్రం నుంచి తెచ్చిన నీటిని ఎంతకాలమైననూ ఉపయోగించుకోవచ్చును. ఇతరులు తీసుకువచ్చిన సముద్ర జలాన్ని స్వీకరించవచ్చు. అలాగే ఈ నీటిని ఇతరులకు ఉచితంగా ఇవ్వటానికి ప్రయత్నం చేయండి. 'జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే'... అనగా ఈ జ్యోతి వెలుగుతున్నంత సేపు ఆత్మవిమర్శనా శక్తి చేతనే మీ జీవిత ఆర్థిక పూర్వాపరాలను పలుమార్లు మనఃస్ఫూర్తిగా మననం చేసుకుంటూ లక్ష్మీదేవి అనుగ్రహం ఉండాలని కోరుకోండి. ఇట్టి విమర్శనా శక్తి చేతనే మీలో హ్రీంకార జ్యోతి ఆవిర్భవించి తగిన రీతిలో ముందుకు వెళ్లటానికి, ఆర్థిక స్థితిని ఓ సరైనబాటలో ఉంచటానికి అవకాశాలు వస్తాయి. పై 7 నక్షత్రాలు సూర్యోదయం నుంచి లేకున్నప్పటికీ జ్యోతి ప్రజ్జ్వలన సమయంలో నక్షత్రం ఉంటే చాలని గమనించాలి.

## రాహునక్షత్రాల మధ్య పూర్ణిమన సంతానాభివృద్ధి

మాసంలో తులారాశిలోని స్వాతి నక్షత్రం నుంచి, కుంభరాశిలోని శతభిషా నక్షత్రం వరకు గల రోజులలో పూర్ణిమ తిథి వచ్చిన రోజున సంతానాన్ని అభివృద్ధి దిశలో తీసుకుని వెళ్లుటకు అద్భుతమైన పరిహారం కలదు. దీనిని ప్రతి కుటుంబం వారు ఎన్ని మార్లయిననూ ఆచరించవచ్చును. కేవలం వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణమాసాల పూర్ణిమ తిథి స్వాతి మరియు శతభిషా నక్షత్రాల మధ్యన వస్తుంది.

కానీ ఈ పూర్ణిమ తిథి స్వాతితో ఉండకూడదు, శతభిషంతో ఉండకూడదు. ఈ రెండింటి మధ్యనే రావాలి. ఒక్కోసారి వైశాఖమాసం రావచ్చును. రాకపోవచ్చును. స్వాతి రాహునక్షత్రమై ఒకే నక్షత్రంతో కూడి ఇంద్రనీలమణి వలె ఉంటుంది. అలాగే శతభిషం రాహునక్షత్రమై వందనక్షత్రాల కలయికతో పుష్పాకారంతో ఉంటుంది. శతభిషం ఉండే కుంభరాశి శని యొక్క స్వక్షేత్రం. స్వాతి ఉండే తులారాశి శని ఉచ్ఛ క్షేత్రం. కుంభరాశి నుంచి తులకు, తులారాశి నుంచి కుంభానికి నవపంచక స్థానాలతో ఉన్నది. ఈ రెండు రాశులు శనిగ్రహానికి సంబంధించి, ఒక్కోరాశిలో 3 గ్రహ నక్షత్రాలు ఉంటూ... ఆయా రాశులకు అటువైపు, ఇటువైపు రాశులతో సంబంధం ఉన్న రాశులు ఈ రెండు మాత్రమే. ఈ రెండురాశులకు మధ్య స్థానంలో నాల్గు పాదాలతో విరాజిల్లే నక్షత్రాలే స్వాతి, శతభిషం. తమ బిడ్డలు దిన దిన ప్రవర్ధమానమై నీలమణివలె ప్రకాశిస్తూ వందతారలు కలిసిన పుష్పంలా వికసించాలని కోరుకుంటారు.

అట్టివారలకు ఈ దిగువన ఓ అద్భుత పరిహారం ఉన్నది. ఈ పరిహారాన్ని ప్రతి సంవత్సరం ఉత్తరాయనానికి చివరలో దక్షిణాయనానికి ముందుగా ఉంటూ వసంత, గ్రీష్మ, వర్షఋతువులలో వచ్చే పూర్ణిమలు అవసరం. అవే వైశాఖంలో మహావైశాఖి, జ్యేష్ఠ మాసంలో మహాజ్యేష్ఠి, ఆషాఢంలో మహాషాఢి, శ్రావణంలో మహాశ్రావణం. ఈ నాల్గు పర్వదినాలలో వారం ఏదైనప్పటికీ, ఆనాటి రాహుకాలాలను తీసుకొనండి. ముఖ్యంగా తల్లితండ్రులలో ఒకరు ఆచరించాలి.

ఈ రాహుకాలాలలో పూర్తి సమయం మౌనంగా ఉండాలి. ఈ రాహుకాలం మధ్యలో కాఫీ, టీ ఇతర ఘనపదార్థాలు ఏమి తినకుండా ఉండాలి. మంచి నీరు తాగవచ్చును. రాహుకాలం మధ్యలో 9 నిమిషాల పాటు తేనె కలిపిన గోరువెచ్చని కప్పు పాలపై కుడి అరచేతిని మూసి శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలోని 179వ శ్లోకాన్ని 16 పర్యాయాలు పఠించి, చేయితీసి, అదే సమయంలోనే మౌనం పాటించేవారే త్రాగి... మౌనాన్ని కొనసాగించాలి. ఇతర నియమాలు ఏమీ లేవు. అన్నీ పనులు చేసుకుంటూ మౌనం పాటించ వచ్చును. మధ్యాహ్నం తదుపరి వచ్చే రాహుకాల సమయాలలో కూడా ముందు భోజనం చేయవచ్చును.

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత

mohan PUBLICATIONS

www.granthanidhi blogspot in.

వందలాది ఫ్రీ ఉచిత ఈ బుక్స్ కై వీక్షించండి..

www.mohanpublications.com

# కాలచక్రం©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

పంచాంగకర్త:

శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385

శ్రీ హేమలంబ నామ సంవత్సర ఆశ్వీజమాస శుక్ల ఏకాదశి ఆదివారం నుంచి కార్తికమాస శుక్ల ఏకాదశి మంగళవారం వరకు

# 2017 OCTOBER అక్టోబరు

మాసంలో శని, కుజుల పరస్పర వీక్షణలు అధికంతో పాటు 5 రాశులలో గ్రహ ఆచ్ఛాదనలు అధికం. పూర్తి వివరాలకై www.gargeyam.com

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.18-5.05<br>రా.కా: సా4.30-6.00 | **1**<br>శు.ఏకాదశి రా2.44<br>శ్రవణం రా8.10<br>వ.రా12.22-2.03 | **8**<br>బ.తదియ సా4.58<br>భరణి మ3.58<br>వ.రా3.00-4.28 | **15**<br>బ.ఏకాదశి రా1.05<br>ఆశ్లేష ఉ6.21<br>వ.సా6.14-7.49 | **22**<br>శు.తదియ తె4.51<br>విశాఖ మ12.23<br>వ.సా4.48-6.34 | **29**<br>శు.నవమి సా6.20<br>ధనిష్ఠ ఉ6.44<br>వ.మ2.12-3.52 |
| MON సోమ<br>దుర్ము:మ12.20-1.07<br>మ2.42-3.30<br>రా.కా:ఉ7.30-9.00 | **2**<br>శు.ద్వాదశి రా3.08<br>ధనిష్ఠ రా9.23<br>వ.తె4.43లగాయితు | **9**<br>బ.చవితి మ2.16<br>కృత్తిక మ2.02<br>వ.తె4.47లగాయితు | **16**<br>బ.ద్వాదశి రా12.26<br>మఘ ఉ6.07<br>వ.మ2.09-3.45 | **23**<br>శు.చవితి పూర్తిగా<br>అనూరాధ మ2.54<br>వ.రా9.10-10.57 | **30**<br>శు.దశమి రా7.03<br>ధనిష్ఠ ఉ6.44<br>వ.మ2.12-3.52 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.23-9.10<br>రా10.43-11.32<br>రా.కా: మ3.00-4.30 | **3**<br>శు.త్రయోదశి రా2.49<br>శతభిషం రా9.52<br>శేష వర్జ్యం ఉ6.21వరకు<br>వ.తె4.13-5.48 | **10**<br>బ.పంచమి మ11.38<br>రోహిణి మ12.09<br>వ.సా5.21-6.50 | **17**<br>బ.త్రయోదశిరా12.08<br>పూర్వఫల్గుణి ఉ6.12<br>వ.మ1.32-3.10 | **24**<br>శు.చవితి ఉ7.06<br>జ్యేష్ఠ సా5.45<br>వ.రా2.46-4.35 | **31**<br>శు.ఏకాదశి సా6.55<br>శతభిషం ఉ7.38<br>వ.మ2.03-3.39 |
| WED బుధ<br>దుర్ము:మ11.32-12.19<br>రా.కా: మ12.00-1.30 | **4**<br>శు.చతుర్దశి రా1.47<br>పూర్వాభాద్ర రా9.40<br>వర్జ్యం లేదు | **11**<br>బ.షష్ఠి ఉ9.09<br>మృగశిర ఉ10.26<br>శేషవర్జ్యం ఉ6.15వరకు<br>వ.సా6.19-7.49 | **18**<br>బ.చతుర్దశి రా12.13<br>ఉత్తర ఉ6.39<br>వ.మ3.19-4.59 | **25**<br>శు.పంచమి ఉ9.37<br>మూల రా8.49<br>వ.రా7.01-8.49 | |
| THU గురు<br>దుర్ము:ఉ9.57-10.44<br>మ2.41-3.28<br>రా.కా:మ1.30-3.00 | ○ **5**<br>ఆశ్వీజపూర్ణిమరా12.09<br>ఉత్తరాభాద్ర రా8.50<br>వ.ఉ6.56-8.29 | **15**<br>బ.సప్తమి ఉ6.55<br>బ.అష్టమి తె4.59<br>ఆర్ద్ర ఉ8.58<br>వ.రా8.22-9.53 | ● **19**<br>ఆశ్వీజఅమావాస్యరా12.41<br>హస్త ఉ7.27<br>వ.మ3.51-5.32 | **26**<br>శు.షష్ఠి మ12.17<br>పూర్వాషాఢరా11.52<br>వ.ఉ7.38-9.27 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.23-9.10<br>మ12.19-1.06<br>రా.కా:ఉ10.30-12.00 | **6**<br>బ.పాడ్యమి రా10.03<br>రేవతి రా7.31<br>వ.ఉ8.11-9.42 | **13**<br>బ.నవమి రా3.21<br>పునర్వసు ఉ7.46<br>వ.మ3.29-5.01 | **20**<br>కార్తికమాసారంభం<br>శు.పాడ్యమి రా1.37<br>చిత్త ఉ8.39<br>వ.మ2.38-4.21 | **27**<br>శు.సప్తమి మ2.44<br>ఉత్తరాషాఢరా2.42<br>వ.ఉ8.49-10.36 | |
| SAT శని<br>దుర్ము:ఉ6.01-7.36<br>రా.కా:ఉ9.00-10.30 | **7**<br>బ.విదియ రా7.36<br>అశ్వని సా5.51<br>వ.మ2.08-3.37<br>వ.రా2.42-4.10 | **14**<br>బ.దశమి రా2.03<br>పుష్యమి ఉ6.54<br>వ.రా7.24-8.58 | **21**<br>శు.విదియ రా3.00<br>స్వాతి ఉ10.18<br>వ.సా4.23-6.07 | **28**<br>శు.అష్టమి సా4.51<br>శ్రవణం రా.తె5.03<br>వ.ఉ7.05-8.51 | |

### పండుగలు

1. పాశాంకుశ ఏకాదశి మొహరం పండుగ
2. గాంధీజయంతి
5. వాల్మీకిజయంతి
8. అట్లతద్దె సంకష్టహరచతుర్థి
12. గురుమౌఢ్యారంభం
15. రమాఏకాదశి
17. ధనత్రయోదశి, ధన్వంతరీ జయంతి
17. తులాసంక్రాంతి
18. నరకచతుర్దశి యమదీప ప్రజ్వలన మాసశివరాత్రి
19. దీపావళి, లక్ష్మీపూజ కేదారవ్రతం
20. బలిపాడ్యమి కార్తికస్నానారంభం, ఆకాశదీపారంభం
21. కార్తికచంద్రోదయం, భగినీ హస్తభోజనం, సఫర్‌నెల ప్రారంభం
22. త్రిలోచనగౌరీ వ్రతం
23. నాగచతుర్థి
28. కార్తవీర్యజయంతి, తిరుమల పుష్పయాగం
30. యాజ్ఞవల్క్యజయంతి
31. ప్రభోదినీ ఏకాదశి

### అక్టోబరు శుభసమయములు

శ్రీ హేమలంబ ఆశ్వీజమాసము

| | |
|---|---|
| 01 | ఆది శు.ఏకాదశి శ్రవణం ఉ6.59-9.09 |
| 01 | ఆది శు.ఏకాదశి శ్రవణం మ11.23-1.32 |
| 01 | ఆది శు.ఏకాదశి శ్రవణం సా5.06-8.10 |
| 01 | ఆది శు.ఏకాదశి ధనిష్ఠ రా8.23-10.24 |
| 02 | సోమ శు.ద్వాదశి ధనిష్ఠ ఉ6.55-9.05 |
| 02 | సోమ శు.ద్వాదశి ధనిష్ఠ మ11.19-12.19 |
| 02 | సోమ శు.ద్వాదశి ధనిష్ఠ సా5.00-9.23 |
| 05 | గురు పూర్ణిమ ఉత్తరాభాద్ర మ11.07-1.16 |
| 05 | గురు పూర్ణిమ ఉత్తరాభాద్ర సా4.48-8.50 |
| 06 | శుక్ర బ.పాడ్యమి రేవతి ఉ6.40-8.10 |
| 06 | శుక్ర బ.పాడ్యమి రేవతి మ11.03-12.15 |
| 06 | శుక్ర బ.పాడ్యమి రేవతి సా4.43 -7.30 |
| 06 | శుక్ర బ.పాడ్యమి అశ్వని రా8.03-10.04 |
| 07 | శని బ.విదియ అశ్వని ఉ10.59-1.08 |
| 07 | శని బ.విదియ అశ్వని సా4.40-5.50 |
| 09 | సోమ బ.పంచమి రోహిణి సా4.31-9.52 |
| 11 | బుధ బ.షష్ఠి మృగశిర ఉ6.19 -8.29 |
| 12 | గురు బ.అష్టమి పునర్వసు ఉ10.45-12.48 |
| 12 | గురు బ.అష్టమి పునర్వసు సా5.53-8.20 |
| 13 | శుక్ర బ.నవమి పునర్వసు ఉ6.11-7.46 |
| 13 | శుక్ర బ.నవమి పుష్యమీ సా5.49-9.36 |
| 15 | ఆది బ.ఏకాదశి మఘ ఉ6.22 -8.13 |
| 15 | ఆది బ.ఏకాదశి మఘ ఉ10.27 -12.36 |
| 15 | ఆది బ.ఏకాదశి మఘ సా5.00-6.13 |
| 15 | ఆది బ.ఏకాదశి మఘ రా7.50-9.28 |

శ్రీ హేమలంబ కార్తికమాసము

| | |
|---|---|
| 20 | శుక్ర శు.పాడ్యమి స్వాతి ఉ10.08-12.14 |
| 20 | శుక్ర శు.పాడ్యమి స్వాతి సా5.22-9.09 |
| 22 | ఆది శు.తదియ అనూరాధ రా7.02-11.15 |
| 23 | సోమ శు.చవితి అనూరాధ ఉ9.58-12.07 |
| 25 | బుధ శు.షష్ఠి మూల ఉ9.50-11.27 |
| 25 | బుధ శు.షష్ఠి మూల సా5.04-6.50 |
| 27 | శుక్ర శు.సప్తమి ఉత్తరాషాఢ ఉ7.28-8.23 |
| 27 | శుక్ర శు.అష్టమి ఉత్తరాషాఢ సా4.56 -8.43 |
| 28 | శని శు.అష్టమి శ్రవణం ఉ8.52-9.38 |
| 28 | శని శు.నవమి శ్రవణం సా4.52-8.39 |
| 29 | ఆది శు.నవమి ధనిష్ఠ ఉ7.20-9.19 |
| 29 | ఆది శు.నవమి ధనిష్ఠ సా4.49-6.20 |
| 29 | ఆది శు.దశమి ధనిష్ఠ సా6.35-10.47 |
| 30 | సోమ శు.దశమి శతభిషం ఉ7.16 -9.30 |
| 30 | సోమ శు.దశమి శతభిషం సా4.44-6.30 |
| 30 | సోమశు.ఏకాదశి శతభిషం రా7.04-10.43 |

*Engagements*

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## చివరి క్షణాల్లో వివాహ అవాంతరాలకు పరిహారం

వివాహ నిర్ణయాలలో జాతకాలు చూసుకొని మంచి చెడులు,ఇచ్చిపుచ్చుకోవటాలు, ఇతర లాంఛనాలు అన్నీ మాట్లాడుకుంటారు. ఇక నిశ్చితార్థమే తరువాయి. ఈ లోపలే హఠాత్తుగా తమ నిర్ణయాలకు బ్రేకులు పడతాయి. కథ మొదటికొస్తుంది. ఇది మొదటి క్యాటగిరి. అలా కాక మాట మంచి, లాంఛనాలు పూర్తిచేసి నిశ్చితార్థానికి ముహూర్తం సిద్ధమవుతుంది. నిశ్చితార్థానికి ముందో లేక మరికొద్ది గంటల ముందో నిశ్చితార్థం భంగమైపోతుంది. ఇది రెండవ క్యాటగిరి. నిశ్చితార్థం కూడా పూర్తయి, వివాహ ముహూర్తాలు సిద్ధం చేసుకొని కల్యాణఘట్టపు రోజుకు ముందే... ఇరువర్గాలలో ఎవరికో ఒకరికి... ఏదో సమస్య వచ్చి వివాహమే నిలిచిపోతుంది. కుటుంబసభ్యులలో ఎవరైనా అనివార్య కారణాలచే మరణించినచో ఈవిధంగా వివాహాలు ఆగిపోవటం మనం చూస్తుంటాం. ఆ తదుపరి కొంత కాలానికి మరల మరో ముహూర్తంలో వివాహం జరుగుతుంది. ఇక్కడ కుటుంబసభ్యులకు సమస్య వచ్చి వివాహం ఆగిపోయింది. అలాకాక శాశ్వతంగా అవసరం లేదు అనుకొని వివాహం కాకుండా నిర్ణయాలన్నీ రద్దు చేసుకున్నాం అనుకున్నవారు ఉంటారు. ఇది మూడవ క్యాటగిరి.

సరిగ్గా వివాహ శుభముహూర్తానికి ముందుగా.... సినిమాలలో చూపించే విధంగా వివాహం ఆగిపోవటం అంటే పీటల మీద పెండ్లి ఆగిపోవటం అంటారు. ఈవిధంగా వివాహం ఆగిపోయినవారు కూడా ఉంటారు. ఇది నాల్గవ క్యాటగిరి. పైన చెప్పిన నాల్గు క్యాటగిరిలలో మాత్రమే సమస్యలు వచ్చినటువంటి వారు ఈ పరిహారమును ఆచరించి తదుపరి దోషము తగ్గించుకోవచ్చు. ఈ నాల్గు సందర్భాలలో కాకుండా కేవలం వివాహం మాత్రం ఆలస్యమవు తున్న వారికి ఈ పరిహారం తగదని తెలుసుకోవాలి.

ఈ పరిహారానికి ముఖ్యంగా కర్కాటక సంక్రాంతి, వృశ్చిక సంక్రాంతి, మీన సంక్రాంతి పర్వదినాలే అవసరము. కర్కాటక సంక్రాంతి అంటే.... కర్కాటకరాశిలోనికి సూర్యుడు ప్రవేశించే దినమని భావము. ఈరోజు నుంచే దక్షిణాయనము ప్రారంభమవుతుంది. ఈ కర్కాటక సంక్రమణం ప్రతి సంవత్సరం జూలై 16,17 తేదీలలోనే ప్రారంభమగును. వృశ్చిక సంక్రాంతి అంటే వృశ్చికరాశిలోనికి సూర్యుడు ప్రవేశించే దినమని అర్థము. ఈ వృశ్చిక సంక్రమణం ప్రతి సంవత్సరం నవంబర్ 17,18 తేదీలలో వస్తుంటుంది. ఇక మూడవదైన మీన సంక్రాంతి అనగా మీనరాశిలోనికి సూర్యుడు ప్రవేశించే దినము. ఈ మీనసంక్రమణం ప్రతి సంవత్సరం మార్చి నెల 14,15 తేదీలలో ప్రారంభమవుతుంటుంది. (మిగిలింది వెనుక పేజీలో)



# మకరరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:8, వ్యయం:8, రాజ్యపూజ్యం:7, అవమానం:5

శ్రీ హేమలంబ : ఆదాయం:14, వ్యయం:14, రాజ్యపూజ్యం:3, అవమానం:1

**జనవరి :** విజయపంథాలో నడుస్తారు. నూతన పథకాలను అన్వేషిస్తారు. అగ్రిమెంట్లు లాభిస్తాయి. కళత్రయోగం కలదు. స్థానచలన ఆశలు చిగురిస్తాయి. శతృవైషమ్యాలు తగ్గును. కపటస్వభావులను దూరంగా ఉంచుదురు. స్పెక్యులేషన్ దూకుడు తగ్గిస్తారు. జనవరి 14 రాత్రి 10.55 నుంచి 17 ఉదయం 5.38 వరకు వ్యతిరేక సమయము.

**ఫిబ్రవరి :** వివాద వ్యాఖ్యలపై మౌనం వహిస్తారు. కంఠం లేక ఉదర సమస్యలున్నవి. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. అవివాహితులకు అనవసర ప్రయాణాలు. వ్యక్తిగత కక్షలను తగ్గిస్తారు. కుటుంబ కలతలు తగ్గుముఖం. భాగస్వామ్య నిర్ణయాలు వాయిదా పడును. ఫిబ్రవరి 11 ఉదయం 8.55 నుంచి 13 మధ్యాహ్నం 3.13 వరకు అనుకూలం కాదు.

**మార్చి:** ధర్మావేశం ప్రతికూలమగును. వ్యాపారాదులలో లోపాలు సర్దుకుంటాయి. శుభవార్తాశ్రవణం. వాగ్ధోరణిని అదుపుచేస్తారు. కళత్రంచే ఖర్చులధికం. హామీ ప్రయత్నాలు విరమిస్తారు. ఆస్తి ఒప్పందాలు ఫలించవు. కీలక నిర్ణయాలు వాయిదా. మాసాంతంలో పరువు, ప్రతిష్ఠలకు భంగకరం కాగల సూచన. మార్చి 10 సా 4.59 నుంచి 12 రా11.56 వరకు ప్రతికూలం.

**ఏప్రిల్ :** దినచర్యలో తరచూ మార్పులుండును. సమయస్ఫూర్తి, సంయమనం పాటించలేరు. శుభకార్య చర్చలు వాయిదా. స్వవృత్తుల వారికి ఆశాభంగములున్నవి. సహాయ సహకారాలపై ఆలోచనలు అధికం చేయాలి. ముఖ్య కారణాలచే ప్రయాణాల రద్దు. వివాద విషయాలలో తలదూర్చవద్దు. కార్యసిద్ధి మాసాంతంలో కల్గును. ఇరుగు, పొరుగుతో సయోధ్య తగా ఉండాలి. ఏప్రిల్ 6 రాత్రి 11.00 నుంచి 9 ఉదయం 6.53 వరకు ముఖ్య విషయాలలో జాగ్రత్తగా నిర్ణయాలు తీసుకోవాలి.

**మే :** ఆర్థిక నష్టం పూడ్చుకుంటారు. వాస్తవ విషయాలలో గోప్యం ఉండును. ఋణ సమస్యలు స్వల్పంగా పెరుగును. హామీలకై సమయం వృధా చేయాలి. నిస్వార్ధ సేవను అందించినందున ధనవ్యయం. స్పెక్యులేషన్ లబ్ది కాదు. ఆదాయగండిని ఇతర మార్గాలలో పూడ్చుకుంటారు. అకాల భోజనాదులు తప్పవు. మాసాంతంలో స్థానచలన అవకాశములు. మే 3 రా.తె 4.29 నుంచి 6 మధ్యాహ్నం 12.33 వరకు తిరిగి 31 మధ్యాహ్నం 11.14 నుంచి జూన్ 2 సాయంత్రం 6.22 వరకు ప్రతికూల సమయాలుగా భావించాలి.

**జూన్ :** సంతానసౌఖ్యముండును. ఆర్థిక స్థితి పెరుగును. న్యాయనిర్ణయాలు అవసరము. విమర్శలకు అపనిందలకు దూరంగా ఉంటారు. వివాద వ్యాఖ్యలపై మౌనం వహించండి. ఆత్మవిశ్వాసం పెరుగును. హామీ ప్రయత్నాలు చేయరు. అవివాహితులకు యోగం కలదు. శరీర అలసట అధికము. నమ్మినవారిలో నిజమైన శత్రువులున్నారని ఆలస్యంగా గ్రహిస్తారు. స్వీయకల్పనా శక్తి పెంచాలి. స్పెక్యులేషన్ లాభించును. చంచలత్వం తగ్గును. జూన్ 27 రాత్రి 7.58 నుంచి 29 రాత్రి 1.37 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.

**జూలై :** విజయవార్తా శ్రవణం. స్తంభించిన వ్యవహారాలు లాభించును. సోదర సంఘీభావం పెరుగును. దైవ కార్యాలపై శ్రద్ధ చూపిస్తారు. వివాదాలు సర్దుమణుగును. ఆర్థిక ఇక్కట్లు తగ్గును. ముఖ్య వ్యక్తికి పెద్దపీట వేయుదురు. అకాల భోజనాదులుండును. ఆచితూచి సంభాషిస్తారు. మాతృవర్గీయులతో నూతన నిర్ణయాలు. శుభకార్య ప్రయత్నాలు ప్రారంభం చేస్తారు. జూలై 25 ఉదయం 6.01 నుంచి 27 ఉదయం 10.28 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**ఆగస్టు :** స్థానచలన అవకాశములు కలవు. పంతాలకు పట్టింపులకు వెళ్లవద్దు. రోగ బాధలకు ఉపశమనం. పాలనా నిర్ణయాలలో లోపాలను సరిచేసుకుంటారు. భయాందోళనలు విడనాడుదురు. కుటుంబ నిర్ణయాలు లాభించును. భాగస్వామ్య చర్చలు నెరవేరును. మానసిక సంఘర్షణలకు దూరంగా ఉండండి. ఎదుటివారిపై విమర్శలు చేయవద్దు. ఆగస్టు 21 మధ్యాహ్నం 3.51 నుంచి 23 రాత్రి 8.03 వరకు ప్రతికూల సమయం.

**సెప్టెంబరు :** మాసం మధ్య నుంచి ఆర్థిక లావాదేవీలలో పెను మార్పులుండును. ఉద్యోగ అంశాలలో సంజాయిషీలుండును. అవివాహితులకు అనవసర ప్రయాణాలు. హడావుడి నిర్ణయాలతో ధననష్టం. స్వయంవృత్తుల వారికి పూర్తి ఆశాజనక స్థితి. నూతన ప్రణాళికలను సిద్ధం చేయవద్దు. వివాద విషయాలలో జోక్యం వద్దు. హామీ సంతకాలకు దూరం కావాలి. సెప్టెంబరు17 రాత్రి 12.07 నుంచి 19 రా.తె 5.01 వరకు నిదానమే ప్రధానంగా భావిస్తూ ఉండాలి.

**అక్టోబరు :** సాహసకార్యాలపై దృష్టి పెంచుదురు. రహస్య సమాలోచనలు సాగిస్తారు. ముఖ్యవిషయాలలో హామీలు తీసుకుంటారు. చేదు అనుభవాలను తిప్పి కుదురు. మేధాశక్తితో నూతన మార్గాలను అన్వేషిస్తారు. మానసిక వత్తిడి తగ్గును. అనవసర ఖర్చు తగ్గి ఆదాయం పెరుగును. అమావాస్యకు ముందు వెనుకలలో స్వల్పంగా వాగ్దాన భంగములు. అక్టోబరు 15 ఉదయం 6.21 నుంచి 17 మధ్యాహ్నం 12.18 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**నవంబరు :** ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి. ధైర్య సాహసాలతో లబ్ది కల్గును. అనవసర సంజాయిషీలు ఇవ్వవద్దు. భేషజాలకు వెళ్లవద్దు. వాగ్దానాల జోరును పెంచవద్దు. ఋణభారం తగ్గును. శాంత స్వభావంతో అనుకూలత లభించును. చర్మ సంబంధ సమస్య రాగల సూచన. కళత్ర విభేదములున్నవి. అకాలభోజనాదులచే అనారోగ్యం. వివాద అంశాలపై దృష్టి వద్దు. నవంబరు 11 మధ్యాహ్నం 11.43 నుంచి 13 సాయంత్రం 6.02 వరకు అనుకూలం కాదు.

**డిశంబరు :** బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుని విమర్శలను తట్టుకుంటారు. ఆర్భాట వ్యవహారాలకు దూరంగా ఉండాలి. జీవనసరళిపై నూతన ఆలోచనలు. కుటుంబ కలతలుండవు. వ్యక్తిగత ప్రతిష్ఠలను పెంచుకుంటారు. మానసిక చింతలు తొలగును. శుభవార్తా శ్రవణం. రాజకీయ వాసులకు అనుకూలం. నూతన అగ్రిమెంట్లు ఫలిస్తాయి. స్వార్ధ బుద్ధిని తగ్గిస్తారు. డిశంబరు 8 సాయంత్రం 6.28 నుంచి 10 రాత్రి 11.43 వరకు ప్రతికూల సమయంగా గ్రహించాలి.

## చివరి క్షణాల్లో వివాహ అవాంతరాలకు పరిహారం

జాతక పొంతనలలో దోషాలు జరిగాయని ఆగిపోయినందువల్ల గానీ లేక వ్యక్తిగత అంశాలలో సమస్యల వలన గానీ... కారణం ఏదైనా నాల్గు క్యాటగిరిల ద్వారా నష్టపోయిన వారు మాత్రమే స్వాతి, శతభిష నక్షత్రాల మధ్యలో కర్కాటక, వృశ్చిక, మీన సంక్రాంతి రోజులలోనే పరిహారమును పాటించాలి. ఒకసారి పాటిస్తే చాలు.

అయితే స్వాతి నక్షత్రంతో గానీ, శతభిషా నక్షత్రంతో గానీ కూడిన కర్కాటక, వృశ్చిక, మీన సంక్రమణములు పనికిరావు. అందుకే సశాస్త్రీయంగా గణితం ఉన్న పంచాంగం ద్వారానే తెలుసుకొని పరిహారం పాటించండి.

సశాస్త్రీయ గణితమంటే... భారతప్రభుత్వం ఆమోదించిన దృక్ సిద్ధాంత పంచాంగము. ఈ దృక్సిద్ధాంత పంచాంగాలలో ఉండే సమయాలు ఖచ్చితములు, సశాస్త్రీయములు, ప్రామాణికములు. కనుక ఈ పంచాంగ సమయాల ప్రకారం చూసుకొనండి. మా కాలచక్రం, గ్రహభూమి, శ్రీచక్ర పంచాంగము మరియు ప్రస్తుత మీరు చూసే క్యాలండర్ దృక్సిద్ధాంత ప్రకారమే గణితము చేయబడినవని తెలియజేయు చున్నాము.

స్వాతి, శతభిషా నక్షత్రాల మధ్యలో వచ్చిన కర్కాటక లేక వృశ్చిక లేక మీనసంక్రమణ దినమున గోధుమపిండిలో(మార్కెట్‌లో లభించే గోధుమపిండి చాలు) బెల్లం కలిపిన నీటిని పోసి బాగా పిసికి పెద్ద పెద్దవిగా ఉండే ఏడు గుండ్రని రొట్టెల మాదిరిగా తయారుచేసుకోండి. ఆనాడు ఏ సమయంలో తయారుచేసిననూ ఫర్వాలేదు.

సమస్య ఉన్న వ్యక్తి మాత్రమే రొట్టెలు తయారుచేయాలని లేదు. కుటుంబ సభ్యులలో ఎవరైననూ తయారు చేయవచ్చును. ఈ రొట్టెలను కాల్చవద్దు. ఈ రొట్టెల పిండిలో నూనె, నెయ్యి, పాలు, పెరుగులాంటివి కలపవద్దు. 49 మంచి తమలపాకులను, 49 మంచి వక్కలను తీసుకొనండి. తమలపాకులకు తొడిమలను తీసివేసి ఆకులను శుభ్రం చేసుకోండి.

ప్రతి ఒక్క రొట్టెలో ఏడు తమలపాకులు ఉంచి అందులో ఏడు వక్కలు ఉంచి... రొట్టెను చాప చుట్టినట్లుగా చుట్టివేయండి. రెండువైపులా కొసలు మడవండి. ఈవిధంగా తయారైన రొట్టె పైన ఒక పేపరును చుట్టి దారంతో ప్యాక్ చేయండి. (హొటల్‌లో దోశలను ప్యాక్ చేసినవిధంగా) ఏడు రొట్టెలు 7ప్యాకింగ్‌లుగా తయారగును.

ఈ విధంగా తయారైన 7 రొట్టెలను కర్కాటక లేక వృశ్చిక లేక మీన సంక్రమణాలకు రెండవరోజు ఉదయం సముద్రానికి సమస్య ఉన్న వ్యక్తి తీసుకుని వెళ్లాలి. ఈ వ్యక్తితో పాటు తన కుటుంబసభ్యులను వెంట తీసుకుని వెళ్లవచ్చును. తనపై నిజమైన ప్రేమ, అభిమానం చూపించే వారినెవరినైనను తీసుకుని వెళ్లవచ్చును. ఆనాడు తానుగానీ, తనవెంట వచ్చిన ఎవరూ సముద్రస్నానాలు ఆచరించవద్దు. సూర్యోదయం నుంచి మొదటి రెండు లగ్నాలలోనే అనగా మొదటి రెండుగంటలలోనే పరిహారం సముద్రంలో పాటించాలి. రెండవరోజు సముద్రానికి వెళ్లేటప్పుడు చిన్న తేనె సీసా, ఒగ్లాసు, చెంచా, మంచినీరు కూడా 7 ప్యాకెట్‌లతో పాటు తీసుకునివెళ్లేది. అనగా ఉదయం 10 గంటలలోపే ఈ పరిహారం పాటించాలని భావము. పరిహారం పాటించే స్త్రీలు ఋతుసమయంలో ఉంటే రొట్టెలు చేసే నాటికి 6వరోజుగా ఉండాలి. రొట్టెలు చేసే రోజున ప్రత్యేక ఉపవాసాలు ఏమీ లేవు. రెండవరోజున పరిహారం పూర్తయ్యేంత వరకు వ్యక్తి ద్రవపదార్థాలు మాత్రమే తీసుకొనేది. ఘనపదార్థాలు వద్దు. ఈ సముద్రానికి వెళ్లిన రోజున ప్రత్యేక శిరస్నానాలు ఏమీ అవసరం లేదు.

ఓ సంచిలో 7 రొట్టెల ప్యాకెట్‌లను ఉంచుకుని సముద్రంలో పాదాలు తడిసే నీటిలోనే తూర్పుముఖంగా నిలబడాలి. నిలబడిన తదుపరి కొన్ని అలలు వచ్చి తన పాదాలకు తగిలి వెళ్లిన తర్వాతనే సంచిలో నుంచి 1వ ప్యాకెట్‌ను తీసుకుని రెండు చేతుల మధ్య ఉంచుకొని అల కోసం ఎదురుచూస్తుండాలి.

అల వచ్చే సమయంలో ముందుకు వంగి ఆ వచ్చే నీటిలో దోసిలిని ముంచి ప్యాకెట్‌తో మరల పైకి తీసుకుని నిలబడాలి. తిరిగి అదే అల వెనుకకు పోయే సమయంలోనే చేతిలో ఉన్న ఈ ప్యాకెట్‌ను కొద్దిగా వంగి నీటిలో వేయండి. ఒకవేళ ప్యాకెట్ వేయటానికి ముందే నీరు వెనుకకు పోయిందనుకోండి ఫర్వాలేదు. రెండవ అల వచ్చి, వెనుకకు వెళ్లే సమయంలో ప్యాకెట్‌ను సముద్రనీటిలో వదలండి.

ఈవిధంగా ఒక ప్యాకెట్‌ను దోసిలిలో ఉంచుకొని తిరిగి నీటిలో నిమజ్జనం చేసే వరకు షుమారు మూడు లేక నాలుగు నిమిషాల వరకు సమయం పడుతుంది. ఆవిధంగా ఒకదాని తదుపరి ఒకటి... వరుసగా 7 ప్యాకెట్‌లను.... ఇదే పద్ధతిలోనే... అలవచ్చే సమయంలో నీటముంచి.... తిరిగి అల వెనుకకు వెళ్లేటప్పుడు నీటిలో నిమజ్జనం చేయండి.

పైవిధంగా 7 ప్యాకెట్‌లను నిమజ్జనం చేయుటకు షుమారు 20 నుంచి 30 నిముషాలు సమయం పడుతుంది. ఇంకా సమయం కూడా తగ్గవచ్చును. నిమజ్జనం చేసే సమయంలో మౌనం పాటించటం ప్రధానం. అంతేకాక నిమజ్జనం భక్తి విశ్వాసాలతోనే ఆచరించేది.

7 ప్యాకెట్‌లను నిమజ్జనం చేసిన తదుపరి.... సముద్రనీటిలోనే ఉండి భక్తితో, మనస్ఫూర్తిగా చేతులు జోడించి ఆ సముద్రునికి నమస్కరించేది. తదుపరి తూర్పుదిశలోనే ఉండి సంచిలోని గ్లాసు తీసుకుని అందులో కొద్దినీరు, తేనె వేసి చెంచాతో కలుపుకుని, ఆగ్లాసును రెండు చేతుల మధ్య దోసిలిలో ఉంచుకొని మరల జగద్రక్షకుడైన శ్రీ సూర్యనారాయణ స్వామికి వినయంతో, విధేయతతో సూర్యదేవునకు నమస్కరించి... తన భవిష్య జీవితంలో వివాహ ఘట్టం చక్కగా... సమస్యలు లేకుండా ముందుకు సాగాలని కోరుకుంటూ.... గ్లాసులోని తేనె కలిపిన నీటిని త్రాగివేసి గ్లాసును తిరిగి తెచ్చుకొనేది. గమనిక పొరపాటున చెంచాగానీ, తేనె సీసాగానీ, గ్లాసుగానీ చేయిజారి నీటిలో పడి.... తిరిగి వాటిని తీసుకొనటానికి అవకాశం ఉన్నపటికి తీసుకొనవద్దు. ఆమధ్యాహ్నం చక్కగా భోజనం చేసేది.

కాలచక్ర పంచాంగకర్త : త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత



# కాలచక్రం ©

## జ్యోతిష రెమిడీస్ కేలండర్


పంచాంగకర్త:

శ్రీ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి|| నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9348032385, 9348632385


శ్రీ హేమలంబ నామ సంవత్సర కార్తికమాస శుక్ల ద్వాదశి బుధవారం నుంచి మార్గశిరమాస శుక్ల ఏకాదశి గురువారం వరకు

# 2017 NOVEMBER నవంబరు

మాసంలో అధికంగా కుజ, శనుల పరస్పర వీక్షణలున్నవి. దీని ప్రభావం ఎలా ఉంటుందో తెలుసుకోవటానికి పరిహారాలు ఆచరించటానికి www.gargeyam.com చూడండి.

### పండుగలు

1. క్షీరాబ్దిద్వాదశి
2. చిల్కుద్వాదశి వైకుంఠచతుర్దశి
3. త్రిపురోత్సవం, జ్వాలాతోరణం (ప్రదోషవ్యాపినీ)
4. మహాకార్తీకి
5. భానుకృత్తిక దీపపూజ
7. సంకష్టహరచతుర్థి
9. గురుమౌఢ్యత్యాగం
14. ఉత్థానఏకాదశి
16. వృశ్చికసంక్రాంతి మాసశివరాత్రి
19. కోటిసూర్యగ్రహణ పుణ్యస్నాన ఫలదినం

| వారం | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.00-4.46<br>రా.కా: సా4.30-6.00 | | 5<br>బ.పాడ్యమి ఉ7.39<br>బ.విదియ తె4.18<br>కృత్తిక రా10.31<br>వ.మ11.49-1.14 | 12<br>బ.నవమి మ12.42<br>మఘ మ11.33<br>వ.రా7.39-9.16 | 19<br>మార్గశిరమాసారంభం<br>శు.పాడ్యమి రా7.14<br>అనూరాధ రా9.58<br>వ.తె4.13-6.01 | 26<br>శు.సప్తమి ఉ9.50<br>ధనిష్ఠ మ3.04<br>వ.రా10.44-12.26 |
| MON సోమ<br>దుర్ము: మ12.13-12.59<br>మ2.29-3.15<br>రా.కా: ఉ7.30-9.00 | | 6<br>బ.తదియ రా12.58<br>రోహిణి రా7.56<br>వ.మ12.48-2.13<br>వ.రా12.58-2.24 | 13<br>బ.దశమి మ12.25<br>పుబ్బ మ11.51<br>వ.రా7.17-8.56 | 20<br>శు.విదియ రా9.36<br>జ్యేష్ఠ రా12.48<br>వర్జ్యం లేదు | 27<br>శు.అష్టమి మ11.02<br>శతభిషం సా4.38<br>వ.రా11.13-12.52 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.27-9.12<br>రా10.35-11.25<br>రా.కా: మ3.00-4.30 | | 7<br>బ.చవితి రా9.51<br>మృగశిర సా5.30<br>వ.రా1.09-2.37 | 14<br>బ.ఏకాదశి మ12.35<br>ఉత్తర మ12.37<br>వ.రా9.25-11.06 | 21<br>శు.తదియ రా12.11<br>మూల రా3.51<br>వ.ఉ9.49-11.37<br>వ.రా2.03-3.51 | 28<br>శు.నవమి మ11.24<br>పూర్వాభాద్ర సా5.21<br>వ.రా2.54-4.29 |
| WED బుధ<br>దుర్ము: మ11.28-12.13<br>రా.కా: మ12.00-1.30 | 1<br>శు.ద్వాదశి సా5.56<br>పూర్వాభాద్ర ఉ7.41<br>వ.సా4.59-6.32 | 8<br>బ.పంచమి రా7.03<br>ఆర్ద్ర మ3.22<br>వ.రా2.30-4.00 | 15<br>బ.ద్వాదశి మ1.10<br>హస్త మ1.46<br>వ.రా10.17-11.59 | 22<br>శు.చవితి రా2.54<br>పూర్వాషాఢ పూర్తిగా<br>వ.మ2.42-4.31 | 29<br>శు.దశమి ఉ10.51<br>ఉత్తరాభాద్ర సా5.13<br>వ.తె4.43-6.15 |
| THU గురు<br>దుర్ము: ఉ9.56-10.42<br>మ2.30-3.16<br>రా.కా: మ1.30-3.00 | 2<br>శు.త్రయోదశి సా4.11<br>ఉత్తరాభాద్ర ఉ6.56<br>రేవతి తె5.29<br>వ.సా6.13-7.43 | 9<br>బ.షష్ఠి సా4.41<br>పునర్వసు మ1.39<br>వ.రా9.14-10.46 | 16<br>బ.త్రయోదశి మ2.09<br>చిత్ర మ3.18<br>వ.రా9.21-11.04 | 23<br>శు.పంచమి తె5.34<br>పూర్వాషాఢ ఉ6.59<br>వ.సా4.01-5.49 | 30<br>శు.ఏకాదశి ఉ9.26<br>రేవతి సా4.13<br>వర్జ్యం లేదు |
| FRI శుక్ర<br>దుర్ము: ఉ8.25-9.11<br>మ12.13-12.59<br>రా.కా: ఉ10.30-12.00 | 3<br>శు.చతుర్దశి మ1.46<br>అశ్వని రా3.29<br>వ.రా11.49-1.17 | 10<br>బ.సప్తమి మ2.50<br>పుష్యమి మ12.26<br>వ.రా12.51-2.24 | 17<br>బ.చతుర్దశి మ3.29<br>స్వాతి సా5.11<br>వ.రా11.18-1.03 | 24<br>శు.షష్ఠి పూర్తిగా<br>ఉత్తరాషాఢ ఉ10.03<br>వ.మ2.31-4.18 | 20. మార్గశిరమాస చంద్రోదయం<br>21. రబ్బీలవ్వల్‌నెలారంభం<br>24. సుబ్రహ్మణ్యషష్ఠి<br>28. శుక్రమౌఢ్యారంభం<br>30. మోక్షదాఏకాదశి |
| SAT శని<br>దుర్ము: ఉ6.09-7.40<br>రా.కా: ఉ9.00-10.30 | ○ 4<br>పూర్ణిమ ఉ10.52<br>భరణి రా1.06<br>వ.మ12.08-1.34 | 11<br>బ.అష్టమి మ1.30<br>ఆశ్లేష మ11.43<br>వ.రా11.38-1.13 | ● 18<br>కార్తికఅమావాస్యసా5.11<br>విశాఖ రా7.25<br>వ.రా11.50-1.36 | 25<br>శు.షష్ఠి ఉ7.57<br>శ్రవణం మ12.49<br>వ.సా5.11-6.57 | నవంబరు 9/10 రాత్రి 12.30గం॥లకు గురు మౌఢ్యమి త్యాగమగును. ఈ నెల 28/29 రాత్రి 12.42 గం॥లకు శుక్ర మౌఢ్యమి ప్రారంభం |

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### నవంబరు శుభసమయములు

**శ్రీ హేమలంబ కార్తికమాసము**

01 బుధ శు.ద్వాదశి ఉత్తరాభాద్ర ఉ7.42-9.22
01 బుధ శు.త్రయోదశి ఉత్తరాభాద్ర సా6.35 -10.35
02 గురు శు.త్రయోదశి రేవతి ఉ7.04-9.18
02 గురు శు.చతుర్దశి రేవతి రా7.44-10.31
03 శుక్ర శు.చతుర్దశి అశ్వని ఉ7.00-8.24
03 శుక్ర పూర్ణిమ అశ్వని సా6.14-10.27
06 సోమ బ.తదియ రోహిణి ఉ6.48-9.02
06 సోమ బ.తదియ రోహిణి సా4.16-7.56
08 బుధ బ.పంచమి పునర్వసు సా4.08-7.03
08 బుధ బ.షష్ఠి పునర్వసు రా7.55-10.07
09 గురు బ.షష్ఠి పునర్వసు ఉ8.05 -8.51
09 గురు బ.సప్తమి పుష్యమి సా4.45-9.10
10 శుక్ర బ.సప్తమి పుష్యమి ఉ6.34-8.26
11 శని బ.నవమి మఘ సా5.45-9.58
12 ఆది బ.నవమి మఘ ఉ6.27-8.41
13 సోమ బ.ఏకాదశి ఉత్తర మ3.51-7.15
13 సోమ బ.ఏకాదశి ఉత్తర రా8.57-9.50

**శ్రీ హేమలంబ మార్గశిరమాసము**

19 ఆది శు.పాడ్యమి అనూరాధ సా5.13-7.14
19 ఆది శు.విదియ అనూరాధ రా7.14-9.26
23 గురు శు.పంచమి ఉత్తరాషాఢ మ1.37-2.29
23 గురు శు.పంచమి ఉత్తరాషాఢ సా5.50-6.58
24 శుక్ర శు.షష్ఠి శ్రవణం సా4.20-6.54
25 శని శు.సప్తమి ధనిష్ఠ మ1.20-5.10
26 ఆది శు.అష్టమి ధనిష్ఠ మ1.25-3.04
26 ఆది శు.అష్టమి శతభిషం సా4.45-8.58
27 సోమ శు.నవమి శతభిషం మ1.21-2.29
27 సోమ శు.నవమి శతభిషం మ3.16-4.38
29 బుధ శు.ఏకాదశి ఉత్తరాభాద్ర మ1.13-5.13
29 బుధ శు.ఏకాదశి రేవతి సా5.14-8.46
30 గురు శు.ద్వాదశి రేవతి మ11.50-1.09
30 గురు శు.ద్వాదశి అశ్వని సా4.29-8.42

*Engagements*

## ప్రేమానురాగ బంధం పరిఢవిల్లుటకు

భార్యాభర్తలు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, సంతానంతో తల్లితండ్రుల మధ్య ప్రేమానురాగ బంధం అభివృద్ధిలో ఉండి, ఎట్టి కలహాలకు దారితీయకుండా, విడిపోకుండా ఉండటానికి పాటించదగిన పరిహారముంది. ఒక గరిటెలో, ఒక చెంచా పంచదార వేసి, తక్కువ సెగతో ఉన్న పొయ్యిమీద ఉంచితే చక్కెర మాడిపోతుంది. వైజ్ఞానిక పరిభాషలో దీనినే క్యారమెల్ అంటారు. ఎక్కువగా మద్యపాన పరిశ్రమలలో ఈ క్యారమెల్‌ను ఉపయోగిస్తారు. అనగా మద్యానికి రంగు రావటానికై వాడే పదార్థాన్నే క్యారమెల్ అంటారు. ఇట్టి క్యారమెల్‌తో విజయాలను సాధించే అవకాశాలు కూడా ఎక్కువగా ఉన్నాయి.ఇట్టి అవకాశాలు ప్రత్యేక నక్షత్రాలు కలిసిన ప్రత్యేక వారాలలోనే ఉంటాయి. మరి ఆయా రోజులలో ఎలా పాటించాలో తెలుసుకోవటానికి ప్రయత్నం చేయండి. ఈ క్యారమెల్ తిలకాన్ని ఏరోజైనా, ఏ సమయంలోనైనా తయారుచేసుకోవచ్చు.

తక్కువ సెగమీద ఉంచిన పంచదార మాడిపోయే సమయంలో దించేయండి. దానిలో కొన్ని చుక్కలు నీటిని వేయండి. మాడిన పదార్థాన్ని చూపుడువ్రేలుతో త్రిప్పండి. చేతికి తిలకం లాగా అంటుకుంటుంది. ఇలా అంటుకున్న తిలకాన్ని కంఠానికి పెట్టుకోవాలి. ఎప్పుడు?

బుధవారం నాడు రాహుకాలం మధ్యాహ్నం 12గంటల నుంచి 1గంట30నిముషాల వరకు ఉంటుంది. ఈ రాహుకాల సమయంలో స్వాతి నక్షత్రం ఉండాలి. కనుక స్వాతి నక్షత్రంతో కూడిన బుధవార రాహుకాల సమయంలోనే కంఠానికి క్యారమెల్ తిలకాన్ని ధరించండి.

శుక్రవారం నాడు రాహుకాలం ఉదయం 10గంటల 30 నిముషాల నుంచి 12 గంటల వరకు ఉంటుంది. ఈ రాహుకాల సమయంలో జ్యేష్ఠ నక్షత్రం ఉండాలి. కనుక జ్యేష్ఠ నక్షత్రంతో కూడిన శుక్రవార రాహుకాల సమయంలో క్యారమెల్ తిలకాన్ని కంఠానికి పెట్టుకోండి.

శనివారం నాడు రాహుకాలం ఉదయం 9గంటల నుంచి 10గంటల 30నిముషాల వరకు ఉంటుంది. ఈ రాహుకాల సమయంలో విశాఖ నక్షత్రం ఉండాలి. కనుక విశాఖ నక్షత్రంతో కూడిన శనివార రాహుకాల సమయంలో క్యారమెల్ తిలకాన్ని కంఠానికి ధరించండి.

పై నక్షత్రాలు, పై వారాలలోని రాహుకాలలో వస్తేనే క్యారమెల్ తిలకాన్ని ధరించండి. లేనిచో ధరించవద్దు. ఒకసారి క్యారమెల్ తయారుచేసుకుంటే ఎంతకాలమైనా దాని ప్రభావం పోదు. ఎండిపోయిననూ, ఒకటి లేక రెండు నీటి బిందువులు వేసి చూపుడువ్రేలుతో రంగరిస్తే తిరిగి క్యారమెల్ తిలకం చేతికంటుకుంటుంది. ఆచరించాల్సిన ఎట్టి నియమాలు లేవు. ఉపవాస దీక్షలు లేవు. ఋతుస్త్రీలు ధరించకూడదు. ధరించిన పిదప ఋతుమతైనచో కడిగేసుకోండి.



# కుంభరాశి



శ్రీ దుర్ముఖి : ఆదాయం:8, వ్యయం:8, రాజ్యపూజ్యం:3, అవమానం:5

శ్రీ హేమలంబ: ఆదాయం:14, వ్యయం:14, రాజ్యపూజ్యం:6, అవమానం:1

**జనవరి :** తోబుట్టువులతో మాటపట్టింపులు. అవినీతి కార్యాలను వ్యతిరేకించలేరు. ఆహారవిహారాలలో ఆనందంగా సాగుదురు. మాసాంతంలో సంకటాలు అధికము. నిందలు, విమర్శలు పెరుగును. వ్యూహాత్మక ఆలోచనలు చేయలేరు. భూలావాదేవీలు వాయిదా పడును. సంతాన సమస్యలు తగ్గును. ఆదాయం పెరుగును. ప్రశంసలకు, ఆర్భాటాలకు ప్రాధాన్యత వద్దు. జనవరి 15 ఉదయం 5.38 నుంచి 19 మధ్యాహ్నం 3.54 వరకు వ్యతిరేకము.

**ఫిబ్రవరి:** శరీరానికి వైద్యసేవలవసరము. మాసం మధ్యలో మిత్రభేధములు కలవు. హామీలు నెరవేర్చగలరు. వివాదాంశాలు తొలగును. స్పెక్యులేషన్ రాణించును. ఋణదాతల నిర్ణయాలను శిరసావహిస్తారు. మాసాంతంలో ఊహించని ఖర్చులు పెరుగును. కీలక నిర్ణయాలలో ప్రధానపాత్ర పోషిస్తారు. ఫిబ్రవరి 13 మధ్యాహ్నం 3.13 నుంచి 15 అర్ధరాత్రి 12.36 వరకు అనుకూల సమయం కాదని భావించాలి.

**మార్చి :** వ్యక్తిగత ప్రతిష్ఠలకు వెళ్లుటచే ఖర్చులు పెరుగును. మాసం మధ్యలో మనఃక్లేశములు. తోబుట్టువులు సహకరించలేరు. కుటుంబ నిర్ణయాలు వ్యతిరేకములు. భాగస్వామ్య నిర్ణయాలలో లోపాలు. అవివాహితులకు స్వల్ప సమస్యలు. 3వవారంలో క్షమాపణలు అధికము. సంయమనం పాటించి మాసాంతంలో విజయం సాధిస్తారు. మార్చి 12 రాత్రి 11.56 నుంచి 15 ఉదయం 9.11 వరకు ప్రతికూల సమయం.

**ఏప్రిల్ :** స్వయంరంగాల వారికి విజయప్రాప్తి. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. శుభకరచర్చలచే లబ్ధి. వ్యక్తిగత ప్రతిష్ఠలచే ధనవ్యయం. కళత్రభోగం పరిధ విల్లును. స్పెక్యులేషన్‌లో స్వల్ప లాభం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులధికం. మనో సంకటాలు తగ్గును. అంచనాలు వాస్తవరూపం దాల్చవు. ఏప్రిల్ 9 ఉదయం 6.53 నుంచి 11 సాయంత్రం 4.40 వరకు ముఖ్యఅంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**మే :** రహస్య మంతనాలు తగ్గించాలి. సంతానానికి సహాయం అందిస్తారు. మాసం మధ్యలో హడావుడి ప్రయత్నాలు. రాజీధోరణితో వెళ్లుట ఉత్తమం. పరిష్కారం కాని సమస్యకు మోక్షం కల్గును. సోదరులతో చికాకులున్నవి. చంచలత్వం తగ్గించుకోండి. ఆరోగ్యంపై శ్రద్ధ చూపించాలి. మే 6 మధ్యాహ్నం 12.33 నుంచి 8 రాత్రి 10.53 వరకు కీలకనిర్ణయాలలో ఆచితూచి వ్యవహరించాలి.

**జూన్ :** విశేష వ్యక్తుల పరిచయాలు పెరుగును. అవివాహితులకు శుభవార్తలు. బంధువులతో ఐక్యత పెరిగి ఆదాయం పెరుగును. శత్రువర్గీయులను తక్కువ అంచనా వేయవద్దు. శారీరక అలసట పెరుగును. నేత్ర దంత రుగ్మతలు ఏర్పడు సూచన. రెండవ పక్షంలో వ్యూహాత్మకంగా పావులు కదపాలి. జూన్ 2 సాయంత్రం 6.22 నుంచి 4 రా.తె 4.36 వరకు తిరిగి 29 రాత్రి 1.37 నుంచి జూలై 2 ఉదయం 10.55 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూలై :** కీలక నిర్ణయాలలో ముఖ్య పాత్రధారిగా వద్దు. గౌరవమర్యాదలను కాపాడు కుంటారు. సాత్వికత్వం, చలాకీతనం, చిరుమందహాసాలతో ఇతరులను ఆకర్షి స్తారు. ఋణ బాధలుండవు. పెద్ద వ్యక్తుల పరిచయాలకై శ్రద్ధ చూపిస్తారు. రహస్య సమాచారాన్ని సేకరిస్తారు. ఎదుటివారిపై ఆగ్రహావేశాలు తగ్గిస్తారు. కళత్రంచే ఖర్చులధికం. స్థానచలన ఆశలు నిరాశలగును. జూలై 27 ఉదయం 10.28 నుంచి 29 సాయంత్రం 6.32 వరకు అనుకూల సమయం కాదు.

**ఆగస్టు :** భూ లావాదేవీలు ఫలించను. శత్రుపీడ తగ్గును. ఆర్థిక విషయాలలో హామీలు ఇవ్వవద్దు. కార్యసిద్ధికి ఆటంకములున్నవి. దూర ప్రయాణాలు రద్దగును. పరనిందారోపణలచే సమస్యలున్నవి. కల్మష అంశాలకు దూరంగా ఉండాలి. అనవసర పైరవీలచే లబ్ధి తగ్గును. రాజకీయ వాసులకు సమస్యలు పెరుగును. స్వవృత్తుల వారికి మేలైన వార్తలచే విజయప్రాప్తి. ఆగస్టు 23 రాత్రి 8.03 నుంచి 25 రాత్రి 3.14 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**సెప్టెంబరు :** కపటస్వభావులు తరచూ ఎదురగుదురు. ధర్మావేశం అనుకూలం కాదు. విధి విధానాలలో అధిక మార్పులు. వ్యూహాత్మక నిర్ణయాలను తీసుకోలేరు. వాగ్ధోరణిని అదుపు చేయండి. సంతానసౌఖ్యం కల్గును. స్నేహసంబంధాలు పెరుగును. ఆర్థిక చిక్కులు తగ్గును. ఆచితూచి సంభాషించినందున ముఖ్య వ్యవహారాలలో కార్యసిద్ధి. సెప్టెంబరు 19 రా.తె 5.01 నుంచి 22 మధ్యాహ్నం 12.06 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**అక్టోబరు:** ఆర్థికచిక్కులు, విసుగు, ఆందోళన పెరుగును. దైవకార్యాచరణపై ఆసక్తి చూపుదురు. పరువు, ప్రతిష్ఠలకు భంగకరం. ఉద్యోగాదులలో ప్రతికూలతలు స్వల్పంగా పెరుగును. స్థిరాదాయం మందగించును. మాసాంతంలో కుటుంబకలతలు సర్దుమణుగును. వివేకంతో అన్నీ అంశాలు గమనిస్తూ, పిత్రార్జిత అంశాలపై దృష్టి అధికం చేయాలి. పాలనా శక్తులు తగ్గును. అక్టోబరు 17 మధ్యాహ్నం 12.18 నుంచి 19 రాత్రి 8.03 వరకు ఆవేశాలకు లోనుకాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**నవంబరు :** శత్రువర్గ వైషమ్యాల బెడద ఉంది. అసత్య ఆరోపణలు చేయవద్దు. శుభకార్యా చరణకు అనుకూలం. చేసిన తప్పును కప్పిపుచ్చవద్దు. ప్రధాన శత్రువులు ఆరాతీసి పరువు తీస్తారు. కంఠం నుంచి ఉదరం వరకు సమస్యలున్నవి. మిత్ర శత్రుత్వాలు గమనించి రెండవ పక్షంలో నిర్ణయాలు తీసుకోవాలి. సాహస ప్రయత్నాలతో ధననష్టం. స్వీయకల్పనాశక్తి పెంచండి. నవంబరు 13 సాయంత్రం 6.02 నుంచి 15 రాత్రి 2.32 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**డిశంబరు :** గుప్త సమాచారాన్ని సేకరిస్తారు. శుభసంకేతాలు అందును. ఆర్థికమాంద్యం ఉండదు. ఆత్మవిశ్వాసం పెరుగును. శత్రువులపై విజయం సాధిస్తారు. ముఖ్య ప్రయాణాలు లాభించును. స్వవృత్తుల వారికి ఆశాజనకం. ఉద్రిక్తతలకు వెళ్లకండి. కాలిపిక్కలకు రుగ్మత ఏర్పడును. మాసాంతంలో చేదు అనుభవాలుండి సృజనాత్మక శక్తి తగ్గును. నూతన ఆలోచనలు చేయవద్దు. డిశంబరు 10 రాత్రి 11.43 నుంచి 13 ఉదయం 8.08 వరకు సమయం వ్యతిరేకమని భావించాలి.

## వధూవరుల వివాహ పొంతనలకు జన్మనక్షత్ర ప్రకారం అనుకూలమైన నక్షత్రాలు

| అశ్వని | భరణి | ★ కృత్తిక 1వపాదం | మఖ | పుబ్బ | ★ ఉత్తర 1వపాదం |
|---|---|---|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ మృగశిర అశ్వని చిత్ర3,4 (తుల) ధనిష్ఠ ఆర్ద్ర స్వాతి శతభిషం పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి | కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల | రోహిణి శ్రవణం మృగశిర చిత్ర3,4 (తుల) ధనిష్ఠ పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మఖ మూల భరణి పుబ్బ పూర్వాషాఢ | భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) ఆర్ద్ర మృగశిర చిత్ర స్వాతి ధనిష్ఠ3,4 (కుంభం) శతభిషం పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | ఉత్తర కృత్తిక రోహిణి హస్త ఉత్తరాషాఢ1(ధనస్సు) శతభిషం ఆర్ద్ర స్వాతి అశ్వని పునర్వసు విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర1,2,3(కుంభం) మూల ఆశ్లేష మఘ పుబ్బ | హస్త రోహిణి మృగశిర చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) మూల పునర్వసు విశాఖ అశ్వని పుష్యమి పూర్వాభాద్ర1,2,3 (కుంభం) అనూరాధ మఖ భరణి పుబ్బ పూర్వాషాఢ |
| **★ కృత్తిక 2,3,4 పాదాలు** | **రోహిణి** | **★ మృగశిర 1,2 పాదాలు** | **★ ఉత్తర 2,3,4 పాదాలు** | **హస్త** | **★ చిత్ర 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చికం) పూర్వాభాద్ర పుబ్బ పుష్యమి అనూరాధ భరణి ఉత్తరాభాద్ర అశ్వని మఖ | మృగశిర చిత్ర1,2(తుల) ధనిష్ఠ ఆర్ద్ర శతభిషం కృత్తిక పుష్యమి అనూరాధ రోహిణి ఉ.భాద్ర రేవతి ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ ఉత్తర ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) | ఆర్ద్ర శతభిషం పునర్వసు విశాఖ4 (వృశ్చికం) శ్రవణం పూర్వాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ2,3,4 (మకరం) రోహిణి హస్త | హస్త రోహిణి శ్రవణం మృగశిర చిత్ర పునర్వసు ధనిష్ఠ1,2 (మకరం) విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) పుబ్బ పుష్యమి మఖ అనూరాధ మూల ఉత్తరాభాద్ర పూర్వాషాఢ | మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర స్వాతి హస్త పుష్యమి అనూరాధ రేవతి ఉత్తరభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ ఉత్తర ఉ.షాఢ కృత్తిక2,3,4 (వృషభం) | స్వాతి ఆర్ద్ర విశాఖ పునర్వసు పూర్వాభాద్ర4 (మీనం) రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల మఖ ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక2,3,4 (వృషభం) రోహిణి హస్త శ్రవణం చిత్ర |
| **★ మృగశిర 3,4 పాదాలు** | **ఆర్ద్ర** | **★ పునర్వసు 1,2,3 పాదాలు** | **★ చిత్ర 3,4 పాదాలు** | **స్వాతి** | **★ విశాఖ 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ1,2,3(తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ1 (ధనస్సు) రోహిణి హస్త | పునర్వసు విశాఖ1,2,3(తుల) ఆర్ద్ర పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మృగశిర మఖ మూల భరణి పుబ్బ హస్త పూర్వాషాఢ రోహిణి చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) | పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) చిత్ర మృగశిర ధనిష్ఠ3,4(కుంభం) ఆర్ద్ర స్వాతి శతభిషం | స్వాతి ఆర్ద్ర శతభిషం పునర్వసు ఆశ్లేష విశాఖ పూర్వాభాద్ర1,2,3 (కుంభం) జ్యేష్ఠ అశ్వని మఖ మూల ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక1 (మేషం) హస్త శ్రవణం చిత్ర | విశాఖ పునర్వసు హస్త ధనిష్ఠ మృగశిర3,4 (మిధునం) పూర్వాభాద్ర1,2,3 (కుంభం) పుబ్బ అశ్వని పుష్యమి మఖ అనూరాధ శ్రవణం మూల పూర్వాషాఢ భరణి చిత్ర | పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ స్వాతి పూర్వాషాఢ కృత్తిక1 (మేషం) ఉత్తర ఉత్తరాషాఢ ధనిష్ఠ చిత్ర మృగశిర3,4 (మిధునం) శతభిషం ఆర్ద్ర |
| **★ పునర్వసు 4వ పాదం** | **పుష్యమి** | **ఆశ్లేష** | **★ విశాఖ 4వ పాదం** | **అనూరాధ** | **జ్యేష్ఠ** |
| పుష్యమి అనూరాధ స్వాతి ఉత్తరాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి భరణి పుబ్బ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ2,3,4 (మకరం) మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఘ కృత్తిక ఉత్తర పుష్యమి ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) రోహిణి హస్త శ్రవణం ఆర్ద్ర స్వాతి పునర్వసు విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) | మఘ అశ్వని భరణి పుబ్బ రోహిణి హస్త శ్రవణం చిత్ర పునర్వసు విశాఖ పుష్యమి పూర్వాభాద్ర4 (మీనం) మృగశిర ధనిష్ఠ1,2(మకరం) అనూరాధ ఉత్తరాభాద్ర | అనూరాధ పుష్యమి రేవతి ఉత్తరాభాద్ర పుబ్బ ఆశ్లేష చిత్ర జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తర స్వాతి విశాఖ ఉత్తరాషాఢ శతభిషం ధనిష్ఠ కృత్తిక2,3,4 (వృషభం) మృగశిర1,2 (వృషభం) | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి మఖ మూల కృత్తిక2,3,4(వృషభం) స్వాతి ఉత్తర ఉత్తరాషాఢ రోహిణి హస్త విశాఖ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర పునర్వసు (కర్కా) అనూరాధ | మూల మఖ పుబ్బ అనూరాధ పూర్వాషాఢ రోహిణి హస్త చిత్ర శ్రవణం మృగశిర1,2 (వృషభం) ధనిష్ఠ విశాఖ పుష్యమి పునర్వసు4 (కర్కాటకం) పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర |

రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘ, విశాఖ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి అను 8 నక్షత్రములు వివాహాలలో స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో శుభప్రదమే కానీ అశుభము కాదు. కనుక పై 8 నక్షత్రముల వారు ఆ నక్షత్ర జాతకులని వివాహం చేసుకొనవచ్చును. అశ్వని, కృత్తిక, మృగశిర, పునర్వసు, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అను 11 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో మధ్యమ ఫలప్రదమే కానీ నింద్యము కాదు. భరణి, ఆశ్లేష, స్వాతి, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర అను 8 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకటైనచో వివాహము చేయరాదు.

